# దివ్యజ్ఞానసారము



చిట్టమూరు రామయ్య, బి. ఏ., ఎల్. టి., చే రచితము



రెండవకూర్పు

వసంత ఇన్‌స్టిట్యూట్ వారిచే ప్రచురితము

1937

# పీఠిక

'దివ్యజ్ఞానదీపిక' అను మాసపత్రిక ప్రారంభమైనది మొదలు అప్పుడప్పుడు ఆ పత్రికయందు బ్రహ్మవిద్యావిషయములగు వ్యాసములు పెక్కులు వ్రాసియుంటిని. ఆ వ్యాసముల కొన్నింటిని పుస్తకరూపముగ ముద్రించిన పెక్కండ్రకు చాల ఉపయోగముగ నుండునని పాఠకమహాశయులు కొందరు పలుమారు కోరుటవలన వాటి నొక్కటిగ చేర్చి, కొన్ని క్రొత్త యుపన్యాసములను సైతము చేర్చి యీ చిన్న పుస్తకము ప్రచురము చేయబూనితిని.

ఇందలి వ్యాసములు వేర్వేరుగ విశేష కాలవ్యవధితో వ్రాయబడి యుండుటంబట్టి కొన్ని మూలాంశములు, పునః పునః వ్రాయవలసి యుండెను. ఇపుడు గ్రంథరూపముగ నొకచో ముద్రించినపుడు అ విషయములు విశేష పునరుక్తిగ దోచును. అయినను, ఆ విషయములు తిరిగి తిరిగి చదువుట ద్వారా మనస్సున నాటదగిన విషయము లగుటచేతను, ఆ యా వ్యాసములు చదువునపుడు సందర్భమునకు ఉచితముగ నుండుటం బట్టియు, వాని నట్లే యుంచితిని. చదువరులు ఆమోదించి మన్నింతురని ప్రార్థన.

ఇందు "అదృశ్యసహాయులు" అను శీర్షికతో నా సోదరుడు చిట్టమూరు సుబ్బరామయ్య దివ్యజ్ఞానదీపికయందు

వ్రాసియుండు వ్యాసమును సైతము, వారి యనుమతితో చేర్చితిని.

ఇందలి విషయములు నాచేత పూర్వము రచింపబడి, ఇపుడు రెండవకూర్పు ముద్రింపబడియుండు బ్రహ్మవిద్యాదర్పణమునందలి విషయములు కావు. రెండధ్యాయములు తప్ప తక్కినవి అన్నియు ప్రత్యేక విషయములు. ఈ పుస్తకము బ్రహ్మవిద్యాదర్పణమునకు అనుబంధముగ ఎంచదగునుగాని దాని సంగ్రహము కాదు.

ఈ చిన్నగ్రంథము పారమార్థిక బుద్ధిగల జిజ్ఞాసువులకు పెక్కుండ్రకు ఉపయోగించునని జీవన్ముక్తులగు పరమగురువులం ప్రార్థించెద.

ఈ గ్రంథ ముద్రణమునకై ద్రవ్యసహాయ మొసంగిన, మచిలీబందరుపుర వాస్తవ్యులగు మహారాజరాజశ్రీ ఉదయగిరి గోపాలరత్నముగారికి నేను కృతజ్ఞుడను.

ఈ గ్రంథము అచ్చొత్తించుటలో లేఖకప్రమాదజనిత దోషములను సవరించి, అచ్చు ప్రథమ ప్రతులను దిద్ది గ్రంథపరిసమాప్తిని కొనసాగించిన బ్రహ్మశ్రీ అల్లాడి మహాదేవ శాస్త్రిలుగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

అడయారు, మద్రాసు
11, ఆగస్టు, 1922

సేవకుడు
చిట్టమూరు రామయ్య

రెండవకూర్పును గురించి

## వసంత ఇన్‌స్టిట్యూట్ వారి మనవి

ఈ గ్రంథముయొక్క మొదటికూర్పును అచ్చువేయుటకు మహారాజరాజశ్రీ ఉదయగిరి గోపాలరత్నంగారి ద్రవ్యసహాయ్య ముండినందున సరసముగా నెనిమిది అణాలు మాత్రము క్రయ మేర్పరుపబడియె. ఇపుడు అట్టి ద్రవ్యసహాయము లభించలేదు. మరియు మొదటికూర్పునకన్న పెద్దవైన అక్షరములలో నచ్చుకూర్పబడి మేలైన కాకితములు ఉపయోగించబడి యుండుటవలన ఖర్చు లధికమైనవి. కనుక సెలవులను సమకూర్చవలసినందున వెల పండ్రెండణాలు నిర్ధారింపబడినది.

చదువరులు ఈ విషయము నామోదించి మమ్మేలను మన్నింతురని కోరుచున్నాము.

5 మార్చి, 1937.

# విషయసూచిక



# దివ్యజ్ఞానసారము

## మొదటి అధ్యాయము

### థియాసాఫి : బ్రహ్మవిద్య

ప్రపంచమున నెల్లయెడలను, ఇక్కాలమున "థియాసాఫి" యనుమాట ప్రసిద్ధికెక్కుచున్నది. ఈ శబ్ద మన్ని దేశములయందును అన్ని ఖండములయందును వాడుకలోకి వచ్చుచుండుట తెలియవచ్చుచున్నది. ఈ శబ్దార్థమును వెల్లడిచేయుచు, తదర్థప్రతిపాదకమగు జ్ఞానమును పండితపామర జనోపయోగముగ చేయుచు దివ్యజ్ఞానసమాజమనుపేర నొక సమాజము సయితము ఇక్కాలమున లోకమునం దన్ని దేశములయందును, ముఖ్యములగు పట్టణములయందును గ్రామములయందును, ప్రబలియున్నది. కావున "థియాసాఫి" యను నది యెట్టిది? ఇది యొక్క క్రొత్తమతమా? లేక ప్రపంచమున నిప్పటివఱకు ప్రబలియుండు మతములలో నొక్కటియా? అట్లయినచో నేమతము? పురాతనమతమా? లేక ఆధునికమా? ఈ విషయములు విచారింపదగినవి.

"థియాసాఫి" అనగా దివ్యజ్ఞానము. అనగా భగవంతుని విషయమగు జ్ఞానము. దేవతలచేతను, దేవసములగు

మహర్షులచేతను, పొందబడియుండు భగవత్సంబంధమగు జ్ఞానము. ఇదియే "పరవిద్య" యని సనాతనము లగు ఉపనిషత్తులయందు చెప్పబడునది. ఏ విద్యచే అక్షరమగు పరబ్రహ్మతత్వ మెఱుంగబడుచున్నదో, ఆ విద్యయే పరవిద్య యని ముండకోపనిషత్తు బోధించుచున్నయది. నాలుగు వేదములును, ఆరు వేదాంగములును, అరువదినాలుగు ఇతర విద్యలును, అపరవిద్యయే యని యా యుపనిషత్తు నిరూపించుచున్నది. ఇవి యన్నియును, పరవిద్యాసాధనము లగుటం బట్టియే గదా విద్యలనబడదగి యున్నయవి. శ్రీమద్భాగవతమున భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదు డేమని చెప్పియున్నాడు! "చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు, కుంభినీధవు జెప్పెడు గురుడు గురుడు, హరిచేరుమని చెప్పు తండ్రి తండ్రి." గనుక భగవంతుని స్వరూపమును తెలుపు విద్య యొకటియే విద్య యనబడదగియుండ, ఆ విద్యకు సహకారులుగనుండు విద్యలన్నియుంగూడ విద్యలని చెప్పబడుచున్నయవి. అయినను మొదటిది పరవిద్య అనగా శ్రేష్ఠమగు విద్యయనియు, తక్కు విద్యలన్నియు అపరవిద్యలనియు నెఱుంగబడుచున్నయవి.

ఈ పరవిద్య ఎద్దియేని యొక్కమతముననే బోధింపబడియున్నదా? అనేకమతములయందును గానవచ్చుచున్నదా? యనువిషయము తెలియదగియున్నది. అనేక మతగ్రంథముల

బరిశీలించిన పండితులందఱును, ఏక వాక్యముగా జెప్పునది చూడగా అన్ని మతములయందును బోధింపబడియుండు ముఖ్యాంశములు అనగా సారభూతమగు తత్త్వనిరూపణ ములు ఒక్కటిగనే యున్నవనియును నానాదేశములయందు అయాజనసముదాయమునకు దగినట్లు ఒక్కటియగు తత్త్వము పలువిధములుగ నిరూపింపబడినదనియును, చక్కగ పరిశీలించి చూడగా, నానాదేశముల బెక్కువిధములుగ పెక్కు నామములతో నెరుంగబడు వస్తువొక్కటియే యనియును స్పష్టమగుచున్నది. ఇంతియగాక ఆయామతావలంబులలో శ్రద్ధాభక్తిజ్ఞానవైరాగ్యసంపన్నులగు మహనీయులు అనేకులుండిరనియును, వారల సచ్చరిత్రములం జదువ, వారును ఉత్కృష్టమగు పరమానందానుభవము గలవారలయి, పరులను సైతము తరింపజేయు నుత్సాహము గలిగియుండిన వారనియు తెలియవచ్చుచున్నది. కావున నీయుత్తమోత్తమమగు పరవిద్య అన్నిమతములయందును రహస్యముగ బోధింపబడియే యున్నదని తలంపక తీరదు. ఇట్లన్ని మతములకును సామాన్యముగ నుండు ముఖ్యాంశము లెవ్వియో చూతము.

1. ఏకము, నద్వితీయమునగు బ్రహ్మము. ఆ తత్త్వము అవాఙ్మనసగోచరము, అవిజ్ఞాతము, అవిజ్ఞేయము ; ఇదియ నిర్గుణము, అనిర్వాచ్యము, అగు పరబ్రహ్మ.

2. ఈ తత్త్వమే ప్రకృతితో చేరి, ప్రకృతిని స్వాధీనముగ చేసికొని, సోపాధికమగు అపరబ్రహ్మ, సగుణబ్రహ్మ, ఈశ్వరుడు అను నామములం బరగు తత్త్వము.

3. సచ్చిదానందస్వరూపుడును, ఏకము అద్వితీయము నగు ఈశ్వరుడే లోకవ్యాపారముకొఱకు ముమ్మూర్తులుగ నభివ్యక్తమగును.

4. ఈశ్వరాజ్ఞాప్రవర్తకులగు దేవతలు అనేకకోట్లు గలరు. కొన్ని మతములయందు వీరినే దేవదూతలనియు, ఏంజెల్సు, ఆర్కేంజెల్సు అనియు మరియు నితరనామములతో వాడుదురు.

5. మనుష్యులు యథార్థముగ శరీరములకంటె విలక్షణులగు జీవాత్మలుగాని కేవలశరీరములు కారు. ఈ జీవాత్మలు ఈశ్వరాంశములు కావున పర్యవసానమున ఈశ్వరస్వరూపమును స్వానుభవముచే నెఱుంగ సమర్థులు.

6. ఈశ్వరాంశములగు జీవులు మొదట అవిద్య (అనగా అజ్ఞానమున) కు లోబడినవారలయి, ఇహలోకమున శరీరములందాల్చి ప్రపంచమునందలి సుఖదుఃఖానుభవములచే పరమార్థజ్ఞానమును సంపాదించుకొనుటకొఱకే ప్రపంచరూపమగు సంసారమునం బ్రవేశించి యున్నారు.

7. ఆ జ్ఞానము పరిపూర్ణముగ గలుగువఱకు ప్రపంచమను గొప్పపాఠశాలయందు పెక్కుమారులు పెక్కుస్థల

ముల, పెక్కురూపముల జననమొంది, పరిపూర్ణులు గాదగి యున్నవారు.

8. పరిపూర్ణజ్ఞానులు, జీవన్ముక్తులు, ఋషులు, మహాత్ములు, అని పెక్కునామములం బరగుమహానీయులు, లోకహితముకొరకు అధికారులై లోకపాలనము చేయువారు, ఇప్పుడును కలరు.

9. ప్రపంచమునందంతట కారణము లేనిది కార్యము గలుగదను న్యాయము అనుల్లంఘ్యము.

10. జీవులు నాధర్మమునకు లోబడియే వర్తింపగలవారు. తాముచేయు మనోవాక్కాయికములగు సమస్తకార్యములు తత్తదనుగుణములగు ఫలములనీయక తప్పదు. ఆయాఫలానుభవముచేత జ్ఞానము నభివృద్ధిచేసికొని యవిద్యనుండి తరింపగలవారు.

ఇందలి 7, 9, 10 మాత్రము ఆధునికములగు కొన్ని మతములయందు బోధింపబడియుండలేదని యామతావలంబులలో నిక్కాలపువారు కొందరనెదరు, గాని వారివారి గ్రంథములనుసైతము చక్కగ శోధించిన విచారపరులుగ నుండువారా గ్రంథములయందు నీ సిద్ధాంతములు బోధింపబడియే యున్నవని నొక్కి చెప్పుచున్నారు.

ప్రపంచమునందలి మతములన్నిటియందును సారభూతములగు ముఖ్యాంశములన్నియు నొకటిగానుండుటకు కార

ణము వెదుకవలసియున్నది. మతస్థాపకులందఱును, దేవసము లగు మహానుభావులని, వారి గ్రంథముల పరిశీలింప స్పష్టమగు చునే యున్నది. వారలు తత్త్వస్వరూపమును స్వానుభవముచే నెఱింగినవారుగాని సామాన్యులుగారు. దృశ్యాదృశ్యములగు లోకముల నన్నింటిని యోగదృష్టిమహిమచే స్పష్టముగ చూచి యనుభవించి, దృశ్యమగు నీ భూలోకమునకును, అదృశ్యములగు భువరాదిలోకములకును గల సంబంధమును, ప్రపంచాతీతమగు తత్త్వముయొక్క యాథాత్మ్యమును జక్కగ నెఱింగి పామరజనోద్ధారణముకొఱకు ఆ తత్త్వమును గ్రంథముల మూలముననను యోగ్యులగు శిష్యులకు బోధించుటవలనను లోకమునకు వెల్లడిచేసియున్నవారు. కనుక దివ్యమగు చక్షువులచే స్పష్టముగ చూచి యథాదృష్టముగ వ్రాయునది యంతయు సత్యము. అది యేకముగ నుండును; పరస్పర భేదములుగ నుండుట కాస్పదము గలుగదు. పరిపక్వముగాని బుద్ధులచేతను, అజ్ఞానముచే నిండియుండు మనస్సుచేతను, అల్పమగు వ్యాప్తిగల బాహ్యేంద్రియములచేతను గ్రహింపబడు జ్ఞానము పరస్పరభేదములు గలదగు.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన।
బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం॥

(భ. గీతా.)

కావున మతస్థాపకులందరు పరిపూర్ణజ్ఞానులును బ్రహ్మవేత్తలుగ నుండుటయే మతములన్నిటియందు ముఖ్యధర్మములన్నియు సామాన్యముగ నుండుటకు కారణము. వేరుకాదు. సకల మతస్థాపకులును, ఐక్యభావముగల యొక్క సిద్ధపురుష సముదాయము. పరస్పర మతవైషమ్యముల నెంతమాత్రము సహింపరు. అట్లయినచో, లోకమున నిక్కాలమున మతాచారములలో పరస్పర భేదములు ఎక్కుడుగ గానవచ్చుచున్నయవియే, అట్టిభేదములకును, తత్కార్యములగు మతవైషమ్యములకును కారణమేమియో విచారింపదగియున్నది.

మతస్థాపకులందరొక్క సిద్ధసమాజమువారైనను, మతములయందలి ముఖ్యాంశము లొక్కటిగ నుండినను, వేఱు వేఱు కాలములయందు, భిన్నభిన్నములగు దేశములలో దేశకాలవైచిత్ర్యముల ననుసరించి, యీ మతములు స్థాపింపబడియుండుటంబట్టియు, ఆయాకాలపు జనుల యోగ్యతానుసారముగ నుపదేశింపబడి యుండుటచేతను, పరస్పరభేదములుండకతీరదు. ఒక్కదృష్టాంతముచే నిది స్పష్టమగు. పర్వతాగ్రమున వర్షించె ననుకొనెదము. ఆ వర్షజలములు కొండపైనుండి నలుప్రక్కలం బ్రవహింప నాలుగు నదులు వెలువడును. ఆ నదులయందలి జలములం బరీక్షించిచూడ, నొకదిక్కున గట్టిదగు శిలాప్రదేశమున బ్రవహించుటచే నొక నదిజలములు పరిశుద్ధములుగను, మఱియొక్కదిక్కున నల్లని

రేగడిభూమిలో ప్రవహించి వచ్చియుండుటచే నల్లని బురద వలెను, మఱియొక్కనదియం దటులనే యెఱుపు వర్ణముగలిగి యుండుటయు, నింకొక యేట పసుపువర్ణము గలిగియుండు టయు గలుగునుగదా! ఇన్నింటియందును జలము లొక్క మూలమునుండి వచ్చినవియేగదా! మూలమొక్కటియైనను స్థలవైచిత్ర్యములంబట్టి భిన్నభిన్నములుగ గనబడుచున్నయవి గదా! అటులనే మహనీయులచే నుపదేశింపబడియుండుటచే సారమంతయు నొక్కటిగనుండ, దేశకాలానుసారముగను, శిష్యసముదాయముయొక్క రుచిభేదములకును యోగ్యతకును దగినట్లు నిరూపింపబడి యుండుటచేతను, బాహ్యాచారముల యందును, కొన్ని యితర అంశములందును పరస్పరభేదములు గనబడుచున్నవి. మనదగు నీ హిందూమతమునందును అనేక ములగు అవాంతర మతభేదములున్నవి గదా! ఇవి యన్ని యును రుచివైచిత్ర్యములనుబట్టి వచ్చినవియనియును, పర తత్వమును దెల్పుటయం దన్నియు నన్యోన్యసహకారులేగాని పరస్పర విరోధములు గావనియు విజ్ఞులగువారల యభిప్రా యము. ఈ యర్థము మహిమ్నస్తోత్రమందు.—

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।
రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానాపథజుషామ్
నృణామేకో గమ్య స్త్వమసి పయసామర్ణవ ఇవ ॥

కాబట్టి దివ్యజ్ఞానము, బ్రహ్మవిద్య, పరవిద్య, అను నామములచే నెఱుంగబడు సారము అమృతదాయకమగు కల్ప వృక్షమునకు మూలముగను, ప్రపంచమునందలి మతములన్ని యును శాఖలుగను నెఱుంగుటయే సుజ్ఞానము. అన్నిటియందు లక్ష్యమొక్కటిగ నుండుటచే, నొకమతమునుండి మఱియొక్క మతమునకు మాఱుట అనావశ్యకమగుటయేగాక చెఱుపునకు కారణము సహితము కాదగు. ఒక్కొకమతమునందు భగవ త్తత్త్వ మొక్కరీతిగ నిరూపింపబడి యుండుటచేతను, జీవుడు పెక్కుజన్మములయందు పెక్కుమతావలంబులలో జననమొం దుటచేత వరుసగ ఆయామతమునందు నిరూపింపబడియుండు రీతిని భగవంతునితత్త్వము నెఱుంగుచు, సారభూతమగు జ్ఞాన మును వాసనారూపముగ గ్రహించుకొని, స్వస్థానము చేరు చుండుటచేతను, అనేకజన్మ సంసిద్ధుడైన జీవుఁడు భగవత్తత్త్వ మును పెక్కుభంగుల నెఱింగినవాడగు. ఏ జన్మమున, నేమత మున బుట్టునో, ఆ జన్మమున, నామతము నవలంబించుట ద్వారా పొందదగు జ్ఞానమును పొందవలయుననియును, తన్మ తాచరణమువలన గలుగు శరీరనియమనమును అభ్యసించి దానివలని మేలు పొందవలయుననియును, భగవంతుని యొక్కయు, భగవదాజ్ఞాప్రవర్తకులును, కర్మఫల ప్రదాతలు నగు దేవతలయొక్కయు, ఉద్దేశ్యము. కావున ఎపుడుగాని జీవు డేమతమున జన్మించియున్నవాడో, ఆ మతము అప్పటికి

ఆ జీవునకు ఎక్కుడగు ఫలమును నీజాలియుండును. దానివదలి మఱియొక్కమతమునకు బోవుటచే ముఖ్యముగ పొందదగిన ఫలము ఒనగూడదు. నానావిధములగు విద్యలను గ్రహింప దలచిన విద్యార్థి తత్తత్కాలానుసారముగ నొక్కొక్క విద్యను గఱపు పాఠశాలయందు జదివి, యా విద్యను పూర్ణముగ గ్రహించినపిదప మఱియొక్క పాఠశాలకు పోయిన యుక్తముగాని, యుపాధ్యాయు లొక్క పాఠశాలయందుంచిన, నది బాగులేదని స్వతంత్రముగ మఱియొక్క బడికింబోయి చెడిపోవు విద్యార్థివలె నిష్ఫలమనోరథుడగు. కావున ఎల్లవారును, తమతమ మతస్వరూపముల జక్కగ దెలిసికొని యభ్యసించుచు, పరమత వైషమ్యములు వదలి యన్యోన్యమైత్రి గలిగి వర్తించిన కాలపరిపాకమున నుత్తమ పురుషార్థమును పొందగలుగుదురు. శ్రీ భగవద్గీతా శాస్త్రమునందు భక్తుని లక్షణములు వక్కాణించుచు భగవంతుడు "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ, నిర్మమో నిరహంకారః" అని చెప్పియున్నాడు. సర్వభూతములయందు ద్వేషబుద్ధి వదలుట కర్తవ్యమని చెప్పుచుండగా, ఇతరమతస్థులను అనగా భగవంతునినే వేలువేలు పేరులచే బూజించు భక్తులను ద్వేషించుట, భగవంతునికి బ్రీతికరముగనుండునా! పరమేశ్వర ప్రీతి నపేక్షించుచు, వారి యితర పుత్రులగు భక్తులను ద్వేషించినచో భగవంతు డెట్లు ప్రీతుడగును? తమ మతమే సత్యమని

యును ముక్తిదాయకమనియు, ఇతరములన్నియు దుర్మార్గములనియును, తాము నడుచు మార్గ మొక్కటియే సన్మార్గమనియు, నెంచు నహంకారము భక్తలక్షణమని యెట్లు గ్రహింపబడును ?

వేదాంగానుపవేదాంశ్చ, కామికాద్యాగమానపి,
కాపాలంలాకులంచైవ తయోర్భేదాన్ ద్విజర్షభ,
తథా పాశుపతం సోమం భైరవప్రముఖాగమాన్
తేషా మేవోపభేదాంశ్చ శతశోఽథ సహస్రశః.

విష్ణ్వాగమాన్ స్తథా బ్రాహ్మాన్ బుద్ధార్హాద్యాగమానపి
అనేకభేదభిన్నాని, తథా శాస్త్రాంతరాణి చ
నిర్మమే శంకర స్సాక్షాత్ సర్వజ్ఞః సంగ్రహేణ తు
తత్రైకరే తే హి మార్గాస్తు న హంతవ్యా మనీషిభిః.

(సూతసంహిత)

అనగా మార్గము లెన్నియున్నను, జ్ఞానులగువారు, తర్కములతో వానిని ఖండించరాదు.

మొదట నుదాహరింపబడిన "దివ్యజ్ఞానసమాజము" యొక్క ముఖ్యోద్దేశ్యములలో నీ ధర్మమును లోకమున వెల్లడి చేయుట మొదటిదిగ నున్నయది. సమస్తభూతకోటియందు సోదరభావము ప్రతిష్ఠించుటకీ సమాజము అంకురము గావలయునని దీని మొదటియుద్దేశ్యము. "అద్వేష్టా సర్వభూతానాం

మైత్రః కరుణః” అను నీ మూడును “సోదరభావము” అను నొక్కమాటలో నిమిడియున్నవి. ఈ భావము క్రమక్రమమున నభివృద్ధియగునటుల చేయుటకు నీ సమాజము బహువిధముల యత్నించుచున్నయది. దీనియందు ప్రపంచమున ప్రబలి యుండు అన్నిమతములవారును చేరి యన్యోన్య మైత్రితో వర్తించుచున్నారు. కనుక లోకమున నుండు వివిధమతస్థులు తమతమ మతములయందు విశేష అభిమానముగలిగి మిక్కలి శ్రద్ధతో వాని ననుష్ఠించుచు, మతవైషమ్యములు లేక మిత్ర భావముతో నన్నదమ్ములవలె వర్తించుట సులభసాధ్యమని యీ సమాజము దృష్టాంతముగ జూపుచున్నయది.

ఈయర్థము నెల్లవారును చక్కగ పరిశీలించి, తామను ష్ఠించి యితరులకు బోధించి లోకమున ప్రబలియుండు వైష మ్యముల కొంతవఱకైనను తగ్గునటులచేయుటకు ప్రయత్నించి భగవంతుని కృపకు పాత్రులగుదురు గాత.

# రెండవ అధ్యాయము

## సోదరభావము

దివ్యజ్ఞానము సర్వమతసార మనియును, మతము లన్నియు నాయొక్క మూలమునుండి వెలువడిన బహుశాఖ లనియును, వివిధమతస్థులు నొక్క భగవత్తత్త్వమునే పెక్కు నామముల, పెక్కుభంగుల, నిరూపించుచున్నవారనియు, లోకమున వివిధమతావలంబులు మతద్వేషములుమాని తమ మతములను జక్కగ నెఱింగి యనుష్ఠించవలయుననియును, ముఖ్యములగు నీయంశములను వెల్లడిజేయుట కిక్కాలమున "దివ్యజ్ఞానసమాజ" మనుపేర నొక సమాజము స్థాపింపబడి ప్రపంచమునందెల్లయెడల వ్యాపించియున్నదని ప్రథమాధ్యాయమున నుడివియుంటిమి. ఆ సమాజముయొక్క ముఖ్యోద్దేశ్యము మానవకోటియందును, మఱియు సమస్తభూతకోటియందును సోదరభావము నభివృద్ధిచేయుటయే యనియు వక్కాణింపబడియె. ఇట్టి సోదరభావము భక్తలక్షణమనియును, "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ, నిర్మమో నిరహంకారః" అను స్మృతివాక్య మీ సోదరభావమునే విశదీకరించుచున్నదనియు జెప్పితిమి. ఇపు డాసోదర

భావము మానవులు తమతమ ప్రవర్తనమునం దెట్లభ్యసింప వలయునో యించుక విచారింతము.

సోదరభావ మనఁగా సమస్తజీవకోటులు అన్నదమ్ము లవలె నడుచుకొనవలయునని యర్థము. అనఁగా నన్నదమ్ము లన్యోన్యానురాగము గలిగి యితరుల సుఖదుఃఖములను దమ సుఖదుఃఖములవలె భావించుచు నన్యోన్య సహాకారులుగ నడ చుకొనవలయును. ఒక కుటుంబమునందు ఒక్కొక్కరును దన సుఖమును మాత్రము చూచుకొనుచు నితరులసుఖదుఃఖముల నెంతమాత్రమైనను లెక్కపెట్టకయుండినచోఁ గుటుంబము నకు సుఖము సమకూరదు గదా! అందఱును సమష్టికుటుంబ క్షేమమును గోరుచు గుటుంబమునకు గీర్తియు నభివృద్ధియు గలుగులాగున నడచుచుండినంగాక యొక్కొక్కరును స్వప్ర యోజనపరులై, స్వకార్యధురంధరులైనచో గుటుంబయాత్ర చక్కగ జరుగ గలుగునా? అన్యోన్యవైషమ్యములు గలిగి పెనుగాలిచే గొట్టబడిన యోడవలె నీదిక్కున కాదిక్కునకుం బొర్లుచు, కలహసముద్రమున దుదకు మునుగునుగదా. అట్లు గాక కుటుంబమున నొక్కొక్కరును దనసుఖమునకంటె నిత రులసుఖమే యెక్కుడుగ భావించుచు, నందఱసుఖమే తనసుఖ ముగ నెంచుచుండినచో నందఱకును సుఖము నిస్సంశయముగ నొనగూడుననుట యందఱ కనుభవసిద్ధము గదా! భగవం తుని సృష్టియందెల్లభూతము లొక్కకుటుంబముగను, భగవం

తుని జగదేకపితగను నెంచి "ఆత్మవత్సర్వభూతాని" యను న్యాయము ననుసరించి సర్వభూతహితమునకు బాటుపడుటయే భగవంతునకు బ్రీతికరమని తెలిసికొని వర్తించుటయే సోదర భావము.

ఐనను ఇక్కాలమున సోదరభావమన సమస్తజీవులు సమభావము ననుష్ఠించవలయుననియు, బండితపామరు లొక్క రీతిగ దలపబడవలయుననియు, అట్లు చేయనిచో భ్రాతృభావ మసంగతమనియు, సంఘమునందలి నిబంధనల నున్మూలనము చేయక సోదరభావము మాటలాడుట దబ్బరయనియు దలంచు చున్నారు. ఇవ్విషయము విచారణీయము గదా! సోదరు లన్న మాత్రమున నందఱును సములగుదురా? నామ మాత్ర మున నే తారతమ్యములు రూఢియగుచున్నవి. అన్నలయందు దమ్ములు గురుత్వమును, చిన్నలయందు బెద్దలు వాత్సల్య మును జూపవలయునుగాని యన్నదమ్ములు సమత్వము నవలం బించుట లేదు గదా! అటులనే భగవంతుని జగదేకపితగ నెంచి సమస్తభూతములను ఏకోదరులుగ భావించుటయన బెద్దలగువారలయందు జిన్నవారు నమ్రభావము నవలంబించి, వారల యాజ్ఞకు లోబడి వర్తించుటయు, చిన్నవారియందు బ్రేమ, పుత్రభావము గలిగి వారల యభివృద్ధికొఱకు పెద్ద వారలు పాటుపడి వారల దమంతటివారలను జేయుటయు సహజధర్మముగ గన్పడుచున్నది.

మహాతాం బహుమానేన దీనానా మనుకంపయా ।
అర్హయేద్దానమానాభ్యాం మైత్ర్యాఽభిన్నేన చేతసా ॥

అని శ్రీ మహాభారతమునం దున్నది.

జీవులందఱు నీశ్వరాంశములనియును, ఆదియందు కించి జ్జ్ఞత్వాది గుణములకు లోనైనవారయ్యును బర్యవసానమున నీశ్వరసాయుజ్యమును జెందగలవారనియును ముందు సూచింపబడియెను. జీవులందఱు నీశ్వరాంశములైయుండ నందఱు సములేయని చెప్పదగు. అయినను బీజములన్నియు నొక్క తెఱఁగై యుండగా వేలువేలు కాలములయందు భూమిలో విత్తబడిన బీజములలో నొక్కటి ఫలభరితమగు గొప్ప వృక్షముగను మఱియొకటి యప్పుడే యంకురించుచుండు మొలకగను, అభివ్యక్తములగు నీ రెండింటికి దారతమ్యము లేదనుట యసాధువు గదా! అటులనే పరమార్థమున జీవులందఱు సములే యగుచుండ నందు గొందఱు కేవలబాలిశులై తెలివి యొకింతయును లేక పశుప్రాయులుగ నుండువారును, మఱికొంద ఱనేకజన్మముల నానావిధానుభవములు గలిగి జ్ఞానవృద్ధులై సర్వజ్ఞకల్పులై యుండువారును, ఈ యిరువుర నడుమ వేలకొలది తారతమ్యములజూపు జీవకోట్లును గానవచ్చుచున్నారు. అందరును సమముగ నెన్నబడుట వివేకమని యెన్నబడదు. అయినను తారతమ్యము లున్నవనుటచే హీన

దశయందుండువారలను దక్కువారలు తిరస్కారభావముతో హేయపదార్థములుగ నెంచుటయు, వారిని దైవోపహతులుగ నెంచి వారల యభివృద్ధికొఱకు బాటుపడకుండుటయును తప్పని నొక్కి వక్కాణించుటకు సందేహము లేదు. అయినను సోదరభావ మెట్లభ్యసింపవలయును ? ఎల్లవారును ఇతరుల యందు ప్రేమగలిగి యాప్రేమను దమకంటె నుత్కృష్టుల యందు భక్తిగౌరవములుగను, సములయం దనురాగముగను, తనకంటె దక్కువవారలయందు దయగను ప్రకాశింప జేయుచు, నెవరెవరికి నెయ్యెకాలములయందు నేయేవిధమగు సహాయము కావలయునో ఆయాకాలములయం దాయాసహాయము నిచ్చుచు సదా పరోపకారమున కవకాశము గలుగునా యని వెదకుచు నుండదగు.

పెద్దలగువారలయందు భక్తిగౌరవముల చూపవలయుననిన వారలసమ్ముఖములో వేలకొలది నమస్కారములు జేయుచు, వినయోక్తులు మాటలాడుచు, నుత్తమాసనమున గూర్చుండ బెట్టుచు, వారలకు శరీరపోషణమునకు వలయు సహాయము చేయకయుండినచో నాయుపచారములు భక్తి గౌరవసూచకము లనిపించుకొనజాలవు. అవియే శుష్కోపచారము లనబడునవి. అనగా సారములేని నిష్ప్రయోజకములగు నటనలుగాని ప్రేమను సూచించునవి గావు. అట్లుగాక భక్తిగౌరవములకు బాహ్యచిహ్నములగు వందనాదు

లను కొద్దిగ జూపినను, పెద్దలగువారలకు వలయు సహాయము యథాశక్తిగ నిచ్చుచు, వారల యాజ్ఞానుసారముగ వర్తించు చుండినచో నాయుపచారము శ్రేష్ఠమైనదగు. యథార్థమగు ప్రేమను జూపినవారగుదురు. అటులనే హీనదశయందుండి యన్నపానాదులు లేకయు, విద్య లేకయు, అజ్ఞానమున మునిగి మిగుల దురాచారములకు లోనై శ్రమపడువారలకు నప్పటికి వలయు సహాయము చేయవలెనుగదా! బీదఱికముచే బాధ పడువారల కాబీదఱికముం దొలగించు నుపాయముల వెదకి వారలకు దగిన కార్యాలయములను నిర్మించి, పనులనియో గించి వారలకు జీవనోపాయముల గల్పించుట యావశ్యకము. అట్లు చేయుటచే వారలు కాలము వృథపుచ్చక జీవనోపాయ మును ఆర్జించుకొని దారాపుత్త్రాదుల రక్షించుకొనుటయే గాక వారలయందు నైజమగు నిద్రాలస్యప్రమాదములను తమోలక్షణముల నతిక్రమింతురు. మఱియు వారలు వసించు స్థలములు మిగుల నపరిశుద్ధములుగ నుంచుకొనియుండినచో వారల నివాసములను, వారలుండు వీధులను శుభ్రముగ నుంచుటకు దగిన ఏర్పాటులు చేయుటయు, వారలకు ద్రాగుట కుపయోగించు శుద్ధములగు నీటియాధారముల నిర్మించుటయు సోదరభావమును సూచించు సత్కార్యములు.

మఱియు వారలకు దగిన విద్యాదానము చేయుటకు బాఠశాలల నిర్మించి విద్య గఱపుట, శిల్పముల నేర్పుట,

వారలు నేర్చిన శిల్పముల వినియోగించి వానిమూలమున జీవనము నార్జించుకొనుటకు దగిన యనుకూలములను గల్పించుట, యీ మొదలగు కార్యములన్నియు దయాసూచకములు. వార లజ్ఞానముచే జేయుదుష్కార్యముల నివారించునటుల మద్యపానము మొదలగు దురాచారములవలని కీడులను వారలకు బోధించి వానిని వదలునట్లు చేసి మంచియాచారముల నభ్యసించునటుల వారలకు బోధించుటకు దగిన మనుష్యుల నియమించి వారలుండు హీనస్థితినుండి క్రమక్రమమున నుద్ధరించుట సోదరభావమును సూచించును గాని వీని గమనించక వారలను మాటమాత్రమున సోదరులని పిలుచుచు, కలసి మెలసి వర్తించుచు, బయిట చూచుటకుమాత్రము సమానులవలె నటించుటయు ప్రీతిసూచకములు కాజాలవు. ఎవరెవరి కేయేకాలమున నేయేసహాయము కావలయునో ఆయాసహాయము చేసిన మేలుగలుగునుగాని ఆకలిగొనియున్నవాని కన్నమిడక ఆలింగనాదులుచేసి గొప్ప మర్యాదలు చేసిన నేమి మేలు? బాహ్యాచారములయందు వారల నాలింగనము చేయుచు నంతరంగముల వారిని ద్వేషించుచుండినం బ్రయోజన మేమి? అంతరంగముల నెల్లవారియందేకరూపమగు దయాసముద్ర ముప్పొంగుచుండ బాహ్యముననెవరెవరి కెట్టికార్యము లుత్తమమగు మేలుగలిగించునో యట్టికార్యములు చేయుటయే జ్ఞానవంతులు చేయదగిన

కార్యము. బిడ్డలందఱియం దేకరూపమగు ప్రేమగల తల్లి యందఱ నొక్కరీతినే యుపచరించునా? చూడుడు. చేతి బిడ్డకు స్తన్యమిచ్చి, యెడబిడ్డ కల్పాహారము నిచ్చి యుక్త వయస్కులగు కుమారులకుం బుష్టికరములగు లడ్వములు మొదలగు నాహారములను, రోగబాధల జెందియుండువారలకు బథ్యాహారము నిచ్చునుగాని యందఱి కేకరూపముగ నాహార మిచ్చునా? అట్లిచ్చిన వారలకు గీడు సంభవించునుగాని మేలొనగూడునా?

కావున సోదరభావమన్నమాత్రమున నందఱ నొక్క రీతిగఁ జూచుటకాదు. తారతమ్యముల గుఱుతెఱిగి యెవ రెవరిని ఏయే సమయముల నెట్లు ఉపచరించదగునో అట్లు ఉపచరించుటయే సోదరభావము. హృదయమున నందఱ యం దేకరూపమగు ప్రేమయు, బాహ్యకార్యములయందు వారివారి క్షేమము నుద్దేశించి యుక్తానుసారముగ వర్తించు టయు నిజమగు భూతదయ.

# మూఁడవ అధ్యాయము

## ఈశ్వరాంశములు జీవులు, నిత్యులు

అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో ।
న హన్యతే హన్యమానే శరీరే ॥ (భగవద్గీతా)

జీవు లీశ్వరాంశములని చెప్పబడియెను. అనగా నీశ్వరునియొక్క కళలు. ఈశ్వరుడు నిత్యుడగుటంబట్టి తదంశములగు జీవులును నిత్యులు. కావున జీవునకు బుట్టుట, చచ్చుటయను వికారములు లేవు. ఈ యర్థము శ్రీ భగవద్గీతా శాస్త్రమునను కఠోపనిషత్తునందు

అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తాశ్శరీరిణః ।
దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ॥

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥

ఈ మొదలగు వాక్యములచే బోధింపబడుచున్నది. ఈ యర్థమును జక్కగ మననముచేసి, దీనినుండి యూహింప

దగిన విషయములను గ్రహించి స్వానుభవమునకు దెచ్చి కొనదగియున్నది.

జీవు డీశ్వరాంశమగుటచే నిత్యుడు. అజ్ఞానరూపమగు సంసారచక్రమున నెందుకు బ్రవేశించెను? ఈశ్వరునకును జీవునకును గల సంబంధ మెట్టిది? ఈశ్వరాంశ మగుటచే నీశ్వరునియందు గలిగియుండు శక్తులన్నియును బీజరూపముగ జీవునియం దున్నవని యెఱుంగదగు. బీజరూపముగ నున్నవి గాని పూర్ణముగ నభివ్యక్తములై యుండలేదు. కావుననే జీవుడు కించిద్జ్ఞు డనియును, ఈశ్వరుడు సర్వజ్ఞుడనియును వ్యవహరించెదరు. గొప్ప వటవృక్షమువంటిది యీశ్వరతత్త్వము. వటబీజమువంటిది జీవతత్త్వము. వటవృక్షమునందలి భాగము లన్నియు బీజమున నున్నయవియే అయిన నభివ్యక్తములు కాలేదు. కాలానుసారముగ నభివ్యక్తములై ప్రకాశించు నవియే. బీజమునందు బూర్వము లేనిది యొక్కటిగాని వెనుక నభివ్యక్తమై ప్రకాశింపజాలదు. భూమియందు బడి శీతవాతాతపములు దానిపై దగుల నది యంకురించి మొలకయై, చిన్న చెట్టయి, గొప్ప వృక్షమగును. గొప్పదియగు మహాజ్యోతి వంటిది యీశ్వరతత్త్వము. ఆ మహాజ్యోతినుండి వెలువడు విస్ఫులింగముల (అనగా నిప్పురవల) పోలినవి జీవాత్మలు. జ్యోతికి విస్ఫులింగములవలె, నీశ్వరునకు జీవాత్మలు సరూపములని యుపనిషత్తు నిరూపించుచున్నది. ఈ నిప్పురవయును

నొక గొప్ప దూదిరాశిపైబడిన నదియు మహాజ్యోతి యగును గదా! అటులనే జీవు డాదియం దల్పశక్తి గలవాడయ్యును కించిజ్జ్ఞుడైయుండియు, బంచభూతాత్మకమగు బ్రపంచమునం బ్రవేశించి యనేకవిధములగు సుఖదుఃఖానుభవము గలవాడై సకాలమున నీశ్వరసారూప్యము జెందగలవాడగును. ఈశ్వర శక్తులన్నియు మనయందుండుటచే దగుయత్నముచే మనము సాధింపలేనిది యొక్కటియైన నుండదు. ఇది మొట్టమొదట దృఢముగ దెలిసికొనవలసిన విషయము. "నే నల్పుడను, ఇంతగొప్పకార్యము నాచే సాధ్యమగునా" యని శంకించు వాడెప్పుడును శక్తిహీనుడే యగును. "ఆత్మశక్తి నాయందు గలదు. ఈశ్వరశక్తిచే సాధింపరాని దొక్కటియైనను లేదు." అను దృఢనిశ్చయముతో యత్నముచేయువాని కసాధ్యమను నదియే లేదు. ఈశ్వరాజ్ఞ నొక్కటిమాత్ర మతిక్రమింప జాలడుగాని యీశ్వరాజ్ఞకు లోబడి యెంత గొప్పకార్యము గాని పురుషప్రయత్నముచే సాధింపగలడు.

ఆదినుండి ప్రపంచమున కొన్నికొన్ని కార్యములు సుఖ హేతువులనియును మఱికొన్ని కార్యములు దుఃఖహేతువు లనియును ప్రకృతిధర్మములుగనే స్పష్టమగుచున్నవి. అందు కొన్ని కార్యములవలని ఫలములు వెంటనే యగపడుటచే నందఱచే నెఱుంగబడుచున్నవి. మఱికొన్ని కార్యములవలని ఫలములు వెంటనే కానరాకయుండుటచే నంద ఱెఱుంగలేక

యున్నవారు. కొన్నింటి ఫలములు కన్నుల కగపడుటచే నందఱు నంగీకరించుచున్నారు. మఱికొన్నింటి ఫలములు వెంటనే కానరాకుండుటచే నదృష్టమనుకొనుచున్నారు. ఇట్టి ఫలములు తత్వజ్ఞులగువారిచే శ్రుతిస్మృతులయందు నిరూపింపఁబడి యున్నయవి. కాబట్టియే

> శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా యస్తా ముల్లంఘ్య వర్తతే ।
> ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ ॥

యని భగవంతుఁడు చెప్పియున్నాఁడు. శ్రుతిస్మృతులయందు నిషేధింపబడిన కర్మములన్నియు దుఃఖహేతువులగుటచేతనే నిషేధింపబడి యున్నవి. అకారణమని తోఁచు దుఃఖప్రాప్తి యంతయు బూర్వకాలమున భగవదాజ్ఞోల్లంఘనము వలన గలిగినదేగాని వేఱుకాదు. అటుల యకారణముగ బ్రాప్తించి నట్లు గనబడు సుఖమంతయు బూర్వకాలమున జేసిన సుకృత ఫలముగాని యన్యముగాదు. అజ్ఞానముచేత బూర్వకారణ ములకును ఇప్పటి ఫలములకును గలిగియుండు సంబంధము నెఱుంగనిచే నది యదృష్టమని వాడబడుచున్నది. అదృష్ట మనగా జూడబడనిది. కారణము మనకు దెలియనిదనియే యర్థము. గాని యకారణమని కాదుసుమా! ఇట్టీశ్వరాజ్ఞ నుల్లంఘింపజాలముగాని, దానికి లోబడి యెంతటికార్యమైనను సాధింపగలుగుదు మను నుత్సాహము మిగుల యావశ్యకము.

ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ
ర్దైవేన దేయమితి కాపురుషా వదంతి ।
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా
యత్నేకృతే యది న సిధ్యతి కోఽత్రదోషః ॥

ఈ దృఢనిశ్చయము గలిగియుండినచో వాని కదృష్టము స్వాధీనమై వర్తించును. ఆ నిశ్చయము లేక "విధికృత" మని దైవమును దూఱువాడు పెనుగాలిచే గొట్టబడిన గడ్డిపోచ వలె స్వాధీనము లేక పరాధీనుడై దిక్కు తెలియక వర్తించు చుండును.

మఱియు జీవుడు అజుడు, నిత్యుడు, శాశ్వతుడు అని యెఱుంగుటవలని ప్రయోజన మింకొకటి యున్నది. జీవుడు పుట్టుకయు, జావును లేనివాడై యుండగా బుట్టునది చచ్చునది యేది?

అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తా శ్శరీరిణః ।
న హన్యతే హన్యమానే శరీరే ॥

ఈ మొదలగు వాక్యముల యర్థము—పుట్టునది చచ్చునది శరీరముగాని జీవుడు గాడు. శరీరములు జీవునకు సుఖదుఃఖానుభవములనిచ్చు జ్ఞానసాధనములు. జ్ఞానమును సంపాదించుటకు జీవున కిట్టివి యుపాధులు. వానివలని పని తీఱిన వెనుక జీర్ణవస్త్రమువలె విడువదగినవి.

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా-
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ (భగవద్గీత)

ఈ మొదలగు వాక్యములయందు సూచింపబడిన రీతిని శరీరమును ధరించువాడు జీవుడు. శరీరము పనిముట్టు వంటిది. దానితో బనితీఱినను, అది జీర్ణమై నిరుపయోగమైనను దానిం ద్యజించి మఱియొకదాని గైకొనుటయే జీవునకు శ్రేయఃకారణము. అట్లు చేయకపోయినచో జీవునకు వృద్ధి లేకపోవును. పురుషార్థ మసాధ్యమగును గదా! ఇవ్విషయము చక్కగ యోచించిచూడ మృత్యువు భయకారణము గాదు. జ్ఞానియగువాడు మృత్యువును దలచి భయపడక యుండుటయేగాక మఱియు దానిని నెక్కుడు ప్రియమైన మహోపకారిగ, దలచునుగదా! మనకు బ్రియులగువారు మృతులగుచుండగా, నాజీవు డిచ్చట బొందదగిన జ్ఞానమునుబొంది విశేషజ్ఞానమునకై దేశాంతరమునుగూర్చి పోవుచున్నాఁడని యెఱింగి మనము దుఃఖించుట మానవలయును. స్నేహితుఁడొకఁడీదేశమున నొకగొప్ప ఉద్యోగముననుండి కొంతకాలము గడచిన పిదప నంతకంటె గొప్పయుద్యోగమును వహింప దేశాంతరమునకు బో నియోగింపబడినచో స్నేహితునికి శుభము గలిగెనని సంతసింతుము గదా! అతండు దేశాంతరమునకు

బోవుట మనకు గొంత కొఱతగా నుండినను నాకొఱఁతను లెక్కింపక దేశాంతరగమనమున కెట్లు సంతసింతుమో యాలాగుననే యాప్తులగువారలకు మరణకాలము సమీపించు నపుడు, ఆ జీవులు దేశాంతరమునకు వెళ్లుచున్నారనియును, అంతకు ముందటి జన్మములలోఁ గలుగఁజేసికొనిన కర్మాను బంధములచే నీజన్మమున నొక్కచోట జన్మించినరీతిని ఈజన్మ మునను, ముందటి జన్మములను చేసికొనిన కర్మానుబంధముల కనుగుణముగ రాఁబోవుకాలమున బునస్సమాగమ మగుఁ గాక యనియు, నూర్ధ్వలోకముల నుండుకాలమున జీవునకు మనశ్శాంతియు, దుఃఖమిశ్రముగాని సుఖమును గలుగుఁగాక యనియును దృఢమగు మనస్సుతో సంకల్పించుచు జీవుని భవిష్యత్సుఖమును గోరవలయును.

జీవుఁడు నిత్యుఁడైనచో నీజన్మమునకు ముందుండి యుండవలయును. ఇట్లనేక జన్మములు ముందు గడచియుండ వచ్చును. అటు లీఁకమీఁద నైతే మనేక జన్మము లుండక తీరదు గదా ! ఒక్కొక్క జన్మమునందును జీవునకు దల్లియు, దండ్రియు, సోదరులును, దారాపుత్రాదులును, మిత్రులును, ధనగృహవస్తువాహనములు మొదలగునవియు నుండియుం డును గదా! ఒక్కొక్క జన్మాంతమున వానినన్నింటిని వదలి స్థలాంతరమున జన్మించి తిరిగి సంసారమున మునిఁగి యప్పటప్పటి దారాపుత్రాదులకంటెఁ దన కాప్తులగువారలు

వేఱు లేరను భ్రాంతికి లోనగుచుండెనుగదా ! దీనిం జక్కఁగ జింతించినచో నిప్పటి మమకారమును, సంసారమూలమగు వ్యామోహమును గొంతమట్టుకైనను దరింపఁజాలుదుము గదా !

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియం ।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥

అను గీతావాక్య మిట్టిజ్ఞానముఁ గలవారివిషయమై చెప్పినదే గదా ! అస్మదాదులందఱును, ఈ విషయముఁ గొంతమట్టుకు మననముచేసి ప్రియాప్రియ ప్రాప్తియందు హర్షవిషాదములకు లోఁబడక చిత్తసమాధానము నభ్యసింప నేర్తుముగాక.

మనదేశమున సామాన్యముగ నందఱును జీవుఁడు నిత్యుఁడనియును జీవున కనేకజన్మము లున్నవనియును, ఒక జన్మమునఁజేసిన సుకృతదుష్కృతములు అనఁగాఁ బుణ్య పాపములు తదనంతర జన్మములయందు సుఖదుఃఖరూపముగ జీవుని వెంటనంటియే వచ్చుచుండు ననియును నమ్ముచున్నారు గాని నడవడియందు మాత్రము అట్టినమ్మక మున్నట్లు గాన రాదు. ఇపుడు చేయుకార్యము రాఁబోవుకాలమున దానికిఁ దగిన ఫలము నీయక తప్పదను దృఢమగు నమ్మకమున్నచో నిమిష నిమిషము మనముచేయు మనోవాక్కాయికములగు కార్యములను జక్కఁగ బరిశీలించి సుఖహేతువులగు కార్య

ములను అనఁగా సత్కార్యములను మాత్రము చేయుదుము గదా! నోటిమాటతో నమ్మినట్లు చెప్పుచుండినను, ఆ నమ్మకము నడవడియందుఁ జూపుట లేదు. ఇట్టి నమ్మకము దృఢమై ప్రవర్తనము బాగుచేసినచో లోకమున నిపుడు గానవచ్చు కలహములు, అసూయలు, అన్యాయపుఁగార్యములు, మనస్స్పర్ధలు నశించి లోకమంతయు నిరంతర సౌఖ్యానుభవము గలది యగుననుటకు సందియము లేదు.

ఆలోచించిచూడ లోకమున ననేకులు తమస్వరూపమిట్టిదనిగాని, తాము పొందగలుగు గమ్యస్థానమిట్టిదనిగాని, దానిం బొందుటకు విధింపఁబడియుండు మార్గము లివియనిగాని యించుకయైనను జింతించుట గానము. జీవయాత్ర యనునది గొప్పప్రయాణము వంటిది. జీవులందఱు ఆ మార్గమున నడుచుచుండు వారలే. ఐనను వేయింట నొక్కరైనను దాము పోఁదలఁచియుండు స్థానమిట్టిదనిగాని, ఆ స్థానమును బొందుటకు మార్గములు పెక్కులా, ఒక్కటియా యనిగాని, యవి యెవ్వియనిగాని విచారించువా రరుదు. సామాన్యముగ ననేకులు ఐహికసుఖమే పరమపురుషార్థ మనియు, దాని సాధించుటకంటె నుత్కృష్టమగు కార్యము లేదనియు నెంచు నాస్తికచార్వాకులవలె నడచుచున్నారు గాని, శరీరమునకంటె విలక్షణుఁడును, అన్యుడును, నిత్యుఁడు నగుజీవుఁ డొకడున్నాఁడని నమ్మువారివలె వర్తించుటగానము. తన స్వరూప

మును దెలిసికొనుటకంటె నుత్తమమగు జ్ఞానము వేఱులేదని పరమార్థబోధకములగు గ్రంథములన్నియు నొక్కివక్కాణించుచున్నయవి. కావున జిజ్ఞాసులగు వార లందఱు తమతమ స్వస్వరూపములం దెలిసికొనుటకు యత్నించి, తెలిసినంత మట్టుకు నట్టిజ్ఞానము ననుసరించి వర్తించుదురుగాక యనియు, అట్లు వర్తించుటకు వలయు వివేకజ్ఞానస్థైర్యములు వారలకుఁ బరమదయానిధియగు భగవంతుఁడు దయచేయుఁ గాక యనియు మా ప్రార్థన.

# నాల్గవ అధ్యాయము

## జీవునియాత్ర

జీవు లీశ్వరాంశములని ముందు చెప్పఁబడెను. సూర్యుని కాంతి యాకసమునందువలె ఈశ్వరుని దీప్తులు మహాదహంకార తత్త్వములం బ్రతిఫలింప మహాజ్యోతియందు నిప్పురవలు గానఁబడురీతిని అక్షరుఁడగు బ్రహ్మమునుండి జీవు లుత్పత్తి యగుచున్నారు. ఈశ్వరునియందు లీనమై సరూపులై యుందురు.

యథా సుదీప్తాత్పావకా ద్విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే సరూపాః ।
తథాఽక్షరా ద్వివిధాః సౌమ్య భావాః
ప్రజాయంతే తత్ర చైవాపి యంతి ॥ (ముం.ఉ.)

ఆ స్థితియందు ఈశ్వరునకును తదంశములగు జీవులకును భేదము గోచరముగాదు. అయినను మహాజ్యోతియందలి విస్ఫులింగములవలె సంతతప్రఖ్యాతములై యుండును. మఱియును ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడు. అందిమిడియుండు జీవుఁడన్ననో అల్పజ్ఞుఁడును, అల్పశక్తిగలవాఁడు నగు. ఎటులననఁగా నీశ్వరుఁడు మాయాశక్తియను గొప్ప

శక్తిని స్వాధీనము చేసికొనినవాఁడై ప్రకృతిని వశపఱచుకొని యిష్టానుసారముగ నాప్రకృతిఁ దన కుపాధిగ నొనరించుకొని వర్తింప శక్తిగలవాడు. కావున నీశ్వరుఁడు ప్రకృతియందుఁ బ్రవేశించి వర్తించుచుండినను, ప్రకృతి లేనిచోఁ దాను వ్యాపారహీనుఁడై యుండియు, నాప్రకృతి యీశ్వరుని బంధించి మోహింపఁజాలక యున్నది. ప్రకృతిగుణము లగు సత్త్వరజస్తమోగుణములు వారి కధీనములై వర్తించునవి. జీవులన్నచో అట్లు కాదు. ఈశ్వరునియం దంతర్భూతములై యున్నంతవఱకు, ఈశ్వరస్వరూపకల్పులై యుండియు, ఈశ్వరుఁడు స్వేచ్ఛగాఁ బ్రకృతియందుఁ బ్రవేశింపఁగా, జీవులును ఈశ్వరేచ్ఛావశవర్తులై పాంచభౌతికమగు ప్రపంచమునం బ్రవేశించి ప్రకృతివశులైరి. ప్రకృతియందుఁ బ్రవేశించియు స్వతంత్రుఁడై యధీశ్వరుఁడై వర్తించు శక్తిగలవాడు ఈశ్వరుఁడు. ప్రవేశించి పరతంత్రులై ప్రకృతి కధీనులై వర్తించువారలు జీవులు. ఇట్లు తమ్ము బంధించు ప్రకృతియందుఁ బ్రవేశించి, యీ ప్రకృతియే తామను భావముగలిగి, సంసారచక్రమునంబడి బహుకాలము పరిభ్రమించుటవలన తమ్ము బంధించుచుండు ప్రకృతిస్వరూపమును కొంచెము కొంచెముగఁ దెలిసికొనుచు కాలక్రమమున నాప్రకృతి తమకంటె భిన్నముగ నెఱింగి కట్టకడపట ప్రకృతిని స్వాధీనము చేసికొని యీశ్వరునివలె తాము ప్రకృతిగుణముల నతిక్రమించి

ప్రకృతికధీశ్వరులగుటయే సంసారచక్రమునం బ్రవేశించుట వలని ప్రయోజనము. ఆదియందు ప్రకృతికి వశులైనం గాని తుదను ప్రకృతిని స్వాధీనము చేసికొనుట సాధ్యముగాదు. ఒక దృష్టాంతము దీని విశదీకరించును. ఒకానొక పురుషుఁడు తన దేశమునంతయు చక్కఁగ పరిశీలించి సర్వము తనకుఁ దెలిసినదిగఁ జేసికొని, తన దేశమునఁ దనకుఁ దెలియని దొక్కటిగాని లేకయుండె ననుకొనెదము. అట్టిపురుషుఁ డొకఁడు దేశాంతరయాత్ర నుద్దేశించినచో నాదేశమున సర్వము దానెఱుఁగనిదియే. ఆ దేశప్రాంతములఁ జేరినది మొదలు దిక్కు తెలియక త్రోవచూపువాఁ డొక్కఁడుండిన బాగుగదా యని పరితపించునుగదా! అప్పు డాదేశస్థుని నొకనిఁ దనకుఁ ద్రోవఁజూపుటకు నియమించుకొని యాతఁ డేదిక్కునకుఁ గొనిపోయిన నాదిక్కున కేగుచు, నామార్గ దర్శికి లోఁబడి సంచరింపక తీరదుగదా! అట్లు వానికి మొదట లోఁబడి దేశమంతయు సంచరించి యాదేశము నామూలాగ్రముగఁ బరిశీలించి దేశస్వరూపమంతయు చక్కఁగ నెఱింగినపిదప నామార్గదర్శి తనకులోఁబడి వర్తించు వాఁడేగదా! అటులనే జీవుఁడు తొలుదొల్త పాంచభౌతిక మగు ప్రపంచమునం బ్రవేశింపఁగాఁ బ్రకృతికి లోఁబడి, యంధప్రక్రియనుండి, బహుకాలము నానావిధములగు నను భవములఁ బొందుచు ప్రకృతిస్వరూపము నెఱుంగుచు క్రమ

క్రమమునఁ బ్రకృతిని జయించి స్వాధీనము చేసికొని సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడునయి బ్రహ్మస్వరూపుఁడగును. ఇట్టి పదవినిఁ బొందుటకు జీవుఁ డేయే యనుభవములను బొందునో విచారింపఁదగియున్నది. జీవులీశ్వరాంశములగుటంబట్టి మొట్టమొదట నీశ్వరునియందే లీనమైయుందురు. అపుడు జీవులు అహంకారతత్త్వమున నుండువారలు. అనఁగా సూక్ష్మాకాశమునకంటె సూక్ష్మతరమగు ప్రకృతి నుపాధిగఁ జేసికొని నిష్ప్రపంచమనదగు స్థితిని వెలయుచుందురు. ఈశ్వరుఁడు యోగనిదురనుండి మేల్కాంచి సృష్ట్యున్ముఖుడై "బహుస్యాం ప్రజాయేయ" యని సంకల్పింప, నాయీశ్వరునియందు లీనులైయుండు జీవులందఱును ఇంచుక బహిర్ముఖులగుదురు. అంత నాజీవులయందు కొంచెముగ ఇచ్ఛ యంకురింప నొక్కొక్క యీశ్వరాంశమును పాంచభౌతికమగు ప్రపంచమున ప్రవేశించి క్రమక్రమమున నొక్కొక్క తత్త్వమునుండి యొక్కొక్క సూక్ష్మభూతమును స్వీకరించి వాని నుపాధులుగఁ జేసికొని యాయాలోకములోని యనుభవములను బొందుటకు అర్హుఁడగును. ఈ యణువులు (సూక్ష్మభూతములు) అన్నియు వేదాంతగ్రంథములయందు దేహబీజములని యెఱుంగఁబడుచున్నవి. అనగా రాబోవుకాలమున జీవునకుంగల నానావిధములగు కర్మజాతములగు శుభాశుభవాసనల కునికిపట్టయి యనేకజన్మములయందు కర్మానుసారముగ దేహముల

నుత్పత్తిచేయుట కాధారములయి యుండును. ఇట్లు క్రమముగ నీ దేహబీజములద్వారా స్థూలములగు లోకములయందుఁ బ్రవేశించి కట్టకడపట పృథివీతత్త్వమున అనఁగా భూలోకమునఁ బ్రవేశించినవాఁడగు. అపుడు జీవునిస్థితి యెట్టిదనిన, ప్రపంచజ్ఞాన మించుకయైనను లేక కేవలాంధకారమగ్నుఁడై యుండును. అపుడు పాషాణాదు లుపాధిగ గలిగి యతిస్థూలమగు ప్రకృతియందు అంతర్యాతమై యుండుటచే నందు జీవకళయనునది యొకటియున్నదా యని సంశయమున కాస్పదమగుచున్నది. అపుడు జీవకళ పాషాణాదులయందు గాఢనిద్రయం దుండునట్లు తమోమగ్నమై యుండును. అయినను పాషాణాదులయందును జీవకళ యున్నదని యూహింపక తీరదు. పటిక, మైల్తుత్తము మొదలగు పదార్థములు కొన్ని పాషాణాదులలో చేరినవియే. అవి ఖనిజములు. వానిని చక్కఁగ పొడిచేసి వేఁడివేఁడి నీటియందు కరిగించి యానీటి నొకవెడల్పు మట్టిపాత్రమున గాలిసోకు స్థలమునందుంచి యారనిచ్చినచో నా నీరావిరి రూపమున నదృశ్యమగును. అపుడు నీటియందు కరిగిపోయి యుండిన పటిక లోనగుపదార్థములు వెనుకనిలుచును గదా! తొలుత పొడిచేయఁబడి నీటిలో కలిసిపోయి యుండినవి గావున నీ రెండిపోయినవెనుక నా పదార్థము పొడిపొడిగా నడుగున నిలిచిపోవుననుకొనుట సహజము గదా! అట్లగపడుట లేదు. ఆ నలుసులన్నియు నొకటి

తోనొకటి చిత్రముగఁజేరి విచిత్రములగు సుందరమైన రూపము లేర్పడును. ఆ రూపములన్నియు, ఒక్కొక్క వస్తువున కొక్కొక్క రూపముగ నుండును. మన మెన్ని విధముల మార్చ్రఁజూచినను, ఎన్నిమారులు పరీక్షించినను ఆ వస్తువు నీటినుండి బయట వచ్చునపుడెల్ల నారూపమునే ధరించును. నున్నని పొడిగాఁ జేయఁబడి నీటిలో గలిసి పోయిన నలుసులు తమంతట తామొకటితో నొకటిచేరి దివ్యసుందరములగు రూపముల ధరించుటవలన నా నలుసులయందుఁగూడ నొక విలక్షణమగు జ్ఞానశక్తి యున్నదని తలంపక తీరదు. ఇంతియ కాదు. రెండుమూడు వస్తువులను కలిపి పొడిచేసి నీటిలో కరిగించి పైన సూచించిన విధమున నారనిచ్చినచో నావస్తువులు తిరిగి తమంతట తాము వేఱు వేఱుగా నేర్పడి యొక్కొక్క వస్తువును తనకు స్వభావమగు సుందరరూపమును ధరించును. ఇట్టిశక్తి ధాతువర్గమునందు (అనగా పాషాణాదులయందు) గలిగియుండుటచే వానియం దాత్మకళ యున్నదని యూహింపక తీరదు. ఈ విషయము గీతాశాస్త్రమునందు భగవంతుఁడు నొక్కి చెప్పి యున్నాడు.

యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ ॥

స్థావరముగాని జంగమముగాని యెంతస్వల్పమైన దైనను వస్తువొకటి లోకమునపుట్టినా, అది క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగముచేతనే పుట్టునని తెలిసికొనుము.

"న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥"

చరముగాని అచరముగాని భూతమొక్కటియైనను నేను లేకయే ఉండజాలదు.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"

సమస్తభూతములలో హృదయప్రదేశమున, అనఁగా అంతర్యామియై, ఈశ్వరుఁడున్నాఁడు.

"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ॥"

సమస్తభూతములయం దంతర్యామినై యుండు నాత్మస్వరూపుడను నేనే సుమీ!

మఱియు నిట్టిప్రమాణములు లెక్కలేక శ్రుతిస్మృతుల నుండి గ్రహింపనగు. ఇక్కాలపు ప్రకృతిశాస్త్రిపారీణులలో ప్రథమగణ్యుఁడని లెక్కింపఁబడుచు, కలకత్తాకళాశాల యందు ప్రకృతిశాస్త్రిపండితుఁడు (Professor of Physical Science) నగు జగదీశచంద్రబోసు అను ప్రముఖుఁడు కొన్ని యంత్రముల నిర్మించి లోహములయందును, చెట్లయందును, జంతువులయందును, మానవులయందును ఒక్కరూపమగు

ప్రాణమున్నదని స్పష్టముగ దృగ్గోచరమగునటుల నిరూపించి ఖ్యాతివహించి యున్నారు. విషపదార్థములను, మైకమును కలిగించు వస్తువులను, జంతువులకిచ్చి, చెట్లమీదను, తీగల మీదను ప్రయోగించి, లోహములమీదను ప్రయోగించి వారు నిర్మించిన యంత్రములతో పరీక్షించినయెడల, నన్నింటి యందును ఒక్కవిధమైన గుణమే కనఁబడెను. ఆ విధమున నన్నింటియందు ప్రాణమనునది యొక్కవిధమున నున్నదని యును, సజీవములు నిర్జీవములను భేదము మిథ్య యనియును స్పష్టముగ నిర్ధారణచేసి పాశ్చాత్యులలో ప్రకృతిశాస్త్రిపారీణులగు వారలలో కీర్తివహించినారు. మనదేశపు మతగ్రంథములయందు దృఢముగ చాటించియుండియు, పాశ్చిమాత్యులచేతను, వారలంజూచి మనదేశస్థులలో గొందఱచే నమ్మరానిదని యెంచబడుచున్న యీ గొప్పవిషయము కడపట, పశ్చిమదేశపద్ధతుల ప్రకృతిశాస్త్రిములంజదివి వారిమార్గములతోడనే యీ గొప్పరహస్యము పశ్చిమదేశస్థులకు వెల్లడి చేయు పుణ్యము, మనదేశమున జన్మించి పాశ్చాత్యులచేత గౌరవపాత్రుఁడని కీర్తివహించిన జగదీశచంద్రబోసుగారికే కలిగెగదా! యెంత సంతసమునకు కారణము!

పాషాణాదులయందు జీవకళయున్నదంటిమి. అక్కాలమున గాఢనిద్రయందుండు నట్లుండుననియు నుడివితిమి. బహిఃప్రజ్ఞయనునది యించుకయైనను లేదు. అయినను

పాషాణాదులయం దాత్మశక్తి సత్తామాత్రముగ నుండునని శ్రుతులయందు చెప్పఁబడియున్నది. ఇట్టి స్థితియం దీ జీవకళలు ఎట్టియనుభవములఁ బొందుదురో నిచ్చట సూచించుట కలవి కాదు. ఎండ కెండి, వానకు తడిసి మంచుచే స్పృశింపఁబడి గాలిచేగొట్టబడి కొన్ని వేళల కొలిమియందలి యగ్నియందును, మఱికొన్ని సమయముల భూమియందును జలములందును పడి బహువిధములగు ననుభవములు గలిగి, పరిపక్వులై యాస్థితి నుండి యంతకంటె నుత్తమమగు శరీరములదాల్చుట కర్హులు కాగా నా జీవకళలు ఓషధివనస్పతులయందు ప్రవేశింతురని గ్రంథములయందు సూచింపబడి యున్నది. ఆ యోషధివనస్పతులయందుండు కాలమున ఆత్మశక్తి మునుపటికంటె నెక్కుడుగ నభివ్యక్తమగుచున్నయది. వేసవికాలమున సూర్యుని చండకిరణములకు వృక్షములు వాడి వ్రేలబడుటయు, ఇంచుకవర్షము కురియగా నా చెట్లు మిగుల ప్రకాశముగలిగి తలలనెత్తుటయు, తమకాహారము, వెలుతురు ఏయే స్థలముల యందు దొరకునో ఆయా స్థలములకు వేరులను శాఖలను తీగలను వ్యాపింపఁ జేయుటయు, లతలు తమకాధారము దొరకునాయని యాకసమున నల్లాడి సన్నని పుడక యొకటి దొరికినను దానిని చుట్టుకొని గట్టిగ పట్టుకొని మఱియొక యాధారమునకు వెదకుచు సంచరించుటయు, కొన్నికొన్ని పుష్పములు లోనగునవి సూర్యునికాంతి కెదురుచూచుచు, సూర్యుఁ డేదిక్కు

నకుఁ బోయిన నాదిక్కునకుం దిరుగుటయు నీ మొదలగు లక్షణములన్నియు, నా యోషధివనస్పతులయందుండు నాత్మశక్తి పాషాణాదులయందుండుటకంటె నెక్కుడుగ నభివ్యక్తమగుచున్నదని స్పష్టముగఁ దెలుపుచున్నది. ఓషధివనస్పతులయందు ప్రాణము కనఁబడుచున్నయదిగదా ! రసరూపమున ప్రాణము ప్రసరించుచున్నది. వృక్షములలో బ్రతికియుండునవి, యెండిపోయినవని భేదములు స్పష్టములుగ నున్నయవి. పాషాణాదులయందు ఆత్మ సత్తామాత్రముగ నున్నదని ముందు చెప్పితిమి. వృక్షజాతియందు ఆత్మయొక్క చిచ్ఛక్తియు కొంచెము పొడచూపుచున్నది గదా ! ఈ స్థితియందు బహుకాలముండిన వెనుక నా జీవకళలు వృక్షజాతి యుపాధులను వదలి యంతకంటె నుత్కృష్టమగు నుపాధులనొందుట కర్హములై తిర్యగ్జంతువులయందు గొంతకాలముండును. నిశ్చలములగు పాషాణాదులయందుండు కాలమున గలుగు ననుభవములకంటె నెక్కుడగు ననుభవములు ఓషధివనస్పతులయందు జీవకళలకు గలుగును. వృక్షములు స్థావరములయ్యును కొంతమట్టుకు చలనముగలిగి యిష్టానుసారముగ నలుదిక్కుల వ్యాపించుటకు, వృక్షములకును గుల్మలతాదులకును శక్తి గలదు గదా ! తమకు సుఖదాయకములగు సూర్యుని వెలుగు, జలములు, ఆహారము ఏదిక్కున నబ్బునో ఆ దిక్కునకు శాఖలను, తీగెలను, వేరులను వ్యాపింపజేసి యాయనుభవములను

బొందజాలి యున్నవి. తిర్యగ్జంతువులలోనుండు కాలమున నాజంతువు ఇష్టానుసారముగ సంచరించి, యిష్టములగు నాహారముల సంపాదించుకొని భుజించి తమతమశక్తిని వృద్ధిచేసికొనుచు మఱియుఁ నితర జంతువులవలన బాధల బెందుచు, జాతివైషమ్యములకును భయమునకును లోనగుచు, సుఖదుః ఖానుభవముల పలుమరు పొందుటచే ననేకములగు ననుభవములు గలిగి ఆత్మయందు బీజరూపముగనుండిన శక్తులను అభివ్యక్తములుగఁ జేసికొనుచు బహుకాలానుభవమునకు తుదను ఆజాతి శరీరములవదలి మానవశరీరమును దాల్చుట కర్హములగును.

ఇంతకాలమువరకు శిశువును గర్భమున నుంచుకొని రక్షించి వృద్ధిచేయు తల్లివలె జీవకళలు ఈశ్వరుని శక్తిచేతనే యభివృద్ధిఁజెందుచు, బీజరూపముగనుండు శక్తులను, కొంచకొంచముగ నభివ్యక్తములుగఁ జేసికొనుచుండును. మానవ తనువుదాల్చు కాలమురాగా మనశ్శక్తి వ్యక్తమై యుక్తాయుక్తవివేకము కొంతదనుక వికసించి, యీపైకాలమున చేయు సమస్తకార్యముల ఫలము ననుభవించుట కర్హుఁడగును. ఆ పిదప పుణ్యపాపకర్మములవలని ఫలముల ననుభవించుటకు బద్ధుడగుచున్నాడు. ఈ వివేకము కలుగుటంబట్టియే మానవ జన్మము ఉత్తమమని శ్రీ శంకరాచార్యులవారు చాటించి యున్నారు.

ఇట్టి యపురూపమును, దుర్లభమగు మానుషజన్మము వచ్చినపిదప జీవకళయని సంజ్ఞమాని జీవుడు అను సంజ్ఞను గ్రహించి, యాపైన నెట్లు పురుషార్థప్రాప్తి కర్హుఁడగునో యోచింతము.

## ఐదవ అధ్యాయము

### జీవునియాత్ర

జీవకళలు పాంచభౌతికమగు ప్రపంచమునం బ్రవేశించి నది మొదలు క్రమక్రమమున స్థూల స్థూలతర స్థూలతమము లగు ప్రకృతియందుఁ బ్రవేశించి మొట్టమొదట మృత్పాషాణాదులయందును, ఆవల తరుగుల్మలతాదులయందును ఓషధి వనస్పతులయందును, ఆపైన తిర్యగ్జంతువులయందును అనగా పశుపక్ష్యాదులయందును బహుకాలము గడిపి నానావిధము లగు ననుభవములనుఁబొంది బీజరూపముగ నుండిన యాత్మ శక్తులను క్రమక్రమముగఁ గొంతదనుక నభివ్యక్తములుగఁ జేసికొని తుదను మానవశరీరమును దాల్చుట కర్హములగు నను నంశములు పూర్వము సంక్షేపముగ వ్రాయఁబడెను. మఱియును జీవకళలు తమతమ దేహబీజములగు సూక్ష్మభూతములతో పాషాణాదులయందుండు కాలమున, ఆత్మ సత్తామాత్రముగ నభివ్యక్తమై యుండుననియు, అనగా సచ్చిదానందములను లక్షణత్రయములో 'సత్' అను లక్షణము మాత్రము వ్యక్తమై యుండుననియును, తరుగుల్మలతాదుల యందు ఇంచుక సుఖేచ్ఛపొడముట గానవచ్చుననియు, తిర్య

గ్జంతువులయం దుండుకాలమున నీయిచ్ఛ యభివృద్ధియయి, యీసుఖానుభవసాధనములగు నింద్రియములుసహిత మభి వ్యక్తములయి, కొంచెముగ మనశ్శక్తి బీజరూపముగ గన్పట్టు చున్నదనియును, ఆ కాలమున జీవునియందలి 'చిత్' అను లక్షణ మభివ్యక్తమగుననియును తెలుపఁబడెను. యథార్థ ముగ జీవుఁ డీశ్వరాంశమై, ఈశ్వరునితో 'సరూపమై' యుం డుటం బట్టి ఈశ్వరుని ప్రతిబింబమనదగియుండు సచ్చిదానంద స్వరూపుఁడు. కావున నచేతనములయందును, స్థావరజంగమ ములయం దుండునపుడు సత్, చిత్, అను లక్షణద్వయము మాత్రమే యభివ్యక్తములయి యుండెను. ఆ 'చిత్' అనులక్ష ణము సహితము పూర్ణముగ నభివ్యక్తమై యుండలేదు. అది పూర్ణముగ నభివ్యక్తమయి వికసించుటకును, నిజమైన యానం దమును వికసింపఁజేసికొనుటకును జీవుఁడు మనుష్యతనువును దాల్చును. ఇట్లనేక కల్పములకాలము అనేకకోట్ల యోనుల యందు జననమొంది నానావిధములగు సుఖదుఃఖముల నను భవించి కట్టకడపట మానవజన్మము నొందును. కావున మానవులందరు పూర్వము ఈ యనుభవము లన్నింటిని పొందినవారలే యనుటకు సందియమించుకయైనను లేదు. ఈ విషయము శ్రుతులయందును, భాష్యములయందును స్పష్టముగ నిరూపింపఁబడియున్నయది.

ఐతరేయారణ్యకమున :

"తస్యయ ఆత్మానమావిస్తరాం వేదాశ్నుతే హోవిర్యాభ యః, ఓషధి వనస్పతయో యచ్చ కించ ప్రాణభృత్ సఆత్మానమా విస్తరాంవేద, ఓషధివనస్పతిషు హి రసో దృశ్యతే, చిత్తం ప్రాణభృత్సు, ప్రాణభృత్సు త్వేవా విస్తరామాత్మా, తేషు హి రసోఽపి దృశ్యతే, న చిత్త మితరేషు. పురుషేత్వేవా విస్తరామాత్మా. స హి ప్రజ్ఞానేన సంపన్నతమః, విజ్ఞాతం వదతి విజ్ఞాతం పశ్యతి వేదశ్వస్తనం వేదలోకాలోకౌ మర్త్యేనామృతమీప్సతి, ఏవం సంపన్నః, అథేతరేషాం పశూనాం అశనాపిపాసే ఏవాభి విజ్ఞానమ్, నవిజ్ఞాతం వదంతి నవిజ్ఞాతం పశ్యంతి న విదుః శ్వస్తనం నలోకాలోకౌ, త ఏతావంతో భవంతి, యథా ప్రజ్ఞం హి సంభవాః." (౨-3౨)

ఆభివ్యక్తమగు సమస్త జగత్తునం దాత్మ నెవఁడు చూడఁగలఁడో ఆ పురుషుఁడు సృష్టిమహిమ నెఱుఁగఁగల వాఁడు. తరుగుల్మలతాదులును, ఓషధివనస్పతులును, ప్రాణ ధారులగు సమస్తభూతములును అభివ్యక్తమైయుండు నాత్మగా నెఱుంగును. ఓషధివనస్పతులయందు రసము గానవచ్చును. ప్రాణభృత్తులయందు చిత్తము గానవగును. ప్రాణభృత్తుల యం దాత్మశక్తి యెక్కుడుగా వ్యక్తమగుచున్నయది. వాని యందును రసము గానవచ్చుచున్నదిగాని యితరములందు చిత్తము గానరాదు. అన్నిటికంటె మానవునం దాత్మ

యెక్కుడుగ నభివ్యక్తమగుచున్నయది. తక్కుభూతము లన్నింటికంటె మనుజుఁడు సంపూర్ణముగ జ్ఞానముగలవాఁడు [ప్రజ్ఞానసంపన్నతమః] తెలిసినదానిని వచింపఁగలఁడు. తెలిసినదానిని కన్నులతోఁ జూడఁగలడు. ముందుదినము జరిగిన విషయము స్మరించగలఁడు. దృశ్యాదృశ్యముల నెఱుంగును. మర్త్యము నాధారము చేసికొని యమృతత్వమును గోరును. ఇవ్విధంబున సంపన్నుఁడై యున్నవాఁడు. ఇతరభూతము లన్నో, తిర్యగ్జంతువులందు క్షుత్పిపాసావిషయములే జ్ఞానము. తెలిసిన విషయములను మాటాడఁజాలవు. వానిం జూడజాలవు. ముందటి దినమున జరిగిన విషయమును స్మరింపజాలవు. లోకాలోకముల నెఱుంగఁజాలవు. వానిశక్తి యింత మాత్రమే, జ్ఞానము ననుసరించియేగదా జన్మములు—అని తాత్పర్యము.

సమస్తభూతములును ఆత్మయొక్క యుపాధులేగాని యాత్మేతరపదార్థ మొక్కటియు లేదు. ఆత్మ తనయందు బీజరూపముగనుండు శక్తులను క్రమక్రమమున ఓషధివనస్పతులయందుఁ గొన్నింటిని, ప్రాణభృత్తులయందు అనగా పశుపక్ష్యాదికములగు తిర్యగ్జంతువులయందు మఱి కొన్నింటి నభివ్యక్తముగఁ జేసికొని కడపట మనుష్యశరీరముఁదాల్చి, సమస్తశక్తులను వికసింపచేసికొని పరిపూర్ణజ్ఞానసంపన్నుఁడగు నని స్పష్టముగా విదితమగుచున్నది.

జీవకళలు మానవజన్మము నొందుటకుమున్ను వరుసగ ఓషధివనస్పతులయందును, తిర్యగ్యోనులయందును బహు కాలము నానావిధానుభవములఁ జెందియే మానవజన్మమున కర్హములగు. పాషాణాదులు సయితము ఆత్మయుపాధులే గాని యితరము గాదు. పైన ఉదహరింపఁబడిన శ్రుతివాక్యములపై శ్రీ సాయణాచార్యులవారు భాష్యము వ్రాయుచో నిట్లు వ్రాసియున్నారు.

"సచ్చిదానందరూపస్య జగత్కారణస్య పరమాత్మనః కార్యభూతాః సర్వేఽపి పదార్థాః ఆవిర్భావోపాధయః, తత్ర అచేతనేషు మృత్పాషాణాదిషు సత్తామాత్ర మావిర్భవతి, నచాత్మనో జీవరూపత్వం, యేతు ఓషధివనస్పతయో జీవరూపాః స్థావరాః, యేచ శ్వాసరూపప్రాణధారిణః జీవరూపాజంగమాః, తే ఉభయే అతిశయేన ఆవిర్భావస్థానమితి."

కార్యరూపమైన సమస్తపదార్థములు జగత్కారణుఁడును, సచ్చిదానందస్వరూపుఁడునగు పరమాత్మయొక్క యుపాధులు. అందు అచేతనములగు మృత్పాషాణాదులయందాత్మ 'సత్తామాత్ర' మావిర్భవించి యున్నయది. అందాత్మకు జీవరూపత్వము లేదు. స్థావరములగు జీవరూపములు ఓషధివనస్పతులు. శ్వాసరూపమగు ప్రాణమును గలవి జంగ

మములగు జీవరూపములు. ఈ రెండింటియందు ఆత్మ అతిశయముగ నావిర్భావము చేసియున్నది—అని తాత్పర్యము.

కావున నాత్మ మృత్పాషాణాదులయందు సత్తామాత్రముగ నావిర్భవించియుండి, యాపిదప స్థావరములగు జీవరూపమును దాల్చి, జంగమములగు జీవరూపముల కొంత కాలము గడిపి, కడపట జీవుఁడు మనుష్యశరీరము దాల్చెనను విషయము నవీనసిద్ధాంతము కాదు.

జీవకళలకు పాంచభౌతికమగు ప్రపంచమంతయు జ్ఞానసాధనమగు విద్యాశాలవంటిది. ఇపుడు మనుష్యజన్మమునందు జీవులు పూర్వకాలమునుండి వికాసము చెందినటుల నెయనేకులు జీవకళలు ఇక్కాలమునను పాషాణాదులయందును, తీగెలు, మ్రాకులు, పొదలు లోనగు వానియందును, పశుపక్ష్యాదులయందును క్రమక్రమమున వికాసమునొందుచున్నయవియె. కనుక మానవులు తక్కుభూతములకన్నింటికి జ్యేష్ఠభ్రాతల స్థానమునందుండు వారలు. వాని నెన్ని విధములనైనను ప్రేమించి వానియెడ మిగుల దయతో వర్తించి వానియందలి యాత్మశక్తులను వికసింపఁజేయఁ బ్రయత్నము చేయుట యుక్తము. అన్నింటియందును అత్మ ప్రవేశించియే యున్నదని తెలిసికొని, వానికి సాధ్యమైనంతవరకు హానిగలుగక యుండ ప్రవర్తించవలెను. కావుననే శాస్త్రములయందు

విధింపఁబడియుండు నిబంధనలు సార్థములుగ నున్నట్లు స్పష్టమగుచున్నది.

ప్రాతఃకాలమున మానవుఁడు దేహబాధలం దీర్చుకొనవలెనన్న భూమిని ప్రార్థించి, యాపిదప మలమూత్రవిసర్జనము చేయవలయునని విధింపఁబడియున్నది. దంతధావనమునకు సయితము ఒక పుడుక విరువవలెనన్న, వృక్షమును వినయపూర్వకముగ ప్రార్థించి, యాపుల్లను తీసికొనవలెననియును ఆజ్ఞాపింపఁబడి యున్నది. నదీజలములను స్నానము చేయవలెనన్నను, తీర్థరాజమును ప్రార్థించి, తీర్థమును యాచింపుడని విధింపఁబడి యున్నదిగదా! ఈ నిబంధనలన్నియు, సర్వత్ర ఆత్మ వ్యాపించియున్నదనియును ఒక్కొక్క కార్యమునను, సర్వత్ర వ్యాపించియుండు నాత్మను గమనించి చూడవలయుననియు, ఏ భూతమునైనను లాఘవముగ చూడక గౌరవముతో నెంచవలయుననియును సూచించుచున్నయవి. వంటచెఱుకుగా ఎండిన మ్రాకుల నుపయోగింప వలయునుగాని, బ్రతికి వృద్ధియగుచుండు వృక్షముల కొట్టరాదను నియమము సయిత మీయర్థమునె ప్రతిపాదించుచున్నది. గృహనిర్మాణముకొఱకు సామాన్యముగ మ్రానులనరికి యిల్లుకట్టుట శ్రేయస్కరము కాదను నమ్మకము దేశమునందంతట గలిగియే యున్నది. యోగులగువారు అరణ్యములందు ఆకలములు భక్షించి జీవించుట సాధ్యమైనంతవఱకు భూతములకు హింస

మానవలయుననియే గదా! అచ్చటనుఁ గూడ, పండి నేల రాలిన ఆకులుమాత్రము భక్షించుచు, పచ్చియాకులను భక్షింపకయుండు నియమము మహాయోగులు అవలంబించు చుండిరని గ్రంథములవలన తెలియవచ్చుచున్నది. దేవకార్య ములయందు సైతము, హోమాదులకు శుష్కేంధనములు, అనగా ఎండిన సమిధలు మాత్రము గొనవచ్చునుగాని, పచ్చి సమిధలు కొనరాదనియు నియమము గలదు. ఇవియన్నియు, అంతటను ఆత్మ వ్యాపించియే యున్నదని జ్ఞాపకము చేయు టకుకాక వేరేమి? ఇట్లు చెట్టుచేమల విషయమై యిన్ని నియ మములును నిబంధనలును గృహస్థులకు విధింపఁబడియుండ, జీవహింస విషయము వ్రాయవలయునా! "అహింసా పరమో ధర్మః" హింస వదలుటకంటె శ్రేష్ఠమగు ధర్మము లేదను వాక్యము సర్వత్ర ఆదరణీయము గదా! ఆత్మ సర్వాంత ర్యామి యని నోటిమాటలతోఁ జెప్పుచు, హింసారూపమగు నడత నడచుటకంటె దోషము వేరు కలదా? "ఆత్మవత్సర్వ భూతాని" యను నార్యోక్తి ననుసరించి, తనవలెనె సమస్త భూతములును సుఖము నన్వేషించుచున్న వనియును, దుఃఖము నివారించుకొన గోరుచుండుననియు నెఱింగి పరమధర్మమగు 'అహింస' ఎల్లవారును అనుష్ఠింతురుగాక.

మఱియు నీ విషయము శ్రీ కృష్ణులవారు ఉద్ధవున కుపదేశించిన మోక్షమార్గమున మిగుల స్పష్టముగ నిరూపిం

పఁబడి యున్నది. భగవంతుని పాదములఁ జేరగోరువారందరు, ఈశ్వరుఁడు జీవకళగా నెల్లయెడల నుండుట నెఱింగి, సర్వ భూతములును ఈశ్వరుని నామరూపములుగ భావించి, గోఖర చండాలపుల్కసులకు సయితము చూచినపుడెల్ల భూమిపైబడి దండవత్ ప్రణామము లాచరింపవలయుననియును, ఆ ప్రకారము సర్వభూతము లాత్మరూపములే యను జ్ఞానము సర్వ సాధారణమగు నంతదనుక నాచరింపవలయుననియు, ఇదియె మోక్షోపాయము లన్నింటిలో సులభమయి సర్వసాధ్యమై యమోఘ ఫలదాయకమగునని శ్రీ కృష్ణభగవంతుడు తన ముఖ్య ప్రియ శిష్యులలో ప్రథమగణ్యుఁడైన యుద్ధవున కుప దేశించి యున్నాడు. ఎల్లవారును ఈ విషయమును మననము చేసి, సర్వభూతహితులగుటకు యత్నింతురు గాక.

# ఆఱవ అధ్యాయము

## జీవునియాత్ర

జీవకళలు తమతమ దేహాబీజములు అను సూక్ష్మభూత ములతో భూలోకమున మొట్టమొదట మృత్పాషాణాదుల యందును ఆ వెనుక తరుగుల్మలతాదులయందును వనస్పతుల యందును తదనంతరము తిర్యగ్జంతువులయందును నివసించి క్రమక్రమమున మనుష్యతనువును దాల్చుట కర్హములగునని పూర్వపు అధ్యాయములయందు వ్రాయఁబడెను. ఇంతకాల మును భగవంతుఁ డీజీవకళలను, తల్లి శిశువును గర్భమునం దుంచుకొని కాపాడునటుల తనయందుంచుకొని వికసింపఁ జేయుచుండును. స్వాతంత్ర్య మించుకయైనను లేదు. మనుష్య జన్మము వచ్చుటయన్న విజ్ఞానమయకోశ మేర్పడుటయే. ఆ స్థితి శిశువు మాతృగర్భమునుండి వెలివడిన స్థితికి నుపమిం పఁదగు. మాతృగర్భమునుండి వెలివడి, ప్రత్యేకమగు తనువుఁ దాల్చియుండియు, ఉచ్ఛ్వాసనిశ్వాసములును, విణ్మూత్ర విస ర్జనములును దప్ప నితరకార్యములు స్వతంత్రముగ నొనర్చు కొనుటకు శక్తిలేక తల్లిపోషణవలననే యభివృద్ధిచెందుచుం డును గదా? ఆహారము తల్లివలననే పొందవలయును. అహ

ర్హిశము తల్లి సంరక్షణమునకు పాత్రమైయుండవలెనుగాని, స్వతంత్రమనునది యెట్టిదో యెఱుగదుగదా! అటులనే జీవం కళలు మనుష్యత్వమును పొందినపిదప బహుకాలమువఱకు శిశుప్రాయులై తమకంటె బహుకాలమునకు ముందుగ నర త్వమునొందిన జీవులసహాయము చేతనే యభివృద్ధి కావలసి యుండును. అప్పటి స్థితియందు పూర్వానుభవసంబంధములగు వాసనలేవైన నుండునాయని చూడ మృగశరీరమున నుండిన కాలమునం బొందిన కేవలములగు నింద్రియవ్యాపారములవలని వాసనలు తప్ప మఱియేవియుం గానరావు. అనఁగా నాస్థితి యందుండు జీవుఁడు జ్ఞానహీనుఁడును కేవల పశుప్రాయుఁడుగ నుండును. మృగములకును మృగప్రాయులగు మనుజులకును తారతమ్యమెట్టిదో బాహ్యదృష్టికి స్పష్టముగాకయుండును. కొన్నివిధములగు క్రోతులు చూచుటకు మానవులవలెనే యగపడును. అయినను వానియందు మనుష్యత్వము లేదు. బాహ్యచర్యలయందు భేదమించుకయైనను గానరాదు. అయి నను యోగదృష్టిచేఁ జూచువారలకు నీ రెండుతెగలలో నుండు తారతమ్యము విదితము. మృగములయందు విజ్ఞాన మయకోశము కనఁబడదు. ప్రాణభృత్తులయందు చిత్తము కానఁగునని ముందే శ్రుతివాక్యము ననువదించితిమి. అనఁగా మృగములయందును మనోమయకోశము కొంచెముగఁ గాన నగు. వానియందు కేవల కామక్రోధములు ప్రబలియుండును.

ఐనను పూర్వానుభవమున స్మృతి విశదముగఁ గనబడదు. స్వభావజములగు జాతిగుణములకులోనై మృగములు వర్తించును. విజ్ఞానమయకోశము కానరాదు. అది మానవుల యందు మాత్రము గాననగు. ఇదియె మానవులకును మృగములకును గల భేదము. శరీరపోషణమునకు వలయు నాహారేచ్ఛయు, శరీరశ్రమము నివారించుటకు వలయు నిద్రయు విశ్రాంతియు జాతివృద్ధికి మూలమగు జంతుక్రియయు, స్త్రీపురుషసంయోగము నను నివి మృగములకును మనుజులకును సామాన్య ధర్మములు. కేవల తాత్కాలికమగు సుఖమును నిరాకరించి భావికాలసుఖమును గోరుటయు, పూర్వానుభవముల ననుసరించి, వానివలన సుఖదుఃఖములను జ్ఞప్తియుంచుకొని ముందు రాఁబోవుకాలమున తమతమ చేష్టలను సవరించుకొనుటయు, వానిమూలమునఁ గ్రమక్రమమున జ్ఞానము నభివృద్ధి చేసికొనుటయు, కాలక్రమమున నైహికసుఖమింతుక త్యాగముచేసి యాముష్మికమును గోరుటయు, మొదలగు నివి యన్నియు మానవులయందుండఁదగు లక్షణములు. ఇవి లేనిచో మనుష్యత్వమును పొందియు మృగత్వమునే యవలంబించుటయగు. ఇంద్రియములన్నియు మృగశరీరముననే వ్యక్తమైయున్నయవి గదా! ఆ యింద్రియవ్యాపారములకు మాత్రములోనై యుక్తాయుక్త వివేకములేక వటించుటలో మనుజుఁడు పశువువలెనే నటించుచున్నవాఁడు.

అట్లు చేయక తమ యింద్రియములను, ఇంద్రియవ్యాపారము లను మనస్స్ఫూర్తిగ జ్ఞానసాధనములుగ చేసికొనుటయే మానవ ధర్మము. మనస్స్ఫూర్తిగఁ జేయవలెను. లేనిచో పశువునకును మానవునకును భేదము లేదు. పశువులయందు సయితము బహు కాలదుఃఖానుభవము జ్ఞానబీజమే కాఁదగు. అట్టిజ్ఞానమే జంతువులందు జాతిగుణములని యెంచఁబడునవి. గ్రుడ్డు నుండి యప్పుడే బయలువెడలిన కోడిపిల్ల పరువులిడి నేలపైఁ బడియుండు ధాన్యపుగింజల నేఱుకొని తినును. నీళ్లను చూడ గానే భయపడి వెనుకకు వెళ్లును. నీటిబాతుపిల్ల యన్ననో గ్రుడ్డుపగిలిన మఱునిమిషముననే నీళ్లలో విడిచినను నిర్భయ ముగ నీదులాడును. అజ్ఞానమునందు మునిగియుండినను జేయు కార్యములవలని కష్టసుఖముల ననుభవింపక తీరదు. మన స్స్ఫూర్తిగ ధర్మము నెఱింగి యభ్యసించుటయే మనుజుని యోగ్యత.

ఆదియందు జీవుఁడు మృగప్రాయుఁడై యింద్రియలో లుఁడై యింద్రియసుఖములకంటె నెక్కుడు సుఖమొక్కటియు లేదనియెంచి, తదనుగుణముగ వర్తించును. శరీరతాదాత్మ్యము నొంది, అనఁగా శరీరమే తాననుభావము గలిగి, యాశరీరము అల్పకాలికమగుటంబట్టి, శరీరము నశించుటకు మునుపే యెంత సుఖము పొందసాధ్యమో అంత సుఖము ననుభవింపవలెనని యిచ్ఛయించును. మనుష్యత్వము ప్రాప్తించుటకు ముం

దన్ననో 'నేను' అను భావము లేదు. అంతర్యామిగ నుండు జీవకళచే నడుపఁబడి స్వాభావికములగు జాతిగుణముల ననుసరించి వర్తించుచుండెను గాని "నేను కష్టముగాని సుఖముగాని యనుభవించుచున్నాను" అను జ్ఞానము లేదు. అనగా 'అహంకారము' లేదు. అహంప్రత్యయము లేమింజేసి 'మమకారము' నయితము లేదు. మనుష్యత్వము నొందగా జీవకళ జీవుఁడై "నేను, ఇతరులు" అనుభావము మొట్టమొదట యంకురించుచున్నది. ఆ జ్ఞానము పుట్టగా "నాకు సుఖము కావలెను. ఇతరములగు భూతముల నన్నిటిని నాసుఖము కొఱకు వినియోగించుకొన వలయును" అను నాశ యభివృద్ధి కాఁగా, నా సుఖ మింద్రియసుఖమే యని భ్రాంతిచే నింద్రియ సుఖములలో మునుంగుటకు యత్నించును. అట్టి స్థితియందుఁ బూర్వజ్ఞాన మించుకయైన లేమింజేసి యీ జీవునకు ధర్మాధర్మము లివియని నిరూపించుటకు సాధ్యముగాదు. ఏ కాలముననంగాని జీవుఁడుండు స్థితినుండి యంతకంటె నుత్తమమగు స్థితిని బొందుటకు సాధనమగు మార్గము ఆ జీవునకు ధర్మమనఁబడును. పైజెప్పిన పశుప్రాయునకు నానావిధములగు ననుభవములను పొందుటయు, వానినుండి ఫలించు సుఖదుఃఖముల నెఱుంగుటయు నివియే ధర్మము. అంతకంటె నెక్కుడుగ విధించుట నిష్ప్రయోజనము. మంచిచెడుగులను నవి యెట్టివో ఆ జీవునకు తెలియదు. ఐనను జీవునియందు

బీజరూపముగనుండు నాత్మశక్తులను అభివ్యక్తములుగఁ జేయు టకేగదా యీశ్వరుఁడు జీవుని పాంచభౌతికమగు ప్రపంచ మునం బ్రవేశింపఁజేసె? భూలోకమున మనుష్యశరీరమున మొట్టమొదట 'నేను' అను జ్ఞానము గలవాఁడై యీశరీరమే తానను భావమున, తనసుఖమే ముఖ్యోద్దేశ్యముగ జీవుఁడు వర్తించుచుండును. తదనుగుణముగ భగవంతుఁడును లోక ములో ననేకములగు పదార్థములు సుందరములును సుఖ దాయకములుగ సృజించియున్నవాఁడు. వానింజూచి జీవుఁడు, వాని సుఖదాయకములుగ నూహించి, వానిం జేరి సుఖింప యత్నించు. అందు కొన్ని దీర్ఘసుఖము నిచ్చునవియగుటచే వానియందు ప్రేమ యభివృద్ధియగు. జీవుఁడు వానిని తిరిగి తిరిగి కోరును. వానినుండి సుఖము మరల మరల కలుగను కలుగను ఆ వస్తువులయందలి కోరిక దినదినము వృద్ధియగును. మఱి కొన్ని వస్తువులు చూచుటకు సుందరములుగ నుండియు నను భవమున దుఃఖకారణములగుటచే సాధ్యమైనంతదనుక వాని సంస్పర్శ లేకయుండుటకు యత్నించును. చూచినపుడెల్ల వానిం ద్వేషించు. మఱికొన్ని పదార్థములు తొలుదొలుత నల్పసుఖమునిచ్చినట్లుండియు, వెంటనే దుఃఖకారణములగు టయు నెఱుంగు. మొదట మొదట రాబోవు దుఃఖమునంత యోచింపక తాత్కాలిక సుఖమును మాత్ర మపేక్షించి యాపదార్థము ననుభవించును గాని వెంటనే దుఃఖము

ప్రాప్తించఁగా చింతించును. ఇట్లు పెక్కుమాఱులు అనుభ వము కాఁగా అట్టివస్తువులను నయితము త్యజింపఁగోరును. ఇట్టి యనుభవముల ననేకజన్మములం గడపి బహుకాలానుభవ ముచే కొన్ని పదార్థములును, కొన్ని కార్యములును సుఖదా యకములగుటచే గ్రాహ్యములనియు, మఱికొన్ని దుఃఖకార ణములగుటంబట్టి త్యాజ్యములనియును, మఱికొన్ని యల్ప సుఖమునిచ్చియు, నంత్యమున విశేషదుఃఖమునే గలుగఁ జేయుననియు, మఱియు కొన్ని యాదియందు కొంచెము శ్రమ మును గలిగించునవిగ నుండియు పరిణామమున నత్యంత సుఖ సాధనములనియును నెఱిఁగి యీ మార్గమున నిజమైన యను భవజన్యజ్ఞానము గలవాఁడగును. దీనికిఁదోడుగ తనకంటె పెద్దలగువారలు చెప్పు నీతిబోధలును, శాస్త్రములయందు విధింపఁబడియుండు మార్గమును తనయనుభవమునకు సరి పోఁగా, పెద్దల వాక్కులును, శాస్త్రములయందు ప్రతిపా దింపఁబడియుండు విధినిషేధములును తనమేలుకొఱకు ఆప్తు లగువారిచే నిరూపింపఁబడిన హితవాక్యములనియు, కావున ననుసరింపఁదగినవనియు, నెఱిఁగి వానియందాస్తిక్యబుద్ధిగలిగి మంచిచెడుగులను కొంతమట్టుకు వివేచనము చేయుటకు శక్తి గలవాఁడగు. మఱియు శాస్త్రములయం దింకను నేమి నిరూ పింపఁబడియున్నదో చూచి యనుసరింపవలయునని యిచ్ఛ గలుగ నారీతిని నయితము జ్ఞానము నభివృద్ధి చేసికొనును.

ఇట్లు వస్తుశోధన చేయను చేయను, లోకానుభవము హెచ్చును హెచ్చును, జ్ఞానము హెచ్చును. జ్ఞానము హెచ్చగాఁ దానుచేయు కార్యములయం దుత్తరవాదిత్వము సయితము హెచ్చును గదా? అజ్ఞానియగు నొకండు చేయు తప్పులు, సామాన్యముగ క్షమార్హములు గదా! అయినను ప్రకృతి ధర్మములకు విరోధముగ నటించినచో దానిఫలము ననుభవింపక తీరదు. ఇవ్విధంబున నానావిధానుభవములను పొంది జీవుఁడు కొంతమట్టుకు యుక్తాయుక్తవివేకము గలవాఁడగు. ఈ జ్ఞానము పరిపూర్ణముగ గలుగువఱకును లోకమున నొక్కొక్క వస్తువునందుండు సారమును తెలిసికొని, దానియం దాత్మస్వరూప మెట్లు పరిణమించుచున్నదో, ఏరీతి నభివ్యక్తమగుచున్నదో ఒక్కొక్క వస్తువును సృష్టియం దేయే ప్రయోజనమును చూపుచున్నదో, ఆ మూలముగ నెఱుంగవలయును. అంతనే జీవుఁడు సంసారమునందు ప్రవేశించుట సార్థకమగు. ఇది యంతయు నొక్కజన్మమునఁ గాఁజాలదు. అనేక జన్మముల నెత్తవలయును. ఆ జన్మములైనను, ఒక్కదేశమున నెత్తినఁ బ్రయోజనము లేదనుట స్పష్టము. ఎల్లపుడు, హిందూదేశమువంటి యుష్ణదేశముననే పుట్టి, పెఱిగి గిట్టుచుండిన వానికి, భూతలమంతయు నెల్లపుడు మంచుగడ్డలతోఁ గప్పఁబడి, సముద్రములు, నదులు, చెఱువుల యందలి యుదకములు సయితము ఘనీభవించి పాషాణము

వలెనుండు దేశమునందలి కష్టసుఖముల నెట్లెఱుంగును ? చెట్లు చేమలన్న నెట్టివో చూచుటకైన నసాధ్యముగ నుండు ధ్రువ సమీప సీమలయందుండు జనుల కాహార మెట్టిదిగ నుండ గలుగునో, తెలియుట కవకాశముండదు గదా! "ఆత్మ వత్సర్వభూతాని" యను న్యాయము నవలంబింపవలెనన్న నందఱి కష్టసుఖముల నెఱింగినంగాని, వారల కష్టములయందు వారితో పరితపించి, వారల సుఖములందు వారలతో సంత సించి, లోకసుఖమే తనసుఖమనియును లోకదుఃఖమే తన దుఃఖమనియు నెంచు నుదారభావ మేలాగు గలుగును. అట్లు లేక యొక్క దేశమున, నొక్కవిధమైన కుటుంబముననె పుట్టుచు గిట్టుచుండిన వానికి తన కలిమియే లోకకలిమియు, తన కల్పదుఃఖము ప్రాప్తించినను లోకమునకంతయు ప్రళ యమువచ్చినట్లు భావించుటయు సాధారణము. కావున నిపుడు హిందూదేశమునఁ బుట్టియుండు నొకజీవుఁడు, పూర్వ మెన్ని దేశములలో జన్మించియుండ వలయునో, రాఁబోవు కాలమున నింక నెన్ని దేశములలో జన్మించవలసియుండునో, మన మెఱుంగఁజాలము. ప్రస్తుత మన్యదేశములందు జన్మించి యుండు జీవులు పూర్వజన్మములయం దీదేశమున నెందఱు జన్మించియుండిరో యికముందు రాఁబోవుజన్మముల నెందఱు జన్మించెదరో యెఱుఁగము గదా! ఇవ్విషయ మించుకయైన నాలోచించినయెడల జాతివైషమ్యము లెక్కడ నుండును.

జీవున కనేకజన్మము లున్నవనియును ఈ జన్మమంతమైన పిదప మఱియు నెక్కడనో ఒక స్థలమున పుట్టక తీరదనియును దృఢముగ నమ్ము హిందువులు సయిత మితరదేశీయుల ద్వేషించుట యెంత యవజ్ఞత! అన్యదేశములని యిపు డెన్నఁబడు దేశములన్నియు నెద్దియో యొక జన్మమున మన దేశముగానుండి యుండవచ్చును. ఇపుడస్మదీయులనబడు జీవులు మఱియొక జన్మమున నే దేశమున నెవరి గర్భమున నుత్పత్తి యగుదురో, మఱియు మనకత్యంత ప్రియులై యుండి మృతినొందిన జీవు లెక్కడెక్కడ జన్మించియున్నవారలో మన మెఱుంగము గదా! ఈ జన్మముననో మఱియొక జన్మముననో భూతకాలముననో భావికాలముననో, అన్ని దేశములయందు, నానావిధ జాతులయందు, వివిధమతములయందు జన్మించి పలువిధములగు ననుభవముల పొందిన జీవుఁడు సర్వసముఁడై సర్వభూతహితుఁడై, అన్ని దేశములవారిని తనసోదరులవలెఁ జూచుచు, అన్ని దేశములవారి క్షేమముకొఱకు పాటుపడుచు సకల జనాదరణీయుఁడై లోకమున మెలంగును. అట్టి వారికి స్వీయులెవరు? పరులెవరు?

అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసామ్ ।
ఉదారచరితానాం తు వసుదైవ కుటుంబకమ్ ॥

"ఇతఁడు నావాడు. మఱియొకడు నావాఁడు కాడు, అను భావ మల్పబుద్ధుల యందుండును గాని యుదారగుణ సంపన్ను

లగు మహానుభావులకుఁ బ్రపంచమంతయు స్వకుటుంబమే" అను మనువాక్యము అనేక జన్మసిసిద్ధులైయుండు మహనీయుల నుద్దేశించి చెప్పఁబడినది గదా! అన్ని జాతులవారియందును అన్ని దేశములవారియందును, వివిధమతస్థులయందును సోదరభావము చూపుట యెల్లరకు కర్తవ్యము. ఇట్లన్నిమతముల వారలయందైకమత్యము, మైత్రి, సోదరభావము, నొనగూర్చి జగత్తంతయు నొక్క కుటుంబముగ భావింపఁజాలు సౌహార్దమును లోకమున స్థాపించుటకొరకే గదా మహాత్ములు, పరమదయాసముద్రులు నగు మహర్షులు దివ్యజ్ఞానసమాజమును స్థాపించియున్నారు. ఈ సమాజమున ప్రతివత్సరాంతమున, సంవత్సర మహోత్సవము జరుగునపుడు నానాదేశస్థులు నానామతస్థులు నొక్కచోట చేరి, కలసిమెలసి యన్నదమ్ములవలె వర్తించుచు, తమతమ మతాచారముల ననుష్ఠించుచు, తక్కువారల మతాచారముల సోదరభావముతో గౌరవించుచు అందఱు నామహాత్ముల కుటుంబములోని వారలేయని యన్యోన్యమైత్రి గలిగి సంచరించుట కన్నుల పండువగా నుండును. లోకముననుండు తారతమ్యముల నంగీకరించుచు నానావిధవర్ణములుగల రత్నములన్నియు నొక్కచోటచేరి యన్యోన్య వైషమ్యము లేక యొక్క కిరీటము నలంకరించి ప్రకాశింపఁజేయురీతిని అన్ని జాతులవారును ఒక్కచోట చేరి పరస్పర భేదములుండియు

(ఉండక తీరదు గదా!) నందఱొక్క కుటుంబమువలె నడచుకొనుట సాధ్యమని లోకమున కంతటికి దృష్టాంతభూతముగ నున్నది. దీనింజూచి యెల్లవారలును, పరస్పర వైషమ్యముల విడనాడి పరమమైత్రి నభ్యసించి కృతార్థులగుదురు గాత!

జీవుని యావలి పరిపాకము గుఱించి పై యధ్యాయమున వ్రాసెదము.

# ఏడవ అధ్యాయము

## జీవునియాత్ర

జీవుఁడాదినుండి విషయసుఖములే సుఖములని యెంచి వాని నన్వేషించుచుండునని ముందు చెప్పఁబడెను. ఒక్కొక్క యింద్రియము దాని దాని విషయమును వెదకుచుండును. కన్నులు సుందరములగు వస్తువులం జూడఁ గోరుచుండును. జిహ్వ రుచ్యములగు పదార్థములం దినగోరుచుండును. ఇట్లొక్కొక్క యింద్రియము, విషయములనుగూర్చి బహిర్గత మగుచుండు. మనస్సన్నన్నో యింద్రియముల మార్గమున నెఱింగిన విషయములవలని సుఖదుఃఖములను స్మరించుచుండును. ఈ స్మరణవలన మనస్సింద్రియములతోఁ జేరి వాని ననుసరించియే వర్తించుచుండును. విషయములు గోచరములైనను కాకపోయినను మనస్సు పూర్వానుభవ స్మరణముచే వాని చింతించుచుండును. మృగములకును మానవులకు నిదియె ముఖ్యమగు తారతమ్యము. మృగములయందు పూర్వానుభవముల స్మరించుశక్తి లేమింజేసి విషయసందర్శనమున నేవిషయములు ప్రత్యక్షముగ లేని సమయమున విషయచింత పుట్టదు. మానవులందు మనస్సు కొంచెము వికసించి యుండుటచేత విషయస్పర్శలేని సమయమునను విషయచింత పొడమును.

విషయధ్యానముచేత విషయవాంఛలు వృద్ధియగు. విషయములఁగూర్చి యన్వేషించుచుఁ బోవుచో నా విషయప్రాప్తి కడ్డము వచ్చువారలయందు ద్వేషము పుట్టును. ఇటుల విషయముల చింతనచేయుటవలన కామము, కామము నీడేర్చుకొను ప్రయత్నములో క్రోధమును, ఈ కామక్రోధముననుండి యనేక యనర్థములును జీవునకుఁ గలిగి కడపట జీవునికి పురుషార్థభంగ మగును.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥
(గీత. 2-అ)

అను గీతావాక్య మీయనర్థమునుండి జీవుఁడు తప్పించుకొనుటకొఱకు హెచ్చరిక చేయుచున్నది.

అట్లైనచో భగవంతుని సృష్టియందిట్టి యనర్థకారణ మెట్లు ప్రవేశించెనని సందియము పుట్టుట సహజము. ఆదియందు జీవుఁడు శిశుప్రాయుఁడు. జీవునియందు తమోగుణము ప్రధానముగ నుండును. అనఁగా నాఁకలిగొన్నపుడు అన్నము వెదకుట, విషయములు ప్రత్యక్షములగునపుడు మాత్రము ఇంద్రియము లుద్రేకమునొందుట తప్ప నితర వ్యాపారము

లేక నిద్రాలస్యప్రమాదములే ముఖ్యలక్షణములుగ గలిగి యుండును. అట్టి మానవుఁడు కేవల జడప్రాయుఁడు. అయినను లావణ్యములగు పదార్థములను లోకమునఁ జూడగా వానింగోరి వానికొఱకు బహుప్రయత్నములు చేయును. కొంచెము సుఖము సంతోషము ప్రాప్తించగా మఱల నా సుఖము ననుభవించవలయునను కోరిక పుట్టును. దానిం గూర్చి ప్రయత్నపడును. కోరినపదార్థమును గాని సుఖమును గాని పొందుట కెవ్వరైన నడ్డమువచ్చినచో వారియందు ద్వేషము నవలంబించి పోరాడియైన దాఁగోరిన కోరిక నీడేర్చు కొనుటకు శ్రమపడును. ఇవ్విధంబున జీవుఁడు తన స్వభావమగు తమోగుణము నతిక్రమించి రజోగుణ మభివృద్ధి చేసికొనును. కామక్రోధములు క్రమక్రమమున వృద్ధియగు. ఆ స్థితియందుండు జీవునకు అవి వృద్ధియగుటయే ధర్మము. కామక్రోధములు వృద్ధియగుటవలననే తమోగుణము నశించును. ఏలనన కామము వృద్ధికాఁగా కాఁగా కోరికల నీడేర్చుకొనుటకు ఎంతయేని ప్రయత్నము కావలయును. ఆ కోరిక లీడేరుటవలన మఱియు నవి వృద్ధియగుచునే యుండును. ఆజ్యము వహ్నిలో వ్రేల్చుటచే నగ్ని చల్లార్చుట సాధ్యము కానట్లు విషయముల ననుభవించుటచే కామము చల్లారదు, దినదినమునకు వృద్ధియగుచునె యుండును. కోరిన పదార్థముల సంపాదించుకొనుట కెంతయో ప్రయత్నము చేయును. ఇట్లు తమో

గుణ స్వభావము మాఱిపోయి రజోగుణమువలనఁబుట్టు విశేష ప్రవృత్తివ్యాయామము హెచ్చగును. ఇదియును కాలక్రమమున తరించవలసినదే. కామమువలన తామసమును జయించినటులనే, విషయసుఖానుభవముతో గలుగు భంగములవలననే రజోగుణము సత్వగుణముగ మాఱును. ఎటులననఁగా, బహుప్రయత్నములచే ప్రాప్తించిన విషయము నత్యంతముగ ప్రేమించును. ఆ వస్తువును పొంది యనుభవించుటకంటె సుఖమితరము లేదని భ్రాంతిచెందును. సదా విషయసంయోగమునే గోరుచుండును. సామాన్యములగు ప్రయత్నములు చేయుటయేగాక తమకోరికల నీడేర్చుకొనుట కితరుల సహాయమును కోరును. మఱియు దేవతా ఉపాసనలను జేయును. ఎన్నివిధములనైనఁ దాఁగోరు విషయముల సంపాదించి యనుభవించుటకుఁ బ్రయత్నము చేయును. చేయుప్రయత్నమున కనుగుణముగ స్వశక్తిచేఁ గాని యన్యసహాయమువలన గాని దేవతానుగ్రహమువలనఁగాని కోరినకోర్కి లీడేర్చుకొనును. కోరిన విషయము లనుభవసాధ్యము లగును. అయినను "యద్దృశ్యం తన్నశ్యం" అను న్యాయము ననుసరించి యావస్తువులు కాలక్రమమున నశింపగా మనంబున నపారమగు దుఃఖము పుట్టును. అంత నాసుఖము దుఃఖమూలమని జీవుఁడెఱుంగు. ఇంచుక వైరాగ్యము పుట్టును. ఐన నావైరాగ్యమల్పకాలికముగానే యుండును. కొదవగాదు. నిజమైన

వైరాగ్యమున కిది యంకురమగు. ఒక్కొక్కటియు ననంత సుఖదాయకములని యెంచియుండిన బంధుమిత్రులు, దారాపుత్రులు గృహకనకవస్తువాహనములు క్రమక్రమముగ శాశ్వతములుగావని యనుభవముచే నెఱుంగు. ఒక్కొక్కటి వియోగము గలుగఁగా, నది దుఃఖకారణమని యెఱుంగును.

“యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ॥” అను గీతావాక్య మనుభవసిద్ధమగును. వియోగసమయమున దుఃఖము తీవ్రముగానుండును. అయినను వియోగదుఃఖము పునస్సంయోగముచే నత్యంతమగునుగదా! “భార్యా దుఃఖం పునర్భార్యా” అను లోకోక్తికి నర్థమింతియ గదా! అటులనే ధనముఁ గోలుపోయిన వానికి మఱల ధనమొనగూడినచో నాదుఃఖము శాంతమగును. ఇటులనే కాలానుసారముగ నితర విషయముల సంయోగము కలుగఁగా నంకురించుచుండిన వైరాగ్యము అంతరించును. ఈ వైరాగ్యమునే వేదాంతగ్రంథములయందు “ఔత్సుక్యమాత్ర వైరాగ్యము” అని నిరూపింపఁ బడియున్నది. ఇదియె పురాణ ప్రసూతి శ్మశాన వైరాగ్యములని లోకమున నెఱుఁగఁబడినవి. శీఘ్రకాలములో మాసిపోవును. మఱియును పూర్వమువలెనే విషయలోలుఁడగును. ఐనను తిరిగి తిరిగి ప్రియవియోగము గలుగను కలుగను దినదినమునకును జన్మజన్మమునకును వైరాగ్యము పురాణవైరాగ్యమువలె క్షణభంగురముగాక తీవ్ర

వైరాగ్యముగ పరిణమించును. బాహ్యములగు వస్తువులపై వాంఛలు తగ్గును. కీర్తియు, యజమాన్యాధికారములు ప్రాబల్యములోనగు వానిని సుఖదాయకములుగ నెంచి వానిం గూర్చి భగీరథప్రయత్నము చేసి సాధించి యనుభవించి కట్టకడపట నవియును దుఃఖమిశ్రములే యని యనుభవముచేఁ దెలిసికొనును. ఇవ్విధంబున ననేకానుభవములచే నీ లోకమున గలుగు సుఖములన్నియు నంతవంతములని యెఱింగి నిజమగు తీవ్రవైరాగ్యము నభివృద్ధి చేసికొనును. అదిమొదలు లోకమున వర్తించుచుండినను, ఇతరులవలె లౌకికకార్యముల నెరవేర్చుచుండినను ఐహికవిషయములయందు తీవ్రమగు వాంఛయుండదు. ఇంకను కొంతకాలమువఱకు పూర్వకర్మవాసనాబలముచే విషయములయందు మనస్సుపోవుచుండినను యథార్థముగ వానియం దేవగింపు దినదినమునకు వృద్ధియగుచు వానియందలి దోషములను నయితము నెఱుంగుచు క్రమక్రమమున వానికి విముఖుఁడగును.

"విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥
(గీ. 2-అ)

నిరాహారుఁడైన జీవునకు అనగా నింద్రియములను మనస్సును విషయములయందు విచ్చలవిడిగ సంచరించనీయక నిరో

ధించు నభ్యాసము చేసిన జీవునకు విషయములు తమంతట తామే వెనుకకు తిరిగిపోవును. అనగా నట్టిజీవునకు విషయ సుఖములు ప్రత్యక్షమైనను వానియందసహ్యాము సహజముగఁ బుట్టుచుండును. అయినను వానియందు అభిరుచిమాత్రము సూక్ష్మముగ నిలిచియే యుండును. అదియు వదలిపోవుటకు నాత్మసాక్షాత్కారము కావలయును. ఆపైననే యారవం తయు నశించును. ఐహికసుఖములయందు వాంఛలు క్రమ క్రమముగఁ దగ్గుచుండగా వానికంటె దీర్ఘకాలికములును సామాన్యముగ దుఃఖమిశ్రములుగానివియునగు స్వర్గసుఖ ములయందు వాంఛ లధికమగుచుండును. ఐహికసుఖములు మిక్కిలి కొద్దికాలముండునవి యనియును, వాని పరిసమాప్తి యెల్లపుడు దుఃఖకారణమనియును దెలిసికొని యాముష్మిక సుఖము అనఁగా స్వర్గలోక సుఖమును గోరి తత్సాధనము లగు కర్మములయం దెక్కుడు శ్రద్ధగలవాఁడగును. కేవల స్థూలశరీరసంబంధమగు తాత్కాలిక సుఖమును త్యజించి యంతకంటె శాశ్వతమగు పరలోక సుఖమును సంపాదించ వలెనను నిచ్ఛనుబట్టి యుపవాసంబులు, వ్రతములు, దేవ పూజలు, ఉపాసనలు చేసి వానిఫలమగు స్వర్గలోక సుఖ మును బొందును. ఐన నాసుఖములు సయితము అంతముగల వియే యగుటంబట్టి స్వర్గలోకానుభవకాలము తుదముట్టఁగా "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" యను శ్రుతిప్రమాణము

ననుసరించి యాలోకమునుండి మరలి భూలోకమున పునర్జన్మ మునకు విధిలేకయే రావలసియుండును.

"కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః ।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ॥

*    *    *    *

లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హితాన్ ।
అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ॥" గీతా.

నానావిధములగు కామములచే నపహరింపఁబడిన జ్ఞానముగల వారలై కొందరు పూర్వకర్మానుసారమగు స్వభావముచే బద్ధులై యనేకవిషయముల ననుష్ఠించుచు అన్యదేవతల నుపాసింతురు. ఆ కర్మములనుండి, నాచే విధింపఁబడిన ఫలములను బొందుదురు. అయిన నట్టియల్పబుద్ధులకు గలుగు ఫలములు అంతము గలవియే గదా!

ఆ సమయమున జీవునకు దుఃఖముఁ బ్రాప్తించుచునే యున్నది. ఇట్టి యనుభవము జీవున కనేకజన్మముల గలుగఁగా జీవున కైహికవిషయములయందువలె నాముష్మిక సుఖములందును తీవ్రవైరాగ్య మభివృద్ధియగును. అవుడింత కంటె నుత్తమమగు స్థితి యుండునాయని జిజ్ఞాస గలుగును. జీవుఁ డీశ్వరాంశమై యుండుటవలన నెల్లవు డానందస్వరూపుఁడు, ఆనందమునే గోరుచుండువాఁడు గదా! ఆ యానంద

మును మొదట నిహాలోకమునను, ఆవల పరలోకములను గలుగునని యాలోకములందలి సుఖమంతయు కట్టకడపట దుఃఖమూలమను జ్ఞానము దృఢముగఁబుట్టిన పిదప మార్పు చెందని సుఖము, వికారములకు లోఁబడియుండు ప్రకృతితోఁ దాదాత్మ్యము చెందునంతదనుక పొంద సాధ్యముకాదనియు, అవికారుఁడును అక్షరుఁడునగు పరమాత్మతోఁ దాదాత్మ్యము చెందుటవలననే పొంద సాధ్యమనియును శ్రుతిస్మృత్యాది ప్రమాణగ్రంథములనుండియు, అనుభవజ్ఞులగు పెద్దలనుండియు నెఱింగి యాభగవత్స్వరూపమును దెలిసికొనుటకు బహు ప్రయత్నము చేయును. అది మొదలు గ్రంథవిచారములవలనను, అనుభవజ్ఞులగు పెద్దలనాశ్రయించి వారివలన జ్ఞానోపదేశమును బొందుటచేతను, ఆత్మస్వరూప ధ్యానముచేతను, క్రమక్రమమున నాత్మసాక్షాత్కారము పొందుటకును, ఆత్మస్వరూపుఁడగుటకును యత్నించును. ఈ యభ్యాసము బహుకాలము చేయఁగా, భగవదనుగ్రహముచేతను, భగవత్స్వరూపులగు మహాత్ముల కృపచేతను స్వరూపజ్ఞానము ప్రత్యక్షముగ గలవాఁడై యాత్మస్వరూపుఁడేయగు. అట్టి మహానుభావునియం దపారమగు భక్తియు భూతదయయును పరిపూర్ణముగఁ బరిణమించి యుండును. అట్టి మహానీయుండు లోకమున నెట్లు నడుచుకొనునో కొంచెము సంగ్రహముగ నిచ్చట వివరింతము.

ఆదినుండి సంసారసముద్రమున మునింగియుండి, యందలి కష్టసుఖముల నెఱింగియుండుటచే పామరులగువారి యందపారమగు కనికరము గలిగియుండును. తాను లౌకిక కార్యములయందు ఫలాపేక్షతో వర్తించుచుండిన కాలమున కామక్రోధములకు లోఁబడి యెట్లు వర్తించుచుండెనో, ఆలాగుననే యితరులు సయితముందురుగదా యని యట్టివారల ద్వేషించక వారలయందలి లోపములను లెక్కింపక క్షమించు స్వభావము గలవాఁడై యుండును. తాను జ్ఞానము సంపాదించుటయందెంత కష్టపడెనో యెంత ఆసక్తితో పరులసహాయము నపేక్షించెనో, అటులనే యితరులును పరసహాయమును గోరుచుందురు గదా యని పరోపకార తత్పరుఁడై యుండును. తా నజ్ఞానదశయందుండిన కాలమున నితరుల నుండి యెంత మేలు పొందియుండెనో అవియన్నియు లెక్కకు దెచ్చుకొన్నట్లు, ఇపుడు తనసర్వస్వము, శరీరమును, జ్ఞానమును, ద్రవ్యమును పరోపకారార్థము వినియోగించి పూర్వపు ఋణములను చెల్లించుచుండును. తనకు దేహబలము గలిగియుండిన, తనకంటె బలహీనులగువారలకు సహాయము చేయును. తనకు విద్యాజ్ఞానము లెక్కుడుగనుండిన తనకంటె తగ్గుస్థితిలో నుండువారలకు విద్యాదానము చేసి జ్ఞానము నభివృద్ధిచేయును. తనద్రవ్యమును భోగములు పరోపకారార్థము భగవంతునిచేఁ దనకొసంగఁబడెనని పరోపకారార్థము

వినియోగించును. ఇట్లు తా నజ్ఞానదశయందుండిన కాలమున చేసిన ఋణములఁ గ్రమక్రమమున దీర్చుకొనును. ఎపుడును స్వప్రయోజనముకొఱకు కొంచమైనను ఇతరులనుండి గ్రహించ సమ్మతింపక యెపుడును తానిచ్చుటయే వ్రతముగా గలిగియుండును. అనగా ప్రవృత్తిమార్గమును పూర్ణముగ వదలి నివృత్తినే యనుష్ఠించుచుండును. భగవంతునిచే లోకమున నియమింపఁబడిన భృత్యునిభంగి భావించుచు, ఈశ్వరాజ్ఞా ప్రవర్తనముకంటె నితరమగు నుద్దేశములేక ప్రవర్తించుచుండును. ఏకార్యము చేయఁబూనినను దాని నీశ్వరాజ్ఞగా భావించి యీశ్వరుని కైంకర్యముగ నెంచి యీశ్వరుఁడకార్యమును జేసిన నెంత బాగుగఁచేయునో ఆరీతిని శ్రద్ధతోఁ జక్కగచేయును. ఆ కార్యమువలన తన కేమి లాభము గలుగునో, ఏమి నష్టమువచ్చునో యనుయోచన యించుకయైన నుండదు. చేయబూనుకొనిన కార్యము న్యాయమా, సత్యమా, పరోపకారకారణమా, ఈశ్వరేచ్ఛానుసారమైనదా యని మాత్రము యోచించునుగాని, తనకుగాని, తన బంధుమిత్రులకుగాని లాభకరమా కష్టకారణమా యని యెంతమాత్రము యోచింపఁడు. లోకోపకారకరమై న్యాయమైనచో తన కెంత కష్టమైనను వెనుదీయక నెఱవేర్చును. సమస్తకార్యములు చేయువాడీశ్వరుఁడేయని తా నాయీశ్వరుని యంగముగ భావించి ప్రతిఫల మించుకయైన నపేక్షిం

పక సర్వకార్యములఁ జక్కఁగ నెరవేర్చును. ఇట్లు చేయఁబడు కార్యములు బంధమూలములు గావు.

"యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ॥"

ఇట్లు లోకమున కర్మములు చేయుచుండియు, బద్ధుఁడు గాక యుండుటయే యోగమని భగవంతుఁడు గీతాశాస్త్రమున నిర్వచించియున్నాఁడు.

"యోగః కర్మసు కౌశలమ్"

అన్ని కార్యములను పామరులవలె చేయుచుండియు, నంతరంగమున నిస్సంగుఁడై యహంకార మమకారములు విడిచిపెట్టి సర్వభూతహితుఁడై వర్తించును. అట్టి మహానుభావునియందు కర్మభక్తిజ్ఞానములు మూఁడును పరిపూర్ణముగ ప్రకాశించి యుండును. అట్టివారికి లోకసుఖమే తమసుఖము, లోకదుఃఖమే తమదుఃఖము. అట్టి మహనీయుల నుద్దేశించియే భగవంతుఁడు గీతాశాస్త్రమున భక్తలక్షణముల నిరూపించుచో నిట్లు విస్తరించియున్నారు—

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మే భక్తస్స మే ప్రియః ॥

సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః ॥
తుల్యనిందా స్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేన చిత్ ।
అనికేతస్స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః ॥”

# ఎనిమిదవ అధ్యాయము

## పునర్జన్మ మీమాంస

### జన్మము

జన్మమనగా, ఈశ్వరాంశమగు జీవుఁడు స్థూలమగు భూలోకశరీరమును ధరించుట. జీవుఁడు ఈశ్వరుని అంశము. కాన ఈశ్వరునివలె నిత్యము, అక్షరము, అనగా నాశము లేనిది. పుట్టుక, చావు అనునవి జీవున కన్వయించవు.

"అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో ।.
న హన్యతే హన్యమానే శరీరే ॥" (గీతా.)

పుట్టుకలేనివాడు, నిత్యుడు, శాశ్వతుఁడు, పురాణుఁడు. శరీరము నశించునుగాని జీవునకు నాశము లేదు—అని తాత్పర్యము. కాబట్టి పుట్టునది, పెరుగునది, క్షీణించునది, వచ్చునది జీవుఁడు ధరించు శరీరముకాని జీవుఁడు కాదు.

### ఈశ్వరాంశమన నేమి ?

అంశమనగా భాగము. అయితే భాగమన భావము స్పష్టముకాదు. ఈశ్వరునిలో ఒక తునక అనుట సరికాదు. ఈశ్వరశక్తి యంతయును బీజరూపముగ తనయందు గల తత్త్వము అని తెలిసికొనవలెను. ఒకటి రెండు ఉదాహరణ

ములతో స్పష్టమగును. వృక్షముయొక్క అంశము బీజము అని చెప్పవచ్చును. వృక్షమునుండి యొకతునకను నరికి వేరు చేయబడినదికాదు. వృక్షమునం దుండుశక్తి (జీవము) అంతయును బీజమునందు అణగి దాగియున్నది. బీజమును భూమియందునాటగా, కాలక్రమమున మోగు అయి, మొలక అయి, చిన్న చెట్టై, గొప్పవృక్షమయి, పూర్వపు వృక్షమువలె పూర్ణముగ పత్రశాఖపుష్పములతో ప్రకాశించును గదా! ఇవి అన్నియు బీజమున దాగియుండి, కాలక్రమమున వ్యక్తమగునట్లు ఈశ్వరశక్తి అంతయు జీవునందు లోపల బీజరూపముగ దాగియుండి, ప్రపంచమున శరీరము ధరించుటద్వారా ప్రపంచానుభవములను పొంది క్రమక్రమముగ జీవునందు ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు వికాసము నొంది జీవుఁడు పరిపూర్ణత్వమును పొందును. అట్టి స్థితియందు జీవుఁడు ఈశ్వరసారూప్యమును లేక సాధర్మ్యమును పొందినవాఁడగు, అనగా ఈశ్వరునివలె సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాది లక్షణోపేతుఁడగును. ఇంకొక దృష్టాంతము. గొప్పజ్యోతినుండి వెలువడు నిప్పురవయందు, మహాజ్యోతియందలి శక్తియంతయు అణుమాత్రముగ నున్నది. తగిన అవకాశము కలుగగా ఈరవ సైతము గొప్పజ్యోతికి కారణము కావచ్చును గదా! అట్టి మహాజ్యోతి ఈశ్వరుఁడు. ఆ జ్యోతినుండి వెలువడు విస్ఫులింగము వంటివాడు జీవుఁడు. ఈ విస్ఫులింగము మహాజ్యోతివలె

అగుటయే పరిపూర్ణత్వము నొందుట. అట్లు పరిపూర్ణుఁడగు టయే పరమపురుషార్థము. అదియే యథార్థమగు మోక్షము. అంతటి పదవిని పొందుటకే జీవుఁడు లోకమున శరీరధారి యగుట.

ఆదియందు ఈశ్వరాంశము (జీవకళ) ప్రకృతియందు ప్రవేశించి, ఈశ్వరాజ్ఞాప్రవర్తకులగు దేవతల సహాయమున వరుసగ ఆకాశ, వాయు, అగ్ని, అప్పు పృథ్వీతత్త్వముల సంబంధములగు ఒక్కొక్క అణువును మాత్రము ఆయాలోక ములయందు ఉపాధిగ గైకొని స్థూలప్రపంచమున అనగా భూలోకమున మృత్పాషాణాదులయందు కొంతకాలముండి ఆవల ఓషధివనస్పతులు అనగా చెట్లుచేమలు, మ్రాకులు, తీగలు లోనగు వానియందును, అనంతరము క్రిమకీట పశు పక్షి మృగాదుల యందును బహువిధానుభవములనుపొంది, తద్ద్వారా చైతన్యము వికసించగా అన్నింటికంటె శ్రేష్ఠమును జ్ఞానసాధనమును అగు మానవశరీరమును ప్రవేశించగల స్థితికి వచ్చును. కావుననే బాహ్యప్రపంచమున "ఉత్తమం మానుషం జన్మ", అనగా అన్నిజన్మములలో మానవ జన్మము ఉత్తమమని చెప్పదగియున్నది. మృత్పాషాణాదుల యందు ఆత్మశక్తి ఉన్నదని మాత్రము చెప్పవచ్చునుగాని సామాన్యముగ కనబడుట లేదు. చెట్లుచేమలయందు రస రూపముగ ప్రాణశక్తి కనబడుటయేగాక, పుట్టుటయు, పెరు

గుటయు, చచ్చుటయు అను ప్రాణిధర్మములు కానవచ్చు చున్నయవి. పశుపక్ష్యాదులయందు ప్రాణశక్తి విశేషముగ ఉచ్ఛ్వాస నిశ్వాసరూపముగ సైతము అగపడుటయేగాక ఇంద్రియవ్యాపారములు సైతము కానవచ్చుచున్నవి. అంత ర్యామియగు ఆత్మ బాహ్యప్రపంచజ్ఞానసాధనములగు ఇంద్రి యములను నిర్మించుకొని, వానిద్వారా ప్రపంచానుభవము లను పొందగలిగియుండును. అప్పటి అనుభవముల ద్వారా రాగద్వేషములు వృద్ధియయి, కట్టకడపట అల్పముగ మన శ్శక్తి అంకురించును. అనంతరము సకాలమున ఆ మనశ్శక్తి స్ఫుటముకాగా, పశుశరీరముకంటె ఉత్తమమగు మనుష్య తనువును దాల్చుటకు యోగ్యత గలుగగా, జీవునకు నిత్య మగు విజ్ఞానమయకోశము ఏర్పడును. ఈ కోశము మహర్లోక సంబంధమగు ప్రకృతితో చేయబడినది—మహర్లోక శరీరము. ఇదియును, దీనికంటెను సూక్ష్మమగు ఆనందమయకోశమును జీవునకు ముక్తిపర్యంతము నిత్యముగనుండు ఉపాధులు. భూలోక, భువర్లోక, సువర్లోక సంబంధములగు స్థూలసూక్ష్మ శరీరములు, అనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశములు, జన్మజన్మమునకు మారునవి.

### మరణమన నేమి ?

మరణమనగా భూలోకసంబంధమగు స్థూలశరీరమున కును, జీవునకును, సంబంధము వదలిపోవుటయే. ఆ సంబంధము

వదలగా, స్థూలశరీరము నశించును. స్థూలశరీరమెంత శీఘ్రముగ జీర్ణమగునో అంతత్వరితముగ ప్రాణమయకోశము సైతము జీర్ణమగును. కాబట్టియే స్థూలదేహమును భూస్థాపనము చేయుటకంటె దహనముచేయుట శ్రేష్ఠము. స్థూలదేహము శీఘ్రముగ భస్మమై నశించుతరికి, ప్రాణమయకోశము సైతము దానివెంట జీర్ణించును. అంతట, జీవుడు భువర్లోక సువర్లోక శరీరములతో ప్రేతలోకమున కొంతకాలము, పితృలోకమున కొంతకాల ముండును. ఈ ప్రేతలోక పితృలోకములు జీవునకు మరణాంతర భువర్లోకానుభవములు. ఆ కాలమున జీవుని కామక్రోధాదివృత్తులవలని ఫలమగు సుఖదుఃఖముల ననుభవించి దానిసారమగు జ్ఞానమును నిత్యమగు విజ్ఞానమయకోశమున స్థిరపరచుకొనును. అంతట ఆ భువర్లోక శరీరము సైతము నశించును. అంతట సువర్లోకశరీరముతో కొంతకాలము ఆలోకశరీరమగు మనోమయకోశముతోనుండి, జీవితకాలమున చేసిన సంకల్పవికల్పములు, యోచనలు, శాస్త్రవ్యాసంగములు, లోనగు మానసిక కర్మముల ఫలరూపమగు సుఖము ననుభవించి దానిసారమగు జ్ఞానమును విజ్ఞానమయకోశమున వాసనలుగను, మనశ్శక్తిగను స్థిరపరచుకొనగా, ఆ సువర్లోకశరీరమగు మనోమయకోశము సైతము జీర్ణించును. అంతట జీవుడు, విజ్ఞానమయకోశముతో మహర్లోకము నంటును. అది యథా

ర్థముగ జీవునకు స్వస్థానము. స్వగృహమని చెప్పదగినది.

భూర్భువస్సువర్లోకములు, జీవునకు వచ్చుచు పోవు చుండు లోకములు. ఈ లోకముల శరీరములు జన్మజన్మము నను మారునవి. జీవునకు ముక్తిపర్యంతము నిత్యమగు ఉపాధి విజ్ఞానమయకోశము లేక మహర్లోకశరీరము. ఈ విజ్ఞాన మయకోశము తిర్యగ్జంతువులందు లేదు. ఇది యేర్పడుటయే మనుష్యత్వము.

మానవజన్మ వచ్చినపిదపనే జీవునకు కొంత స్వతంత్రము గలిగి, తానుచేయు కార్యాకార్యములకు తానే జవాబుదారి యగును. ముందు వెనుక, నిన్న నేడు రేపు, అను జ్ఞానమును, తాను ఇతరులు అను జ్ఞానమును, కలవాడై చేయుపనులకును, వాని ఫలరూప అనుభవములకును కార్య కారణసంబంధమును తెలిసికొనశక్తిగలవాఁడగును. అయి నను జ్ఞానము అత్యల్పము. స్వప్రయత్నముననే పరిపూర్ణ జ్ఞానమును కాలక్రమమున సాధించవలెను. అట్లు సాధించు టయే పైనచెప్పిన పరమపురుషార్థము.

### మార్గము

అట్టి మహోన్నత పదవిని పొందుటకు బ్రహ్మాండ మున పొంధదగిన జ్ఞానమంతయును జీవునకు కలుగవలెను గదా! ఆ జ్ఞానమును పొందుటకు వలయుసాధనములు జీవుడు

ధరించు శరీరములు. బ్రహ్మాండమున భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం అనులోకములున్నవి. ఈ అన్ని లోకములజ్ఞానము జీవునకు కలుగవలెననిన ఈ అన్నిలోక సంబంధములగు శరీరములు జీవునకుండవలెను. ఒక్కొక్క లోకానుభవమునకు ఆయాలోక శరీరము జీవునకావశ్యకము. లేనిచో ఆలోకము జీవునకు లేనట్లే. భూలోకమున సైతము, శరీరముండియు, కన్నులు లేనట్లైతే ఎఱుపు, తెలుపు, పసుపు మొదలగు వర్ణములజ్ఞానమామనుష్యునకు కలుగజాలదు. వానికి వర్ణవిశేషములు లేనట్లే. అట్లే ఒక్కొక్క ఇంద్రియము లేనియెడల ఒక్కొక్క విధమగు జ్ఞానము లేనట్లే. శరీరమే లేకపోయిన, ఆలోకము ఆజీవునకు లేనట్లే. ప్రయాణీకునకు భూమిమీద బండి, గుఱ్ఱములోనగు సాధనములును, నీటిపై నావయు, ఆకసమున విమానమును ఎట్లు ఆవశ్యకములో అట్లే ఒక్కొక్క లోకమున ఆయాలోక సంబంధమగు శరీరము జీవునికి ఆవశ్యకము. అందు భూలోకానుభవసాధనమగు శరీరము సామాన్యముగ స్థూలశరీరమనబడును. ఇది మాతాపితరుల వలన గలుగు శరీరము. తక్కిన లోకములయందు సాధనములగు ఉపాధులు జీవుని కర్మానుసారముగ దేవతల సహాయమువలన గలుగు శరీరములు. ఇవి అన్నియుచేరి సామాన్యముగ సూక్ష్మశరీరమని యెఱుంగబడును. జీవుఁడు భూలోకమున మాతృగర్భజనిత

మగు స్థూలశరీరమును ధరించుటయే జన్మమనబడును. ఆ శరీరము ఉండుకాలము ఒక జీవితకాలము.

పునర్జన్మమన నేమి ?

పైన సూచింపబడిన రీతిని పరిపూర్ణత్వమును పొందుటకు ఒక జీవితకాలము చాలదనుట స్పష్టము. ఈశ్వరునివలె సర్వజ్ఞత్వమును పొందవలెననిన అనేకపర్యాయములు భూమియందు, పెక్కుస్థలములలో, వివిధసందర్భములలో జన్మించి నానావిధములగు అనుభవములను తిరిగి తిరిగి పొంది వాని వలన పొందదగు జ్ఞానమును స్వానుభవముచే సాధించవలెను. ఈ భూమండలమున ఎద్దియో ఒకమూల జన్మించి పూర్ణాయుర్దాయకాలము జీవించినను, ఆ కాలమంతయు వృథాపుచ్చక బహుజాగరూకుడై యత్నించినను భూలోక జ్ఞానమంతయును పొందుటకు ఒక జీవితకాలము చాలదు అని చెప్పనక్కరలేదు. బాలుఁడు దినదినము పాఠశాలకు పోయి ఆయాదినము ఉపాధ్యాయుఁ డుపదేశించు పాఠమును చేతనైనంతవరకు గ్రహించి, యింటికి వచ్చి, దానిని వల్లించి, మననము చేసి, పూర్ణముగ గ్రహించినదిపోను మిగిలినదానిని, మఱియు క్రొత్తజ్ఞానమును ఉపాధ్యాయుని వలన నేర్చికొనుటకు తిరిగి మరుదినము పాఠశాలకు పోవుచు, పునఃపునః పాఠశాలలో పొందదగిన జ్ఞానము పూర్తిగ పొందువరకు అనుదినము బడికిపోవును గదా. అట్లే బ్రహ్మాండము ఒక

గొప్ప పాఠశాల. జీవుఁడు విద్యార్థి. ఒక్కొక్క జీవితకాలము పాఠశాలలో విద్య నభ్యసించు ఒక్కొక్క దివ (దివము= పగలు) ప్రాయము. మరణానంతరకాలము, బాలుడు బడి నుండి యింటికిపోయి, పాఠములను వల్లించి మననము చేసి, నిద్రించి, జ్ఞానమును జీర్ణించుకొనురాత్రి వంటిది. జీవుని పూర్ణ యాత్రయన ఇట్టి జన్మములు అనేకములెత్తుట. ఈశ్వరాంశ మగు జీవుడు పరిపూర్ణ పరిణామమును పొందుటకై మరలి మరలి భూలోకమున స్థూలశరీరధారియగుటయే పునర్జన్మము. అనేక జన్మానంతరమునగాని జీవుడు పరిపూర్ణుడు కాజాలడు.

" అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్."

(భగవద్గీతా)

### లోకమున తారతమ్యములకు పూర్వజన్మమే కారణము

ఇదియునుగాక, లోకమున మానవులందు కానవచ్చు పెక్కుతారతమ్యములకు కారణముండవలెను గదా! కొందరు బాల్యమునుండియే అత్యద్భుత శక్తిమంతులుగను, బుద్ధి మంతులుగను, నీతిమంతులుగను, ఉండుట చూచుచున్నాము. మఱికొందరు బాల్యమునుండియే, కఠినహృదయులు, మంద మతులు, ఎన్నినీతులు గరపినను దౌర్జన్యమునందే ఆసక్తు లును, కొందరు ఆరోగ్యవంతులుగను, సురూపులుగను ఉండ మరికొందరు సదా రోగులుగను, కురూపులుగను ఉన్నారు.

అట్లే కొందరు, అతిబుద్ధిశాలులును, నిపుణులును, పూనిక గలవారును అయ్యును, వారు పూను కార్యములన్నియు, నిష్ఫలములై విఫలమనోరథులగుటయును, ఇతరులు అల్ప బుద్ధులును, తక్కువ పూనిక గలవారును అయ్యును, వారు మన్ను చేతబట్టినను బంగారు అగునట్లు, సఫలమనోరథులగు టయు లోకమున గలదు. కొందరు ఆగర్భశ్రీమంతులుగను, సత్కులమునందును పుట్టుచుండగా, ఇతరులు అన్నివిషయ ముల తద్విపరీతముగ పుట్టుచున్నారు. ఇట్టి తారతమ్యములు అందరకు ప్రత్యక్షము. దయాస్వరూపుడును, సర్వజ్ఞుడును, ధర్మస్వరూపుడును, సర్వశక్తుడును అగు భగవంతుని ప్రపంచ మున ఇట్టి తారతమ్యములు ఉండుటకు సరియయిన కారణ ముండవలెను. భగవంతుని ఇచ్ఛ అని చెప్పుట చాలదు. వారికి ఎల్లరు సములు. వారియందు పక్షపాతమనునది లేశ మైనను ఉండదు. అందరికిని ఇష్టానుసారము సుఖముల నను గ్రహించుటకు వలయు శక్తి లేకపోలేదు. జ్ఞానము లేక పోలేదు. కాన ఇన్నింటికిని కారణము జీవులయందుండవలెను గాని ఈశ్వరునియందు కానరాదు. జీవులు వారివారి స్వభావ సందర్భములను తమతోడనె పూర్వమునుండి కొనివచ్చి యుండవలెను. పూర్వ జన్మములయందు స్వబుద్ధితో ఎట్టి స్వభావమును బలపరచుకొని యుండిరో, ఎట్టి జ్ఞానము నభ్య సించి, ఎట్టి శాస్త్రములను వ్యాసంగము చేసియుండిరో, ఇత

రులకు సహాయము చేసి సౌఖ్యమును కలిగించియుండిరో లేక ఇతరులను పీడించి దుఃఖమును కలిగించియుండిరో, వేయేల పూర్వజన్మములయందు, వారువారొనర్చిన వివిధకర్మాను సారముగ ఈతారతమ్యములు కలిగియుండవలెనేగాని వేరు విధముగ కారణము చెప్పజాలము. ఈ పూర్వజన్మసిద్ధాంతము మిక్కిలి యుక్తియుక్తముగ నున్నదనుటకు ఏలాటి సంశయము లేదు.

### వంశపరంపరయే కారణముకాదు

మానవులందు హెచ్చుతక్కువలు, గుణాగుణములు వంశపరంపరగా వచ్చి యుండవచ్చునని కొందరు వాదింతురు గాని, ఒక తల్లి బిడ్డలయందు అమడబిడ్డలయందు సైతము విశేషతారతమ్యములు కనబడుచున్నవి. విశేషబుద్ధిశాలులగు తండ్రులకు కేవలమూఢులగు తనయులును, సామాన్యులును అనామధేయులునగు తల్లిదండ్రుల గర్భవాసమున మహాధీమంతులును పుట్టుటను చూడగా ఇవి వంశపరంపరాప్రాప్తములను న్యాయము సమముగ నున్నట్లు కానరాదు. అదియునుగాక ఇక్కాలపు భౌతికశాస్త్రప్రముఖుల యభిప్రాయములనుబట్టి కేవలస్థూలశరీరలక్షణములు మాత్రమే వంశపరంపరగా కనబడునుగాని, మానసికలక్షణములు, ధర్మములు, తండ్రినుండి సంతతికి రావు అని స్పష్టముగ నిశ్చయింపబడియున్నది.

కొందరు బాలధీమంతులు

అదియునుగాక అతిబాల్యమునందు కొందరు బిడ్డలు చూపుశక్తియు, జ్ఞానమును, పూర్వజన్మములయందు జీవుడు చేసిన కృషినిబట్టి రాకపోయినచో ఎక్కడనుండి వచ్చియుండును? అయిదుసంవత్సరములు మొదలు, పదిసంవత్సరముల వయసుకు లోపల కొందరు బాలురు, బాలికలును, గూఢమును, విశేషశాస్త్రపరిశ్రమ సాధ్యమును అగు వేదాంతవిషయములను, గొప్పగొప్ప పండితసభలయందు అత్యాశ్చర్యముగ అందరి సంశయములు తీరునట్లు ఉపన్యసించుటయు, ప్రశ్నలకు ఉత్తరములు చెప్పుటయు, ఇక్కాలమున అచ్చటచ్చట చూచుచున్నాము, వినుచున్నాము. ఇట్టి బాలధీరులు అన్నిజాతులయందును అన్ని ఖండములయందును ఖ్యాతిచెంది యున్నారు. దీనికి కారణము పూర్వసంస్కారమనియే చెప్పవలెనుగాదా!

పూర్వకర్మము, వంశపరంపరయు కలిసియున్నవి

అన్నింటిని యోచించిచూడ, జీవుడు తనపూర్వకర్మానుసారముగ అనేక జన్మములనుంచి, తనమానసిక శక్తి ధర్మములను కొనిరాగా, వాని కనుగుణమగు శరీరమును, తల్లితండ్రులు ఇవ్వగలుగుదురు. జీవుని పరిణామమును, పూర్వకర్మఋణానుబంధములును చేరి ప్రస్తుతపు జన్మమున అనుకూల ప్రతికూల సందర్భములు, పూర్వవాసనలు, మన

శ్శక్తి మొదలగునవి యన్నియు నిర్ధారించబడును. ఇవ్విధమున కర్మఫల ప్రదాదతలగు దేవతలకార్యమును చూడదగు.

కొన్ని మతములవారు జీవునకు పూర్వాపరజన్మము లున్నవని నమ్మక, ఒక్కజన్మమున మానవుడు చేయు పుణ్య పాపములను బట్టి జీవునకు శాశ్వత స్వర్గముగాని శాశ్వత నరకముగాని విధింపబడునని నమ్ముచున్నారు. ఇది మిక్కిలి యుక్తికి విరుద్ధముగ నున్నదనుటకు సందియము లేదు.

కొన్ని ఆక్షేపణ సమాధానములు

జీవునకు పూర్వజన్మములుండినచో అవియేల ఇపుడు మనకు జ్ఞాపకము లేదు అనియొక ఆక్షేపణ పలుమారు చేయ బడుచున్నది.

జ్ఞాపకము లేనిదంతయు జరుగనేలేదని వాదించుట ఉచితము కాదు. ఈ జన్మమున జరిగినవిషయము లెన్నియో మనకు ఇపుడు జ్ఞాపకములేదు. అందువలన అవి జరుగనే లేదని చెప్పజాలము. ఎవరికిగాని తాను మాతృగర్భమునుండి జనించినది జ్ఞాపకము కలదా? మరి యుక్తవయస్సు వచ్చిన పిమ్మట జరిగిన విషయము లెన్నియో జ్ఞాపకములేదు. అందువలన అవి జరుగలేదనము గదా? బహుకాలము మరచియుండిన విషయములు కొన్ని ఒకానొక సమయమున స్మరణకువచ్చుట కలదు. అట్టి విషయములు జీవుని అంతః కరణమున లోపలయెచ్చటనో నిలిచియుండియే యుండ

వలయును గదా! జాగ్రదవస్థయందు స్ఫురణలేకపోయి యుండవచ్చును. ఎద్దియో ఒక కారణముచే ఆ స్మృతి కలిగి యుండును.

అట్లే పూర్వజన్మములలో జరిగిన విషయములు జ్ఞాపకము లేనిమాత్రమున జన్మములే లేవని చెప్ప సాధ్యము కాదు. ఏయే జన్మములయందు ఏయే అనుభవములు కలిగినదియు వేర్వేరుగ జ్ఞాపకము లేకపోయినను వానిసారమగు జ్ఞానము వాసనారూపముగ లోపల నిలిచియే యున్నది.

అయినను జ్ఞాపకము లేకపోవుటకు సరియయిన కారణములున్నవి. జ్ఞాపకము లేదనగా మనకు జాగ్రదవస్థయందు జ్ఞాపకము లేదన్నమాట. అనగా స్థూలశరీరమునందు వర్తించు కాలములో జ్ఞాపకము లేదనుట. స్థూలశరీరసంబంధమగు మెదడున ఆ జ్ఞానము లేదు. నిత్యుడగు జీవునకు తెలిసియే యున్నది. అనగా ఆ జ్ఞానమంతయును విజ్ఞానమయకోశమున నిలిచియున్నది.

ఇప్పటి స్థూలశరీరము (అన్నమయకోశము), ప్రాణమయ, మనోమయ, కోశములును గతజన్మములయందు ఉండియుండలేదు. ఇవి జన్మజన్మమునకును మారునవియని ముందే వ్రాయబడినది. ఆ కారణమున, పూర్వజన్మముల అనుభవముల స్మరణ, ఈ స్థూలశరీరమున స్పష్టముగ నుండుటకు కారణములేదు. జన్మజన్మమునకు నిత్యముగ నుండునది

విజ్ఞానమయకోశము కాన ఆ కోశమున అన్ని జన్మముల జ్ఞాన ముండును.

అయినను, ఎవరుగాని అంతర్ముఖులై, ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము నభ్యసించి స్థూలసూక్ష్మశరీరముల సహజచాంచల్యమును నిగ్రహించి నిశ్చలులైనచో అట్టివారలకు విజ్ఞానమయకోశముననుండు పూర్వజ్ఞానము జాగ్రదవస్థయందు సైతము స్ఫురించును. అట్టివారు జాతస్మరులని వేదాంతగ్రంథములయందు చెప్పబడుదురు. అట్టివారిపుడును లోకమున కొద్దిమంది జీవించియున్నారు. మనము సైతము పైన సూచించిన ప్రకారము యత్నముచేసినచో, సకాలమున మనకును అట్టిపూర్వజన్మస్మరణము సాధ్యమనుటకు సందేహము లేదు. ఎంతకాలమైతె మన మనస్సు బాహ్యవిషయములయందు రమించుచుండునో అంతవరకు లోపలి జ్ఞానము మనస్సున స్ఫురించుటకు అవకాశముండదు. ఇంద్రియ మనస్సులను స్వవ్యాపారములనుండి విరమింపచేసి, నిశ్చలముగ చేసినచో, నిశ్శబ్దమగు ప్రదేశమున అతిసూక్ష్మమగు వీణానాదము స్పష్టముగ వినవచ్చునట్లు అంతరంగముననుండు పూర్వజ్ఞానము బహిస్స్మరణకు వచ్చును. అట్లు ఇంద్రియ మనస్సులను నిశ్చలముగ చేయుటయే యోగ మనబడును.

"తాం యోగమితి మన్యంతే స్థిరాం ఇంద్రియధారణాం."

(కఠోపనిషత్)

ప్రస్తుతము అట్టి జ్ఞానము మనకు లేదని విచారపడుటకు కారణము లేదు. అట్టి జ్ఞానము ఎపుడు జీవునకు సహాయకారి యగునో అప్పుడు ఆ జ్ఞానము తప్పక వచ్చును. మన బోట్లు, అజ్ఞానదశయందు ఎంత దుష్కర్మ చేసియుంటిమో అట్టి కర్మ ఫలముగ ఎంత కష్టము దుఃఖము మనము అనుభవింపవలసి యున్నదో, అట్టిజ్ఞానము మనకు కలిగినయెడల, ఇంకను అజ్ఞానదశయందుండువారలకు అది అతి భీతిని కలుగజేసి నిర్విణ్ణులనుగ జేయును. ఋణవిముక్తికై ప్రకృత ప్రయత్నమునకు ఉత్సాహములేక నిస్పృహ చెందించును. కావుననే పరమదయానిధియు, జగదేకపితయు నగు పరమేశ్వరుని యేర్పాటున, ఈ స్మృతిలేక యుండుటయే మనపుణ్యమని తలచవలయును. భగవత్సంకల్పజ్ఞానము హెచ్చి, కర్మగతి రహస్యములు తెలిసి జాగ్రతతో కర్మఋణములను తీర్చుకొనుటకును క్రొత్తదుష్కర్మఋణములను చేయకయుండుటకును వలయు జ్ఞానము, స్థైర్యము జీవునకు కలుగగా, జీవునకు పూర్వజన్మజ్ఞానము తప్పక కలుగును. అట్టివారికి ఆ జ్ఞానము సహకారి. ఆ జ్ఞానసహాయమున, మానసిక, వాచిక, కాయిక కర్మములతో పూర్వసంచిత కర్మమును నశింపచేసికొనుచు, క్రొత్త ఋణములను చేయక, తన జీవితమును లోకహితముకొరకే వినియోగించుచు చేయు కార్యమంతయును ఈశ్వరకైంకర్యముగ నివేదించును. అట్టి జ్ఞానము సమస్తకర్మమును

భస్మము చేయును. అని భగవద్గీతాశాస్త్రమున శ్రీకృష్ణులు బోధించియున్నారు—

"జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥"

ఈ జ్ఞానమువలని ప్రయోజనములు

ఈ సిద్ధాంతము చాల యుక్తియుక్తముగ నున్నది. లోకమున కానవచ్చు అనేక తారతమ్యములకు స్పష్టముగ కారణము తెలుపుచున్నది. శ్రద్ధాళువులకు చాల ఉత్సాహకరముగ నున్నది.

ఏలయన, ఈ సిద్ధాంతము యథార్థముగ నెఱింగి దృఢముగ నమ్మినచో అట్టి నమ్మకము, ఆ జ్ఞానము ఎంతయు ప్రయోజనకారి యనుటకు సందియము లేదు. ఇప్పటి జన్మమున ఒక్కొక్కని స్వభావము వాని పూర్వకర్మసంస్కారమువలన సిద్ధించినది. గతజన్మములయందు ఎవ్విధమగు సంకల్పములు, తలంపులు, కోరికలు, ఇప్పటి స్వభావ సందర్భములకు కారణములయ్యెనో తెలిసికొని ఇప్పటి మనోవాక్కాయకర్మములను, ఎట్లు సవరించుకొనినచో ఈ జన్మమునను, రాబోవు జన్మములను, వాంఛితఫలములను పొందగలుగుదుమో తెలిసికొనుట యెంతయు లాభకరము.

పూర్వజన్మములయందు ఏయేవిధములగు సంకల్పములు, కోరికలు, తలంపులు కలిగియుంటిమో ఆయావిధము

లగు సంకల్పములు కోరికలు జీవుని నిత్య ఉపాధియగు విజ్ఞానమయకోశమునను, స్థూలసూక్ష్మ దేహబీజములగు సూక్ష్మభూతములయందును అంకురములుగ నిల్చియుండి, ఆవలిజన్మములయందు, ఆ గుణములు వాసనారూపముగ కనబడును. అనగా బాల్యమునుండి ఆయాసంకల్పములు, కోరికలు నైజముగ కనబడుచుండును. అదియే స్వభావము.

"స్వభావస్తు ప్రవర్తతే" అను గీతావాక్యమున కిదియ అర్థము. అయితే ఇప్పుడు మనస్వభావమున, పూర్వ వాసనారూపముగ దుర్గుణములు చెడ్డకోరికలు కనబడిన యెడల ఆ కోరికలకును ఆ గుణములకును లోబడక వానికి విరుద్ధములగు సద్గుణములను, మంచి కోరికలను పలుమారు మనస్సున ధ్యానించుచు, కొంచెము శ్రమ యెక్కువ అయినను లెక్కించక, వాని నభ్యసించుచురాగా దుష్టగుణములు, చెడ్డకోరికలు క్రమక్రమముగ తగ్గి మంచిగుణములు మంచి కోరికలు కాలక్రమమున వృద్ధియగును. ఇట్లు మానసికమగు పూర్వదుష్కర్మమును ధ్యానముచేత నశింపచేసికొనవచ్చును. ఇవుడు చేయు ప్రయత్నమువలన రాబోవు జన్మములయందు మునుపటి అశుభవాసనలు తగ్గిపోయి మంచిగుణములు కోరికలు ఆదినుండియే వాసనారూపముగ కనబడును,

"పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ॥"

అనగా పూర్వజన్మములయందలి అభ్యాసములచే ఆ మార్గ

మననే నడచుట స్వభావమగును అని శ్రీ గీతాశాస్త్రము బోధించుచున్నది.

ఇట్లే ఒకజన్మమున ఎద్దియేని యొకశాస్త్రమును ఎక్కువ వ్యాసంగముచేసి అభ్యసించినచో ఆవలి జన్మముల యందు బాల్యమునుండియే ఆ శాస్త్రమునందు యెక్కువ రుచి గలిగియుండుటయేగాక, ఆ శాస్త్రమును సులభముగ గ్రహించుశక్తి గలవాడగును. కొందరు ఒక శాస్త్రమున అతి నిపుణులుగ నుండియు, మఱియొక శాస్త్రమున కొంచెమైనను చొరవలేకయుండుట అనుభవసిద్ధము. ఏ శాస్త్రమున నెక్కువ ప్రయత్నము పూర్వము చేయబడియుండెనో వాని యందు ఎక్కువ సామర్థ్యము రుచియు పుట్టుకతోనే వచ్చును. ఇపుడు అట్లే ఇతర శాస్త్రములయందు ఎక్కువ ప్రయత్నము చేసినచో, ఆదియందు ఇంచుక కష్టముగ నుండినను క్రమ క్రమముగ దానియందును అభిరుచియు శ్రద్ధయు ఎక్కువ అయి, కాలక్రమమున దానియందు ప్రవీణుఁడగును. తుదకు సర్వజ్ఞుఁడగుటకును ఇదియే యుపాయము.

ఈలాగుననే కాయిక కర్మములయందును ఏయేకార్య ములను ఎక్కువపూనికతో చేయుచుండునో ఆయాకార్య ములయందు ఆవలి జన్మములలో ఎక్కువ రుచియు సామ ర్థ్యము కలవాడగును. మంచి అలవాట్లుగలిగి, కాలనియ మము తప్పక పనులు చేయుచుండువాడు, ఆవలిజన్మమున

అట్లే బాల్యమునుండి వేళతప్పక పనిచేయు స్వభావము గల వాడగును. అట్లుకాక, సోమరిగనుండినచో మరల సోమరి తనముతోనే పుట్టును. ఇంతియుకాదు. మనము చేయు కార్యములవలన ఇతర జీవులకు సుఖమో దుఃఖమో ప్రాప్తించును. అట్లు ఇతరులకు సుఖమును కలుగజేసిన జీవునకు పర జన్మములయందు సుఖసాధనములగు మంచి సందర్భములు ప్రాప్తించును. ఇతరులకు విద్యాదానము, జ్ఞానోపదేశము చేసినచో, మరుజన్మమున కోరిన విద్యలను నేర్చికొనుటకు తగిన సహాయసంపత్తితో పుట్టును. అట్లుకాక విద్యావంతు డయ్యును ఆశించివచ్చు విద్యార్థులకు విద్యచెప్పక, లోభిగ నుండినచో, మరుజన్మమున అననుకూల సందర్భములతో పుట్టును. తాను విద్యనేర్చుకొనవలెనను కోరిక తీవ్రముగ నుండియు, విద్యను పొందుటకు అనుకూలము లేక కష్టపడవలసి వచ్చును. అథవా, తాను విద్యావంతుఁడై, యితరులకు బోధించవలెనను ఆశ ఎక్కువగ ఉండియు, అట్లు ఇతరులకు బోధించుటకు పెక్కువిధములగు ఆటంకములు గలిగి విఫల మనోరథుడగును. ఇతరులకు సుఖము కలుగజేసినచో పర జన్మములలో సుఖప్రాప్తి, ఇతరులకు దుఃఖము కలుగజేసిన వారికి దుఃఖప్రాప్తియు కర్మఫలములు.

ఇవ్విధమున కర్మగతిని తెలిసికొని ప్రతిజన్మమునను జాగరూకులై ప్రవర్తించినచో జీవుడు జన్మజన్మమునను జ్ఞాన

మునందును, శక్తియందును అభివృద్ధియయి కాలానుసారముగ పరిపూర్ణుడగును. తాను పూర్ణుడగుటవలన సోదరప్రాయులగు సర్వమానవులను పరిపూర్ణులగునట్లు చేయుటకు సహాయము చేయగలవాడగు.

అయినను ఒక హెచ్చరిక. జన్మము లనేకములున్నవి గదా! అవసరపడ నక్కరలేదు. ఈ జన్మమున కాకపోయినచో మరి యెన్నో జన్మములు గలవు. తొందరపడ నవసరములేదని సోమరితనము నెత్తిన వేసికొనరాదు. అట్లు చేయువారికి, జన్మజన్మమునకును ఆ సోమరిస్వభావము బలమగుచు, కార్యోత్సాహము క్షీణించుచుండును. కష్టముల పాలయ్యును పౌరుషముతో యత్నించుట కష్టముగతోచి, కష్టములలో, దుఃఖములలో, మునిగి తేలుచుండవలసి వచ్చును. పురుషార్థభంగమే అట్టి సోమరితనము ఫలము. సోదరులారా! అట్లు తమోగుణమునకు లోబడక, ఉత్సాహపూరితులై తాము కృతార్థులయి, ఇతరులను కృతార్థులను చేయుటకు అతిజాగరూకులై యత్నింతురుగాక. మహాత్ములగువారల ధర్మమిదియే యని శాస్త్రములన్నియు ఘోషించుచున్నవి.

"శాంతా మహాంతో నివసంతి సంతో
వసంతవల్లోకహితం చరంతః ।

తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనాః
అహేతునాఽన్యానపి తారయంతః ॥ ”
(వివేకచూడామణి)

శాంతులును, మహాత్ములును, ఎపుడును వసంతునివలె లోక హితము కొరకే చరించుచు జీవించియుండువారు తాము అజ్ఞానసముద్రమును దాటియు, కారణములేకయే ఇతరులను దాటించుటకు కంకణము కట్టుకొనియున్నవారు.

తాము విరామములేని యత్నముతో సంసారసముద్రమునుదాటి అనగా అజ్ఞానమును, దానివలనపుట్టు స్వార్థపరత్వమును, కామక్రోధములను, జయించి సర్వభూతహితమే పరమాదర్శముగ గ్రహించి లోకహితముకొఱకే తమ సర్వశక్తులను వినియోగించు మహానుభావులే భారతపుత్రరత్నములని ప్రసిద్ధిగాంచిన పూర్వులు. వారలనే ఆదర్శముగ నుంచుకొని వారలు పోయినమార్గమున నావారు, పరులు అను అల్పభావములను వదలి భగవంతుని బిడ్డలగు సకలజీవుల పురోవృద్ధికై పాటుపడుదురు గాక.

# తొమ్మిదవ అధ్యాయము

## కర్మము

### (దైవము : పౌరుషము)

కర్మమనగా పనియని యర్థము. మరియును చేసినపని వలని ఫలమనియు మరియొక యర్థము. నాకర్మము ననుభవించుచున్నానని చెప్పునపుడు పూర్వము చేసిన పనివలని ఫలము ననుభవించుచున్నానని యర్థము. కొన్ని సమయములలో పూర్వము చేసినపని జ్ఞాపకము లేకపోవుటచేత, దుఃఖరూపమగు ఫలము అనుభవమునకు వచ్చినపుడు కారణము లేకయే అనుభవము వచ్చినదనిన్నీ, అట్టి కర్మానుభవము అన, మనకు తెలియనట్టియు, మనశక్తికి మించినట్టియు, 'విధికృతము' 'బ్రహ్మవ్రాసిన వ్రాలు', 'తలవ్రాత' అని బహువిధముల విలపింతురు. ఇట్లు విధియనునది, మనము పూర్వముచేసి మరచియుండు కర్మఫలమే యని తెలిసికొనవలెను. దీనినే దైవమనియును చెప్పుట కలదు.

"పూర్వజన్మకృతం కర్మ తద్దైవమితి కథ్యతే" అనగా పూర్వజన్మములయందు చేసిన కర్మమే దైవమనియు, విధియనియు చెప్పఁబడుచున్నది. దీని స్వరూపమును పూర్ణముగ

తెలిసికొని, పూర్వపు కర్మానుభవమునకు జీవుడెంతవరకు బద్ధుడో, ప్రస్తుత ప్రయత్నమువలన అట్టి అనుభవము నెంత వరకు మార్చుకొనగలుగుదుమో, రాబోవు కాలమున మనము చేయగల కార్యము విషయమై మనకెంతమాత్రము స్వాతంత్ర్య ముండునదియు ఎఱింగినచో, మానవుడు తన పురోవృద్ధివిషయములో జాగరూకుడై తెలివితో నడచుకొనుటకు స్వతంత్రుడగును. అట్లుకాక అట్టి జ్ఞానము లేనివాడు "కర్మప్రకారము జరుగును, నేనేమి చేయగలను?" అని అవివేకపు మనోవృత్తితో చేతులు ముడుచుకొని కూర్చుండి దుఃఖించుచు ప్రవాహములో కొట్టుకొనిపోవు గడ్డిపోచవలె దుర్గతిం జెందును. కర్మఫల స్వరూపజ్ఞానముగలవాడు ప్రవాహమునంబడిన ధీరునివలె, శక్తికొలది ప్రవాహమునకు ఎదురీది యీది త్రోవయందు ప్రాప్తమగు ప్రతిచెట్టును, పుట్టను, ఆధారము చేసికొని గట్టెక్కును. ప్రవాహములో పడిన మాత్రమున, "నదీనాం సాగరో గతిః" అని నిరుత్సాహుడై యూరకుండడు. ఈ జ్ఞానము మానవులకు మిక్కిలి అవసరము. విశేష ప్రయోజనకారి.

కర్మము, మూడువిధములుగ నుండును. (1) మానసికము. అనఁగా మనస్సుతో చేయునది. (2) ఇంద్రియసంబంధమైనది. అనగా జ్ఞానేంద్రియములద్వారా చేయబడునదియును (వినుట, చూచుట, రుచించుట, వాసనచూచుట, స్పృశిం

చుట), వానిమూలమున పుట్టు కామములు లేక కోరికలు, క్రోధములు, రాగద్వేషములు, మొదలగునవి. (3) కాయికము. శరీరముతో, అనగా కర్మేంద్రియములతో చేయబడునది. (మాటలాడుట, చేతులతో నితరులకిచ్చుట, ఇతరుల నుండి గ్రహించుట, పాదములతో నడచుట మొదలగునవి.)

ఈ మూడువిధముల కర్మములును ఒకటితోనొకటి సంబంధించి యుండును. అదియునుగాక ఒక్కొక్కటి దాని ముందు వెనుకటివృత్తులతో సంబంధించియుండును. అనగా ఇపుడు మనస్సులో నొక ఆలోచనపుట్టినచో, ఆ యాలోచన తత్పూర్వపు ఆలోచనలతో సంబంధించియుండును. పూర్వపు కోపసంకల్పములు ఇపుడు కోపమును పుట్టించుచుండును. ఇప్పటి కోపతలంపులు రాబోవు కోపమునకు కారణము లగుచుండును. అట్లే ఒక విషయమును పలుమారు పూర్వము కోరియుండినచో దానియందు ఎక్కువకోరిక ఇపుడు పుట్టును. ముందు రాబోవుకాలమున అదేకోరిక మరల మరల తనంతటనే పుట్టుచుండును. అట్లే కాయికకర్మముల విషయమును యోచించదగును.

ఇంకొక సంబంధము సైతము యోచించవలెను. మానసిక, ఇంద్రియ, కాయిక కర్మములు పరస్పరసంబంధములు గలవి. మొదట పూర్వసుఖానుభవముచే నొక కోరిక పుట్టును. అది యింద్రియవ్యాపారమువలన పుట్టినది. కోరిక

లోపల పుట్టగా, దాని నీడేర్చుకొనుటకు ఉపాయమును ఆలోచించుటకు ప్రారంభింతుము. అది మానసిక కర్మ. దీనినే వేదాంతగ్రంథములయందు "క్రతుః" అని చెప్పుదురు.

"స యథాకామో భవతి తత్క్రతుర్భవతి ।
యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే ॥"

(బృహదారణ్యకము)

ఆలోచనప్రకారము కాయికమగు కార్యము చేయుదుము. కావున మొదట కోరిక, దానివెంట ఆలోచన ఆ పిదప కార్యము. ఈ మూడును పరస్పర కార్యకారణ సంబంధము కలిగియున్నవి గదా!

కొన్ని సమయములలో ముందు పూర్వానుభవస్మరణ—జ్ఞాపకము—పుట్టి, దానినుండి కోరిక పుట్టి, దానినుండి బాహ్యకార్యము జరుగుట కలదు. మొదట మానసికమగు స్మరణ, దానివెంట కోరిక, ఆ పిదప బాహ్యకార్యము. ఎట్లైనను ఈ మూడును ఒకటితో నొకటి సంబంధించియుండును.

కావున కర్మము అన్నపుడు కేవలము కాయికకర్మము మాత్రము కాదు. కొన్ని సమయములయందు కేవలము మానసికము మాత్రముండవచ్చును. పుణ్యకర్మముగాని పాప కర్మముగాని మనస్సున సంకల్పించి, యోచించి బాహ్యా

కార్యము కొనసాగనచో, అది కేవలము మానసికముగనే నిలిచిపోవును. కోరికపుట్టి, యోచించి, కార్యము సాధించినచో, మూడుభాగములు కలిసియున్నవి గదా!

ఇట్లు కర్మములో భూతభవిష్యద్వర్తమానములు ఒకటితోనొకటి సంబంధించి యుండును. మానసిక కాయిక కర్మములును ఒకటితోనొకటి సంబంధించి యుండును. ఈ సంబంధమునకు కార్యకారణసంబంధమని పేరు. కారణము లేనిదే కార్యము (ఫలము) పుట్టదు. ఫలము పుట్టినపుడు దానికి పూర్వము బీజరూపముగ కారణము ఉండియే తీరవలెను. కారణము మనకు తెలియకపోవచ్చును. మరచియుండవచ్చును. జన్మాంతరసంబంధమై యుండుటచే జ్ఞాపకము లేకయుండవచ్చును. కారణములేక ఫలము పుట్టదు. కారణము ఉండినట్లైన, ఇపుడో ముందో ఫలమివ్వక మానదు.

"నా బీజాజ్జాయతే కించి న్నాకృత్వా సుఖ మేధతే।
సుకృతైర్విందతే సౌఖ్యం ప్రాప్య దేహక్షయం నరః ॥"
(శాంతిపర్వము)

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ॥"

అయితే పూర్వకర్మానుభవమును తప్పించుకొనుటకు మార్గమే లేదా? ఒకతూరి అజ్ఞానముచే పాపకర్మ చేసినవానికి దాని ఫలము ఎప్పుడును పాపమును చేయుచునే యుండవలెనా?

ఆ దుఃఖము అనంతముగ అనుభవించుచునే యుండవలెనా? దీని కంతము లేదా? అను నీ విషయములను యోచించవలెను.

జీవుడు ఈశ్వరుని అంశ మగుటచే ఈశ్వరుని స్వాతంత్ర్యములో కొంచెమైనను జీవునకు లేకపోలేదు. జ్ఞానముతో నాస్వాతంత్ర్యము నుపయోగించుటకు తెలిసికొనవలెను. అట్లుపయోగించుటవలన క్రమక్రమముగ పూర్వకర్మను నశింపచేయదగునని శాస్త్రములు ఘంటానాదముగ బోధించుచున్నయవి. యుక్తికిని సమముగ నున్నది.

కర్మసిద్ధాంతము బోధించునది యేమన, ఒకవిధమగు కర్మ చేసినచో దానిఫలము ననుభవింపక తీరదు. అట్లు ఎవ్విధమగు కర్మ చేసిన, ఆ విధమగు కర్మఫలము అనుభవించక తీరదు. అట్లైనచో రెండు పరస్పర విరుద్ధములగు కర్మములు చేసిన వానికి, ఆ రెండువిధములగు ఫలము లనుభవమునకు రాగా ఆ ఫలములు పరస్పర విరోధములుగ నుండుటచేత, ఒకదాని నొకటి నాశము చేయును. అయితే కర్మములు రెండును ఒకటే జాతి కర్మములుగ నుండవలెను. గోవును చంపి చెప్పులు దానముచేయు నట్లుండరాదు. ఇతరులను హింసించి బాధపెట్టి, అబద్ధములాడి ద్రవ్యమార్జించినచో, ఆ కర్మఫలమును నశింపచేయవలెననిన, పరులను సంతోషపెట్టి, వారలకు సహాయము చేసి సత్యము నభ్యసింపవలెను

గాని అట్లు చేయుటకు బదులుగ, దేవాలయములలో పూజలు చేయించి కట్నములు సమర్పించుటవలన పోదు. మఱియు మానసికమగు దుష్కర్మ మానసికమగు ప్రతికర్మచే నశింప చేయవలెను. అసత్యసంకల్పములు సత్యవ్రతమువలనను, క్రూరభావములు దయ, అనుకంప, కనికరమును సంకల్పించి భావించుటవలనను నాశమునొందు. అట్లుకాక అబద్ధము చెప్పిన దోషములు అల్పద్రవ్యదానముచే పోగొట్టుకొన చూచినచో అది ఫలింపదు. అసత్యస్వభావమట్లేయుండును. ద్రవ్యసహాయమువలన ఇతరులకు శరీరసౌఖ్యమును సంతోషమును కలిగించినఫలము శరీరసుఖము, మనస్సంతోషముగనే చూపట్టును. ఇవ్విషయము దీర్ఘముగ యోచించదగిన విషయము.

పూర్వకర్మను ప్రస్తుత ప్రయత్నముతో నశింపచేసికొనవచ్చుననుట ఒకటి రెండు దృష్టాంతములతో తెలిసికొనవచ్చును. ఒకడు తెలిసియో తెలియకయో విషమును పానముచేసె ననుకొనెదము. వెంటనే దానికి విరుపుమందు సేవించినచో ఈ రెండు ఒకటి నొకటి నశింపచేసి, శరీరము స్వస్థము కావచ్చును. విషము పని విషముచేయుట కారంభింపగ, విరుపు పని అదిచేసి మొదటిదానిని బయలుపడకుండునట్లు చేయును. అయితే విషము శరీరమున జీర్ణమై దానిపని పూర్ణముగ ఫలించుటకు ప్రారంభించిన తరువాత

విరువుమందు పనిచేయచాలదు గదా! అట్లే పూర్వకర్మము ఫలరూపముగ అనుభవమునకు వచ్చినతరువాత దాని నాపుటకు సాధ్యముకాదు. దాని ననుభవించియే తీరవలెను. అట్లు ఫలరూపముగ అనుభవమునకు వచ్చినదానినే ప్రారబ్ధ కర్మ అని చెప్పుదురు. ప్ర, ఆరబ్ధము అనగా చక్కగా ప్రారంభమయినది యని అర్థము. ఫలమునకు వచ్చినది. దానిని మార్చుట దుస్తరము. "ప్రారబ్ధం భుంజతో నశ్యేత్." అట్లుకాక, ఫలరూపముగ ప్రారంభించుటకు మునుపే, అనగా కర్మ బీజరూపముగ నున్నపుడే, దానికి ప్రతికర్మము చేసినచో దానిని వేరుతో నశింపచేయవచ్చును. ఆ బీజము కాలిన బీజమువలె మొలక యెత్తజాలదు.

ఇంకొక దృష్టాంతము.

నీళ్లలో పడినవాడు వేరుప్రయత్నము చేయనిచో మునిగిపోవును. దానికి బదులు ఈదుటకు యత్నించుట చేతనో, తెప్పకొయ్య సహాయముచేతనో, మరి యేవిధమైన యత్నము తోడనో మునగక తప్పించుకొనవచ్చును. ఇట్లు చేయు ప్రయత్నమునకే పౌరుషము లేక పురుషప్రయత్నమని పేరు. పూర్వపు కర్మఫలము దైవము. దైవము, పురుష ప్రయత్నమును సమముగ నుండినచో, దైవమును నశింపచేయ వచ్చును. మానవుని ధర్మమేమన, శక్తికొలది పురుషప్రయత్నము చేయుటయే. ఒకవేళ చేయుప్రయత్న మల్పముగనుండి,

దైవబలము బాహుళ్యముగ నుండినచో, ప్రయత్నము నిష్ఫలమై నట్లు కనబడవచ్చునుగాని అపుడు సైతము ఈ అల్ప ప్రయత్నము దానికి దగినఫలము నిచ్చియే తీరును. దైవము పురుషకారముయొక్క బలాబలముల విషయమై శ్రీ మహాభారతమున శాంతిపర్వమున భీష్మాచార్యులు ధర్మరాజునకు బోధించిన విషయమును చదువరులు శ్రద్ధతో చదువ ప్రార్థితులు.

"ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః ।
దైవేన దేయ మితి కాపురుషా వదంతి ॥
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా ।"
(హితోపదేశము)

పుణ్యముగాని పాపముగాని చేసినచో ఫల మనుభవమునకు వచ్చునుగాని, దానిని చేయమని నిర్బంధించు విధి యనునది తనకంటె వేరుగ లేదు. తాను పూర్వము చేసిన కర్మఫల రూపముగ తనకు సద్బుద్ధిగాని దుర్బుద్ధిగాని పుట్టునేగాని దేవుడు బుద్ధి పుట్టించడు. దేవుడు నిష్పక్షపాతి. అందరును వారికి సములే. ఒకరికి మంచిబుద్ధి మరియొకరికి దుర్బుద్ధి పుట్టించరు.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।"
(భ. గీ. 9-29)

చేయుటకు స్వతంత్రుడు జీవుడు. అట్లే దాని ఫలమును మార్చు టకు ధైర్యముతో సకాలములో యత్నించినచో అట్లు మార్చుటకును జీవుఁడే స్వతంత్రుడు. అయితే మొదట దుష్కర్మ చేయుట సులభము. చేసినతరువాత, దాని నెదిరించి యత్నించుట మునుపటికంటె కొంచెము ఎక్కువ కష్టముగ నుండును. అయితే యత్నసాధ్యము.

ముఖ్య ధర్మములు పైన సూచింతిమి. వీని ప్రయోగ ములను యోచించవలెను.

కర్మలు—(౧) మానసికములు, (౨) ఇంద్రియ సంబంధములగు కోరికలు, (౩) కాయిక కార్యములు, అని మూడువిధములని ముందే చెప్పబడినది.

౧. మానసికములు—ఇందొక శాశ్వతధర్మము గలదు. 'యద్భావం తద్భవతి' అనగా ఎవ్విధములగు భావ ములు, సంకల్పములు, యోచనలు మానవుడు అభ్యసించునో, ఎట్టి భావములను సంకల్పములను మనస్సున పలుమారు తలంచుచుండునో వానికి అట్టి భావాదులు స్వభావమగును. పలుమారు ఇతరులకు మేలుచేయు సంకల్పములును, తలంపు లును, తలంచుచుండువానికి మేలుచేయు గుణము నైజస్వభావ మగును. అట్లె ఇతరులను మోసము చేయుటకును, కీడు చేయు టకును పలుమారు యోచించువానికి మోసగుణము, కీడు చేయు గుణము స్వభావ మగును. ఏ గుణములను ఎక్కువ

పూనికతో యోచించునో ఆ గుణములు దృఢముగ వాని మనస్సున నాటుకొనును. అయితే ఏ కారణముచేతగాని అనగా ఒక గ్రంథమును చదువుటచేతగాని, ఒక యుపన్యాసము వినుటచేతగాని, సత్పురుషులతో సాంగత్యము చేయుట వలనగాని, లేక కర్మఫలమగు దుఃఖము ననుభవించుటవలన గాని, పూర్వకర్మఫలరూపమగు స్వభావము చెడ్డదియని మనస్సున నాటగా దానిని మార్చుకొనవలయునని తెంపు పుట్టును. అపుడు ఏ దుర్గుణము తనయందు నాటుకొని యున్నదో దానికి ప్రత్యక్షవిరుద్ధమగు సుగుణమును గురించి పలుమారు ధ్యానించగా ముఖ్యముగ ప్రతిదినము భగవద్ధ్యాన కాలములో ధ్యానించుచు, దినచర్యయం దభ్యసించుటకు పూనికతో యత్నించుచు రాగా క్రమక్రమముగ పూర్వపు దుర్గుణము బలహీనమగును. దానికిబదులు సద్గుణము కొంచెము కొంచెముగ బలపడును. కొంతకాలమునకు సద్గుణము ఎక్కువబలముగలదై దుర్గుణము పూర్ణముగ నశించును. ఇందుకు ముఖ్యముగ కావలసినది పూనికతో నిరంతరముగ చేయు ప్రయత్నమే.

భగవంతునిధ్యానము, మహాపురుషుల ధ్యానము, అనగా అట్టి మహాత్ముల కల్యాణగుణములను ధ్యానించుటయే. అట్టి ధ్యానముచే ఆ గుణములు స్థిరములై పూర్వపు దుర్వాసనలు నశించును. ఇట్లే వాసనాక్షయము చేసికొనుట.

౨. ఇంద్రియ సంబంధములగు కోరికలు—ఏయే విషయములను, ఏ సుఖములను పలుమారు కోరుదుమో, ఆ కోరికలు చెడ్డకోరికలైనచో వానిని వదలించుకొనుటకు యత్నించవలెను. ఇదికాక యేయేకామములకు మానవుడు లోబడుచుండునో, ఆయావిషయములకు జీవుడు బద్ధుడై ఆ విషయములుండు ప్రదేశములలో పుట్టును.

"కామాన్ యః కామయమానః స కామభిర్జాయతే
తత్ర తత్ర ॥" (ముండకోపనిషత్తు 3–౨–౨)

తద్ద్వారా జీవుని పూర్వపుకోరికల ననుసరించి, పరజన్మముల యందు బాహ్యసందర్భములు కుదురును. కోరికలు తప్పుకోరికలుగ నున్నవని తెలిసిపుట్టగా, ఆ కోరికలు మనస్సున స్ఫురించినపుడెల్ల, వానిని మనస్సునుండి తొలగించి, మంచి కోరికలనే కోరుచు రాగా క్రమక్రమముగ పూర్వపుకోరికలు తగ్గుచూ దద్విషయములయందు రుచి తగ్గును. అట్లు అరూపమగు కర్మమును నశింపచేసి, మంచికర్మను శుభవాసనలను బలపరచుకొనవచ్చును.

3. కాయికకార్యములు—చేయు బాహ్యకార్యములు పాపములా పుణ్యములా యని యోచించవలెను. పాపమనగా పరులకు—మానవులకు గాని, యితర జీవులకు గాని—కీడు చేయుటయే. పుణ్యమన పరోపకారము. "పరోపకారః

పుణ్యాయ పాపాయ పరపీడనం” అని సర్వశాస్త్ర సారాంశము. పూర్వపు పరోపకారములు ప్రస్తుత సుఖకారణములు, పూర్వపు పరపీడనము ఇప్పటి దుఃఖమునకు కారణము. కాన దుఃఖములు ప్రాప్తించినపుడు, ఇతరులను, దేవుని దూరక, తన పూర్వపుకర్మఫలమే యని తెలిసికొంచి, దుఃఖానుభవమువలన పూర్వకర్మ ఋణములు తీరును గదా యని సంతసించుటయే మన కర్తవ్యము. ఇట్లెంత దుఃఖము ప్రాప్తించిన, అంత పూర్వఋణ విముక్తియని యెరుంగవలెను. ఇపుడు చేయు కర్మములు, బాగుగ యోచించి, ఏ విధమున గాని యితరులకు ఇంచుకయైనను కష్టముగాని, నష్టముగాని, దుఃఖముగాని, బాధగాని కలుగకయుండ చేయుచుండుట వలన క్రొత్త ఋణములు పుట్టవు. శేషించియుండు పూర్వపు దుష్కర్మ ఫలములను సంతోషముతో అనుభవించుటద్వారా అవి తీరును. ఫలమునకు రాని సంచితకర్మశేషమునుండి విముక్తుడగుటకై, లోకహితమునే యుద్దేశించి, ఈశ్వరార్పణముగ సత్కార్యములం జేయుచు క్రమక్రమముగ తెలిసినవియు, తెలియనివియు అగు కర్మబంధములను తొలగించుకొన గలుగుదుము.

ఇంకొక చిన్న విషయము జ్ఞాపకముంచుకొనవలెను. జ్యోతిషశాస్త్రము ననుసరించి జాతకము వ్రాయుచో, గ్రహములు ఫలముల నిచ్చుననుటయు, గ్రహములు మనచేత

మంచి చెడ్డపనులు చేయించు ననుటయు, మంచి చెడ్డ బుద్ధులను పుట్టించుననుటయు పొరబాటు. జాతకము ప్రకారము గ్రహములు పూర్వపుణ్యపాపముల ఫలమును సూచించును గాని అంతకంటె యెక్కువ చేయజాలవు. "పదవీ పూర్వపుణ్యానాం లిఖ్యతే జన్మపత్రికా" అనియేగదా జాతకమును ప్రారంభించుట ?

ఈ శాశ్వత ధర్మజ్ఞాన సహాయమువలన, ఐహికములు గాని, ఆముష్మికములు అనగా స్వర్గాదిలోక సంబంధములు గాని సుఖములయందు కామములను విడిచి, లోకహితమునే కోరుచు, ఈశ్వరుని కింకరుడుగ లోకమున పనిచేయుచు, భూతసేవయే ఈశ్వరపూజగా భావించి, తన్నుదా మరచి భూతసేవ చేయువాడు, సకలవిధ కర్మబంధములనుండి విముక్తుడై, ఈశ్వరతాదాత్మ్యమును చెందినవాడగును. ఇదియే జీవునకు పరమపురుషార్థము. ఇదియే జన్మసాఫల్యము. ఇట్టి స్థితియే జీవన్ముక్తపదవి. ఇట్టి మహోన్నతపదవికై సర్వులును అతంద్రితులై యత్నింతురుగాక.

# పదియవ అధ్యాయము

## పారమార్థికధర్మము

ఈశ్వరాంశమగు జీవకళ పశుపక్ష్యాది రూపమునుండి పరిణామము చెంది, మానవజన్మమును పొందినదాదిగ, కొంత మట్టుకు స్వాతంత్ర్యము కలిగి, ముందు వెనుకలు యోచించుటకు, కార్యకారణ సంబంధమును తెలిసికొని, కొంత స్వాతంత్ర్యముతో కార్యారంభములు చేయుటకును శక్తిగలవాడగు. కావుననే మానవజన్మ జన్మములన్నింటిలో ఉత్తమజన్మమని ప్రసిద్ధి గలదు. "ఉత్తమం మానుషం జన్మ." ఈ జన్మ వచ్చిన తరువాత సైతము ఆదియందు కేవల అజ్ఞానస్థితియందుండి, పై చెప్పిన స్వాతంత్ర్యమును కొంచెము కొంచెముగ ఉపయోగించి, కార్యములంజేసి, వాని ఫలములను పెక్కుసారులు అనుభవించి అనుభవించి, అట్టి వివిధానుభవములచే మంచి చెడుగు, సుఖసాధనము లివి, దుఃఖకారణము లివి యను జ్ఞానము క్రమేణ అనేకజన్మములలో పొందును.

కావున జన్మసాఫల్యముకొరకు ఎక్కుడు ప్రయత్నము చేయు అవకాశములు మానవునకు కలవు. ఆ అవకాశములను వృథాపుచ్చక ఉపయోగించుకొనుటయు, పూర్వానుభవములవలని జ్ఞానమును వృథాపుచ్చక ఎల్లపుడును జ్ఞాపక

మున నిలిపి పనిచేయుటయు మానవధర్మములలో ముఖ్యములు. జ్ఞానము, వివేకము, ఈ రెండును సదా వినియోగించక గ్రుడ్డితనముగ ప్రవర్తించుటచేత మానవుడు పశుసమానుఁడగును. ఆహారవిహారములు, నిద్రయు, సంతానవృద్ధి చేసికొనుట, భయము, మరణము మృగములకును నరులకును సమానధర్మములు గదా! వివేక విజ్ఞానములు మాత్రము మానవులందు కానవచ్చును గాన వానిని ఏమరక వినియోగించుటయే విశిష్ట మానవధర్మములు.

ఆదియందు సామాన్యజనులు, తమ స్వల్పజ్ఞానమును వినియోగించుటలో కేవలము శరీరసుఖముకొరకును, ఇంద్రియతృప్తికొరకును తత్సాధనములగు విషయములను ఆర్జించుటయందు కాలము గడుపుదురు. అనగ అర్థకామములయందు గమనమునుంచి వానికొరకే పాటుపడుదురు. ద్రవ్యము నార్జించుట, సుఖముల బడయుట, ఇవియే పురుషార్థములుగ నెన్నబడును. కొంతకాలమునకు, అనుభవమువలన కొన్ని విధములగు వృత్తులు, ఇతరులకు బాధకలిగించుటద్వారా, తమకు బాధకలుగుటవలన అవి అకార్యములనియు, మరికొన్ని వేరు విధములుగ నుండుటంబట్టి సుఖకారణములనియు అనగా చేయదగినవనియు, తెలిసికొని, ధర్మాధర్మజ్ఞానము గలవాడగు. అదిమొదలు కొంచెము ప్రయత్నముతో ధర్మము మూలపురుషార్థముగ ఎంచి, ధర్మమునకు విరోధములేక

ద్రవ్యార్జనము చేయుటయు, ధర్మవిరుద్ధము కాక కామభోగ ములను అనుభవించుటయు, యుక్తమని తెలిసికొని యను ష్ఠించును.

ఆపిదప కాలక్రమముగ ఈ విషయసుఖములు అల్ప కాలికములని యనుభవముచే తెలిసికొని, ఇట్లు అనిత్యము లును, మిశ్రములును అగు సుఖములకంటె నిత్యమగు సుఖము కలదా అని విచారించుటకు పూనును. అట్టి స్థితికిరాగా, సామాన్య ధర్మములకంటె నిత్యఫలదాయకములగు మోక్ష ధర్మముల నరయుచు, వాని పూనికతో అనుష్ఠించుటకు పూనును.

అట్టి మోక్షమార్గమున నడచువార లనుష్ఠించదగిన ధర్మము లెవ్వియో యోచించదగును. ఆ ధర్మములే "పార మార్థిక ధర్మములు" అను పేర తెలియదగినవి. వీనినే మోక్షధర్మములు అని చెప్పుట కలదు. వీనివిషయ మీ అధ్యాయమునను పై అధ్యాయమునను విస్తరించి చర్చింతుము.

సామాన్యముగ మనదేశమునను, దేశాంతరములయందును, అన్నిమతములవారిలో, మోక్షధర్మముల అనుష్ఠించుటకు మానవుడు, ఇల్లు వాకిలి భార్య బిడ్డలు, లౌకిక వ్యవహారములు అన్నియును విడిచి, సంన్యసించి, అరణ్యముననో, కొండ గుహాలలోనో, నిర్జనప్రదేశములలో ఏకాకియై విశేష

సాధనలను అభ్యసించినంగాని సాధ్యముకాదని అభిప్రాయము కలదు. ఆ మార్గ మొకమార్గము. కొన్ని సందర్భములలో అవసరమగు మార్గమేగాని అదియొకటే మార్గము కాదని అనుభవజ్ఞులగు మహనీయుల అభిప్రాయము. శ్రీ భగవద్గీతా శాస్త్రమంతయు వేరుమార్గమును బోధించుచున్నది. శ్రీ కృష్ణులు, తమ ప్రియశిష్యుఁడును సఖుఁడును అగు అర్జునునకు, బోధించినది సంన్యాసము కాదు. ఏకాంతవాసము కాదు. అయితే గృహస్థధర్మమును జ్ఞానముతో నడపి, లౌకిక వైదిక కర్మముల విడునకయే మోక్షమును పొందు మార్గము. ఆ మార్గమును అనేక దృష్టాంతములతో వారు బోధించిరి గదా!

"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ॥"

పై వాక్యములయందు జనకుడు మొదలుగాగల అనేకులను దృష్టాంతముగ చూపి, గృహస్థువు మోక్షధర్మముల ననుష్ఠించు మార్గముల సూచించియున్నారు. శ్రీ జనకులువారును ఆ మార్గమును తనచర్యవలననేగాక, సులభ అనుయోగిని [స్త్రీ సన్యాసి] తో చేసిన సంభాషణమున స్పష్టముగ బోధించియున్నారు. ఇవ్విషయమున, శ్రీ మహాభారతమున శాంతి పర్వములో మోక్షధర్మపర్వమునందలి జనకసులభా సంవాదము చదువదగును.

"గృహస్థ ధర్మమును వదలకయే మోక్షమును సాధించుట సాధ్యమా? అట్లు సాధించినవా రెవరైన కలరా?" అని యుధిష్ఠిరుడు భీష్ములవారిని ప్రశ్న చేయగా, ఆ యర్థమును తెలుపు ఇతిహాసమును చెప్పెదనని "జనకసులభా సంవాదము" అను గాథను వారు చెప్పిరి. అందు జనకులు ఇట్లు చెప్పియునారు :

"మోక్షేహి త్రివిధా నిష్ఠా దృష్టాన్యైర్మోక్షవిత్తమైః ।
జ్ఞానం లోకోత్తరం యచ్చ సర్వత్యాగశ్చ కర్మణాం ॥
జ్ఞాననిష్ఠాం వదంత్యేకే మోక్షశాస్త్రవిదోజనాః ।
కర్మనిష్ఠాం తథైవాన్యే యతయః సూక్ష్మదర్శినః ॥
ప్రహాయోభయమప్యేవం జ్ఞానం కర్మ చ కేవలం ।
తృతీయేయం సమాఖ్యాతా నిష్ఠా తేన మహాత్మనా ॥
త్రిదండాదిషు యద్యస్తి మోక్షో జ్ఞానేన కస్యచిత్ ।
ఛత్రాదిషు కథం న స్యాత్ తుల్యహేతౌ పరిగ్రహే ॥
దోషదర్శీ తు గార్హస్థ్యే యో వ్రజత్యాశ్రమాంతరే ।
ఉత్సృజన్ పరిగృహ్ణాంశ్చ సోఽపి సంగాన్న ముచ్యతే ॥
కాషాయధారణం మౌఢ్యం త్రివిష్టబ్ధం కమండలుః ।
లింగాన్యుత్పథభూతాని న మోక్షాయేతి మే మతిః ॥"

మహాభారతే, శాంతిపర్వ – మోక్షధర్మపర్వణి
321 అధ్యాయే శ్లో. 38—48)

"మోక్షశాస్త్రములం దెలిసిన కొందరు, జ్ఞాననిష్ఠయే మోక్షసాధనమనియును, అట్లే మరికొందరు సూక్ష్మదర్శును లగు యతులు కర్మనిష్ఠయే సాధనమనియును చెప్పుదురు. ఈ కేవల జ్ఞానకర్మనిష్ఠలను రెండింటిని వదలి, నాకు మూడవ మార్గము ఆ మహాత్మునిచే ఉపదేశింపఁబడినది. త్రిదండాదుల యందు మోక్షమున్న యెడల, ఛత్రాదులయందు ఎట్లు లేక పోవును ? రెంటియందు పరిగ్రహమనునది సమానకారణమే అయియున్నది. ఎవరుగాని గృహస్థధర్మమునందు దోష మున్నట్లు ఎంచి, ఇతరాశ్రమముల చరింతురో. . . . . వారు సంగరహితులు కాజాలరు. కాషాయమును ధరించుట, క్షౌరము, యజ్ఞోపవీతము త్యజించుట, కమండులువు ఇవన్నియు ఉత్తమమార్గముయొక్క బాహ్యచిహ్నములేగాని, మోక్ష హేతువులు కావు."

అని శ్రీ జనకులవారు వచించిరి. కావున మనబోటి వారలము గృహస్థులుగనే యుండి, కుటుంబ పోషణాదుల జరుపుచు, లౌకిక వ్యవహారముల విడువకయే, జ్ఞానము సాధించి, అనుష్ఠించి, కట్టకడపట ముక్తులగు ఉపాయము ఎట్టిదో యోచించి తెలిసికొనుట కర్తవ్యము. మొట్టమొదట అట్టిజ్ఞాన మెట్టిదియో తెలిసికొనవలయును. వేదములు, శాస్త్రములు, వేదాంతగ్రంథములు వీనినన్నింటిని చదివి వానియందలి విషయములను ఒక అక్షరమైనను లోపించక

తెలిసికొనుటయా? కాదు. నాలుగు వేదములు, ఆరు వేదాంగములు మరియు తక్కిన శాస్త్రములన్నియు "అపర విద్య" యే యని ముండకోపనిషత్తు చెప్పుచున్నది. అపర విద్యయన తక్కువ జ్ఞానము. ఉత్తమజ్ఞానమగు 'పరవిద్య' యెట్టిది?

"అథ పరా యయా తదక్షర మధిగమ్యతే"

అక్షర స్వరూపుడగు పరబ్రహ్మస్వరూపమును పొందుమార్గమే పరవిద్య. అట్టి బ్రహ్మజ్ఞాన మెట్టిది? ఈశావాస్య ఉపనిషత్తున—

యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి ।
యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః క శ్శోకః ఏకత్వమనుపశ్యతః ॥

ఎవడు సర్వభూతములను ఆత్మయందున్నట్లు చూచునో, ఏ స్థితియందు సర్వభూతములను ఆత్మస్వరూపములుగనె తెలియబడునో, అప్పుడు ఏకత్వమును చూచువానికి శోకమెక్కడ? మోహము (అజ్ఞానము) ఎక్కడ?

శోకమోహములను తరించి పరిపూర్ణజ్ఞాని యగు. ఈ యర్థమునే శ్రీ భగవద్గీతాశాస్త్రమున శ్రీ కృష్ణులు ఉపదేశించి యున్నారు:

"సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికం ॥"
(భ. గీ. ౧౮-౨౦)

"యదా భూతపృథగ్భావం ఏకస్థమనుపశ్యతి ।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥"
(భ. గీ. ౧౩-౩౦)

అనగా సర్వభూతములయందు, వేర్వేరుగ కనబడువాని యందు, విభాగము లేకయే, నాశరహితమగు ఏకత్వజ్ఞానము చూడబడునో, ఆ జ్ఞానము సాత్త్వికజ్ఞానము అని ఎఱుంగుము.

ఎప్పుడైతే భూతములయందు గానవచ్చు అనేకత్వము ఒక ఆత్మయందే చూడబడునో, అన్ని భూతములును ఆ ఆత్మ నుండి వ్యక్తమాయెనని ఎఱుంగునో, అపుడే బ్రహ్మమును పొందును.

కనుక వ్యక్తమగు సర్వభూతములయందు ఏకమగు ఈశ్వరుడు నిండియున్నాడనియో, అన్ని జీవులు ఈశ్వరాంశములే అగుటంబట్టి ఒక్కటే తత్త్వము అందరియందును అభివ్యక్తమగుచున్నదనియో, లేదా సామాన్య పామరభాషలో చెప్పినట్లు అందరును ఈశ్వరుని బిడ్డలేయని అందరియందా సాధర్మ్యమును చూచుటయో, వ్యక్తములగు సకలభూతములును, ఐతరేయబ్రాహ్మణమునం జెప్పఁబడినట్లు, సచ్చిదానందస్వరూపుడగు పరమాత్మయొక్క ఆవిర్భావోపాధులు—

అనగా పరమాత్మయొక్క ఆలయములు అనియో, ఎట్లు చెప్పినను సరే, వివిధములగు భూతములందు ఏకత్వమును చూచుటయే, యథార్థజ్ఞానము. అట్టి జ్ఞానమును సర్వభావముల అనుష్ఠించుటయే ముక్తుని లక్షణము.

ఈ జ్ఞానము సామాన్యముగ లేదు. గ్రంథములనుండియు, మహనీయులగు గురువులనుండియు ఎన్ని పర్యాయములు చదివినను, వినినను, ఆ జ్ఞానము సామాన్యముగ అనుష్ఠానమున అసాధ్యమగుచున్నది. అట్టి జ్ఞానము స్వానుభవమున ప్రత్యక్షమగుటకు ఏమి ప్రత్యవాయములు, ఆటంకములున్నవో వాని నెరింగి, తొలగించుకొనినం గాని ఆ పదవిని మానవుడు పొందజాలడు.

ఆ ఆటంకము లెవ్వి? వానిం దొలగించుకొను మార్గమెద్ది? విచారింతము.

ఇందు మొదటిమెట్లు, కఠోపనిషత్తున ఇట్లు చెప్పబడియున్నవి :

"నావిరతో దుశ్చరితాత్ । నాశాంతో నాసమాహితః ।
నాశాంతమానసోవాపి । ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥"

మొదట దుశ్చరితమునుండి సత్ప్రవర్తనమునకు మరలనిచో, అనగా పాపకార్యములను విడువనివానికి, ఇంద్రియములను, మనస్సును విచ్చలవిడిగా సంచరించనీయక లోబరచుకొనని

వానికిని శాస్త్రజ్ఞాన మెంత యుండినను, ఆత్మస్వరూపాను భవము కలుగదు.

ఈ అర్థమునే శ్రీ శ్రీ గౌతమబుద్ధులు ఇట్లు బోధించి యున్నారు. "మొదట పాపకార్యములను విడువుము. పిదప లోకమంగళ కార్యములను పూనికతో చేయుము." కాన మొట్టమొదటి పని—పాపకార్యములనుండి విరమించుట. లోకులు పాపకార్యముల నేల చేయుదురు? ఆ కారణమును తెలిసికొని, దానిని తొలగించుకొనవలయును గదా! ఎందుకు తప్పుపనులు చేయుదురు అని ఇంచుక యోచించినచో కారణము మనకే స్పష్టమగు. నిష్కారణముగ, ఏమియు ప్రయోజనము ఉద్దేశించక ఎవరుగాని ఏ కార్యమును చేయుట అరుదు. మరియు తెలిసి చెడ్డకార్యమేల చేయును? స్వప్రయోజనము, స్వలాభమె, సర్వపాపకార్యములకు మూల కారణము.

లోకమున జనులు, ఇష్టము లేకపోయినను, నిర్బంధపెట్టబడినట్లు, పాపకార్యములం బ్రవర్తించుచున్నారే, కారణమేమి? అని అర్జునుడు శ్రీ కృష్ణులవారిని అడిగిరి.

"అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ, బలాదివ నియోజితః ॥"

(భ. గీ. 3-36)

అందుకు శ్రీ కృష్ణులు చెప్పిన ప్రత్యుత్తరము చూడుడు :

"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥
(భ. గీ. 3-37)

కామము, క్రోధము. ఈ రెండును జ్ఞానమునకు నిత్యవైరులు. అనగా, స్వలాభాపేక్షయు, దానినుండి పుట్టునదియే క్రోధము, వీనివలననే సమస్తపాపములు పుట్టుచున్నవి. ఇవి యున్నచోట, ఎంత శాస్త్రజ్ఞానమున్నను, ఆ జ్ఞానమును అణగద్రొక్కి జీవుని గ్రుడ్డివానిగ చేసి దుష్కార్యములం బడవైచు. కావున సర్వానర్థమూలమగు కామమును తొలగించుకొనవలయును. కామము పోయినచో, క్రోధము పుట్టనే చాలదు. ఈ కామము నెట్లు తొలగించుకొనుట ?

శ్రీ కృష్ణులు, కామమున కునికిపట్లు అగు స్థలములను నిరూపించి, వానిని స్వాధీనము చేసికొను త్రోవయును సూచించియున్నారు :

"ఇంద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే ।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥"
(భ. గీ. 3-40)

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఈ మూడును కామమున కునికిపట్టులు. వీనియందు చేరి, జీవుని జ్ఞానమును ఆవరించి, మోహింపచేయును.

"తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥"
(భ. గీ. 3-౪౧)

కనుక, ఆదియందు ఇంద్రియములను జయించి, జ్ఞానవిజ్ఞానములను నాశముచేయు స్వభావము గలదియు, పాపరూపమైనదియునగు కామమును జయింపుము.

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వీని వరుసగ జయింపనగు. ఇవి ఒకటికంటె నొకటి బలవంతములు

"ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥
ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం ॥"
(భ. గీ. 3-౪౨, ౪౩.)

వీనిని జయించు ఉపాయములం గననగు.

మొట్టమొదట జయింపదగినవి ఇంద్రియములు. సామాన్యజనులకుగల కోరికలన్నియు ఇంద్రియభోగములను గురించినవి. మనస్సు ఎల్లపుడు ఆ భోగములను సంపాదించు ఆలోచనలతో నిండియుండును. ఆ సుఖములనె వెదుకుచుండును. దుఃఖప్రాప్తికరములగు విషయములను తప్పించుకొనుటకు త్రోవ వెదుకుచుండును. అట్లు చేయుట సహజమే అయి

నను విషయములవలన ఇంద్రియములద్వారా గలుగు సుఖము అనిత్యము, క్షణభంగురము, దుఃఖమిశ్రము. కాన అంతకంటె ఇంచుకయైనను దీర్ఘకాలికమును, దుఃఖ రహితము నగు సుఖమును కోరుటయు, వెదకుటయు సహజమే గదా!

ఇంద్రియములను జయించుటకు, వాని తత్త్వమును స్వభావమును అరయవలయును. ఇంద్రియములను గురించిన రహస్యము ఒకటి గలదు. దానిం దెలిసికొనిన ఇంద్రియ జయము సులభము. మనస్సు ఇంద్రియములతో చేరి పని చేయుచుండును. అట్లు మనస్సు ఇంద్రియములతో కలిసియున్నపుడే ఇంద్రియములు ప్రవర్తించగలవు. ఇంద్రియముల నుండి మనస్సు విడదీసినచో, ఏ యింద్రియముగాని స్వతంత్రించి పనిచేయజాలదు. ఎద్దియేని యొక విషయమును గాఢముగ యోచించుకాలమున, అట్టివారికి శబ్దము వినబడదు. రూపములను చూడజాలరు. జిహ్వసైతము రుచిని గ్రహించ జాలదు. ఒక్క ఇంద్రియమైన స్వవ్యాపారమును చేయ లేదు. అట్టి సమయముల వారు "అన్యమనస్కులు" గ నున్న వారందరు గదా! అట్లే మనము, ప్రయత్నపూర్వకముగ మనస్సునకు విలక్షణమగు పనిని పెట్టిన యెడల, మనస్సాపని యం దుండునంతదనుక ఇంద్రియ వ్యాపారములు అణగియుండును. అయితే మనస్సునకు దానియందు రుచి పుట్టునట్లు

చేయవలెను, క్రమక్రమముగ అభ్యాసముచే అభిరుచి కలుగ జేయగా, మనస్సు ఆ పనియందు ఎక్కువరుచి గలదియగును. అంతట ఇంద్రియములు అణగి లోబడును. మంచి గ్రంథములు, శాస్త్రములు వ్యాసంగము చేయుటయు, అప్పుడప్పుడు నియత కాలములలో భగవద్ధ్యానము చేయుట, ఇవి రెండును మనస్సును బలపరచి, ఇంద్రియ వ్యాపారములనుండి మరలించు ఉపాయములు. ప్రతిదినమును, కొంతకాలము ప్రయత్న పూర్వకముగ సద్గ్రంథకాలక్షేపమున వినియోగించుటయు, కొద్దికాలము ఈశ్వరధ్యానమున ఉపయోగించుటయును, నియమముగ చేసికొని, ఆ నియమము తప్పక జరిపినచో క్రమముగ మనశ్శక్తి వృద్ధియగును. మనస్సు స్వతంత్ర వ్యాపారమున ప్రవర్తించుచుండ ఇంద్రియములు, మనస్సహాయము లేమిచే శక్తిహీనములై, ఏ పని చేయుమనిన ఆ పని చేయుచు, నిలువమన్నపుడు నిలుచుచు స్వాధీనములగును. శాస్త్రవిచారాదులవలన, యుక్తాయుక్తజ్ఞానము సైతము వృద్ధియయి, ఇది చేయదగును, ఇది చేయరాదను జ్ఞానము సైతము గలుగుటచే ఇంద్రియవ్యాపారములను నిరోధించుటకు సహకారియగు. ఇట్లు భగవద్ధ్యానముచేతను, శాస్త్రీ ఉద్గ్రంథవ్యాసంగము చేతను, ఇంద్రియజయము సాధ్యమగును గాని, మనశ్శక్తిని జ్ఞానమును బలపరచక ఇంద్రియజయము చేయుట సాధ్యము కాదు.

"మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥"
(భ. గీ. ౬-౨౪)

"మనస్సు చేతనే ఇంద్రియములను చక్కగ నియమించి" అని శ్రీ కృష్ణులు బోధించియున్నారు.

కాబట్టియే పూర్వులు, ప్రతిమానవునకు, ప్రతిదినమునను, భగవద్ధ్యానమును, శాస్త్రవిచారమును విధించిరి. హిందూశాస్త్రములు ప్రతిమానవుడు నిత్యము కొంతకాలము, ఇష్టులతోడను, శిష్టులతోడను, పురాణేతిహాసములు మొదలగు సద్గ్రంథములను వ్యాసంగము చేయవలయుననియును, మఱి, అసచ్ఛాస్త్రవినోదములను, పరివాదమును వర్జించవలయునని నొక్కి చెప్పుచున్నవి. అట్లే దివ్యజ్ఞానసమాజ శాఖ లెచ్చట ఏర్పడినను, సమాజసభ్యులు ఇతరులతోచేరి సద్గ్రంథపఠనము పలుమారు జరుపుటకు యత్నించవలయునని నియమముకూడ కలదు.

ఇట్లు ఇంద్రియజయము సాధించిన మాత్రమున కామము జయింపఁబడలేదు. ఇంద్రియములలో చేరి జీవుని భాధింపలేదు గాని, మనస్సు బుద్ధి యను మరి రెండు కోటలలో చేరి యా జీవుని తప్పుత్రోవల నీడ్చుచునే యుండును. కాన మనస్సును జయించుట ఆవలి కర్తవ్యము. పూర్వపు అభ్యాసము వలన, కొంతమట్టుకు మనస్సుయొక్క నైజగుణమగు చాంచల్యము జయించబడినది. మనశ్శక్తియు బలపడి

నది. అయినను మనస్సునందలి దోషము పోలేదు. ఆ దోష మేమన "కామసంకల్పము."

"మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాఽశుద్ధ మేవ చ ।
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్ ॥"
(అమృతబిందూపనిషత్)

మనస్సునందలి కామమెట్టిది? శరీరసుఖములను తుచ్ఛభోగములను కోరు స్థితి దాటనది. నేను గొప్పవాడను, పండితుడను, అధికారిని, భక్తుడను అను మొదలగు భావములతో నిండి, తక్కువారందరికంటె తాను అధికుడను భావము, భిన్న భావమును గలిగి, ఇతరుల సుఖదుఃఖములను యోచించక "తన ఆయుష్యము, తన ఆరోగ్యము" అని అహంభావముతో చేరినవాడగు. దీని పేరే అహంకారము. ఒకవేళ కొంత మట్టుకు దీనులకు సహాయము చేయబూనినను, తిరస్కార భావముతో వారలచూచుటయు, తనకంటె గొప్పవారలం జూచినపుడు అసూయతో చూచుటయు, సమానులయందు స్పర్ధ, ఇవి అట్టివారికి నైజగుణములు. ఈ దుర్గుణములం దొలగించుట కుపాయమేమి? ఎట్లైతే మనశ్శక్తి సాయముచే ఇంద్రియజయము సాధ్యమో, అట్లే మనస్సుకంటె పరమగు 'బుద్ధి' సాయముచే మనస్సునందలి కాలుష్యమును పోగొట్టవలెను.

"శనైశ్శనైరుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥"
(భ. గీ. ౬-౨౫)

అనగా బుద్ధితత్త్వమును బలపరచి మనస్సునందలి దోషమును తొలగించనగు. బుద్ధిస్వభావము ఏమి? ఇచ్చట బుద్ధి యన "విజ్ఞానము." సామాన్యముగ అంతఃకరణములో నొకభాగ మగు నిశ్చయాత్మకబుద్ధి మాత్రము కాదు. నీవు నేను ఇతరులు అను భిన్నభావములను దాటి, జీవులందరు ఈశ్వరాంశములు, ఆత్మస్వరూపులు అనియును, అందరియందును ఈశ్వరుడు నిండియే యున్నాడనియు, ఎవరిని ద్వేషించినను బాధించినను, ఆ శరీరాంతస్థమగు ఈశ్వరతత్త్వమును ద్వేషించి బాధించినవార మగుదుమనియును ఎఱింగి అందరియందు కొంతమట్టుకైనను ఒకవిధమగు ఏకత్వదర్శనము చేయునదియే బుద్ధి. ఇట్టి భావమె విజ్ఞానము—విశేషజ్ఞానము, అనుభవ జ్ఞానము, అనబడును. శాస్త్రములయందు బోధింపఁబడిన విషయములు అనుష్ఠానమునకు రాకయుండుదనుక అహంకారము మమకారము ఉద్రేకించియుండును. ఎన్నడు బుద్ధితత్త్వము తలయెత్తునో, అపుడు అహంకారము తలవంచి శాస్త్రజ్ఞానము దినచర్యయందు బయలుపడును. కావున ప్రయత్నపూర్వకముగ కొంతకాలము సర్వమానవసోదర భావమును అభ్యసించుచు వచ్చినయెడల, దిన దినమునకు ఆ

భావము స్థిరమగుచు కట్టకడపట స్వభావమై ప్రకాశించును. ఇవ్విషయమును శ్రీ కృష్ణులు ఉద్ధవునకు ఇట్లు బోధించిరి:

"బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేఽర్కేస్ఫులింగకే ।
అక్రూరే క్రూరకేచైవ సమదృక్పండితోత్తమః ॥
సర్వేష్వభీక్ష్ణం మద్భావం పుంసో భావయతోచిరాత్ ।
స్పర్ధాసూయాతిరస్కారా సాహంకారా వియంతి హి ॥
విసృజ్యస్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం చ దైహికీం ।
ప్రణమేద్దండవద్భూమా ఆశ్వచండాలగోఖరం ॥
ఈశ్వరో జీవకళయా ప్రవిష్టో భగవానితి ।
యావత్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే ।
తావదేవ ముపాసీత వాఙ్మనః కాయవృత్తిభిః ॥"

బ్రాహ్మణునియందు, పుల్కసుని (చండాలుని) యందును, దొంగయందును, పరమ ఉదారియందును, సూర్యునియందును, మిణుగురునందును, పరమదయాళువునందును, క్రూరునందును, సమబుద్ధిగలవాడే పండితోత్తముడు. మానవులందరియందును ఈశ్వరభావము (మద్భావము) పుట్టగా, శీఘ్రముననే స్పర్ధ, అసూయ, తిరస్కారములును, అహంకారముతోకూడా నశించును. పరిహాసముచేయు స్వజనులను, శరీరముతో పుట్టిన లజ్జయును వదలి, కుక్క, చండాలుడు, గోవు, గాడిదె వీని కన్నిటికి భూమిమీద పడి సాష్టాంగ ప్రణామములు చేయదగును. ఈశ్వరుడు జీవకళగా అన్ని భూతములయందు ప్రవే

శించియున్నవాడని, అన్నిటియందు (మద్భావము) ఈశ్వర భావము పుట్టునంతవరకు, మనోవాక్కాయములతో పై చెప్పిన రీతిని ఉపాసన చేయవలయును.

ఇట్లు చేయుటద్వారా పైన సూచించినట్లు మూలము అహంకారమును, దానినుండి పుట్టు స్పర్ధాసూయాతిరస్కార ములును, తుదముట్ట నశించును. అంతట, మనస్సునందలి కామము నశించిన దన్నమాట.

ఇంతచేసినను, ఇంకను ఇంచుక కామము దాగియే యుండు నన్నట్లు తోచుచున్నది. అహంకారమును భిన్నభావ మును విడిచి, సర్వభూతహితుఁడై వర్తించువాడయ్యెను, అదియంతయు తనకు మోక్షసాధనముగ భావించుట గలదు. తనకు మోక్షము—కైవల్యము—కలిగిన మిగిలినవారిగతి యెట్లైతే నేమి? అను భావము మిగిలినను మిగులవచ్చును. భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదుడు శ్రీనృసింహమూర్తి ప్రత్యక్షమై, అతని భక్తిని శ్లాఘించి వైకుంఠమునకు రమ్మని పిలువగా, ఇట్లు చెప్పెను :

"ప్రాయేణ దేవ మునయస్స్వవిముక్తికామాః
మౌనం చరంతి విజనే న పరార్థనిష్ఠాః ।
నైతాన్విహాయ కృపణాన్ విముముక్ష ఏకః
నాన్యత్త్వదస్య శరణం భ్రమతోఽనుపశ్యే ॥"

దేవా! మునీంద్రులు తమ తమ ముక్తిని కోరినవారలై విజన స్థలంబులం దపంబు లాచరింతురు. ఇతరుల గతిని విచారించరు. అజ్ఞానులగు వీరినందరిని విడిచి, నే నొక్కఁడనే మోక్షమును కోరజాలను. వీరలకందరకును తామే శరణ్యము అని తాత్పర్యము.

మరియు శ్రీ కపిలాచార్యులు, తల్లియగు దేవహూతికి బోధించిన భక్తితత్త్వమును ఇట్లు బోధించియున్నారు.

"సాలోక్య సార్ష్టి సామీప్య సారూప్యైకత్వమిత్యుత ।
దీయమానం న గృహ్ణంతి జనా మత్సేవనం వినా ॥"

అనగా సాలోక్యము, సమానైశ్వర్యము, సామీప్యము, సారూప్యము, ఏకత్వము (సాయుజ్యము), ఇన్నివిధములగు ముక్తిని ఇచ్చినను (నా భక్తులు) పుచ్చుకొనరు. వారు కోరునది నా సేవ యొకటె అని తాత్పర్యము.

అనగా "ఈశ్వర పదాంబురుహాస్య సేవ." సమస్త జగత్తు, సమస్త భూతములు ఈశ్వరుని పాదముగాన సమస్త భూత సేవయే వారు కోరునది.

కనుక ఆ కడపటి కోరికయగు కైవల్యపదవిని సైతము త్యజించి, సర్వత్ర ఈశ్వర దృష్టి చేయుచు, ఎల్లయెడల వైకుంఠ కైలాసములనే చూచుచు,

"యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్ ॥"

అన్నట్లు సర్వకార్యములు ఈశ్వరకార్యములుగ చేయువారే జీవన్ముక్తులు.

జీవాత్మయందు ఇమిడియుండు ఆత్మశక్తులు అన్నియు బీజరూపములుగ నుండి, వికాసము చెందకపోవుటంబట్టి ఈ పూర్ణజ్ఞానము మొదట లేదు. సరిఅయిన మార్గమున కృషి చేయగా చేయగా ఆత్మ పూర్ణవికాసము పొందును. అవిద్యా ఆవరణము విడుచును. సర్వత్ర ఏకత్వజ్ఞానము స్థిరమగును.

ఈ అభ్యాసము గృహస్థువు చేయదగిన అభ్యాసము గదా! గృహస్థధర్మములను జాగరూకుడై జరుపుచు, కామ క్రోధములను క్రమక్రమముగ జయించుచు, ధర్మమునకు విరుద్ధముకాని మార్గముల అర్థమును ఆర్జించుచు, ధర్మావిరుద్ధములగు కామములను, కాలనియమములకు లోబడి అనుభవించుటద్వారా క్రమక్రమముగ ఇంద్రియజయము చేసికొని, దినము తప్పక ఈశ్వరధ్యాన, శాస్త్రవ్యాసంగాదులచే మన శ్చాంచల్యమును జయించి, మనశ్శక్తిని వృద్ధిచేసికొనుచు, స్వాధీనములగు దేహము, ఇంద్రియములు, మనస్సును, మఱియు తనకుంగల భోగసాధనసంపత్తులను, సర్వభూతహిత కరమగు వ్యాపారములయందు వినియోగించుటద్వారా, అహంకార మమకార, స్పర్థా అసూయాతిరస్కారములను, భిన్నభావములను నశింపజేసి సర్వత్ర ఆత్మదృష్టి అభ్యసించును. ఈ మార్గము జనకులవారు సూచించిన "తృతీయ మార్గము."

అట్టివారు అనుసరించు మార్గము ఆదియందు వారలు పరిపూర్ణులగుటకు సాధనము పరిపూర్ణులయినను ఆ మార్గమునే అనుష్ఠించుచు, "లోకసంగ్రహము" నే యిచ్ఛయించి, లోకమంగళముకొఱకు ప్రవర్తింతురు.

ఇట్టి గృహస్థులు పారమార్థిక గృహస్థులు. అనగా గృహస్థధర్మము నవలంబించుచున్నను అంతరంగమున పారమార్థికధర్మములనే లక్ష్యముగ నెంచి అనుష్ఠించువారు.

ఇంతవరకు వీరల అంతరంగవృత్తి, వీరలు అంతరంగ శుద్ధికొఱకు చేయు సాధనములను సూచించితిమి. వీరలు బాహ్యప్రవర్తనమున, అనగా లౌకికవ్యవహారముల నెట్లు ప్రవర్తింతురో, అదియు తెలియదగి యున్నది.

ఆదియందు, అనగా అజ్ఞానదశయందు జీవుడు కేవల ఇంద్రియములకు లోనై, విషయలోలుడై వర్తించును. కొంత వరకు, ధర్మాధర్మములు, యుక్తాయుక్తములు, కాలాకాలములను లెక్కించక విషయసుఖములను ఎట్లైనను పొందుట యొక్కటే ఉద్దేశ్యముగ ప్రవర్తించును. కాలక్రమమున రెండవ మెట్టు ఎక్కి అర్థకామములకుముందు ధర్మము నుంచుకొని, ధర్మమును న్యాయమును విచారించి, వారికి విరుద్ధము లేకయుండ ప్రవర్తించుటకు యత్నించును. ఈ స్థితియందు, ఇతరులవలన తానుపొందు లాభమునకు బదులు సమానముగ ఇతరులకు లాభములను సుఖములను కలుగజేయవలెనను భా

వము ముఖ్యమగు. అపుడు సాధ్యమైనంతవరకు అన్యోన్య ఋణానుబంధములను గుర్తించి, చేతనైనంతవరకు ఋణవిముక్తుడు కాదగు ప్రయత్నమున నుండును. తనకును తనవారికిని లాభకరము సుఖకరములు అగు కార్యములు మాత్రముకాక, స్వధర్మమును విచారించి, దానిని చక్కగ జరుపుటకు యత్నించును. స్వధర్మము అని తెలియవచ్చిన కార్యము దనకు లాభకరమా నష్టమును కలుగజేయునా అని యోచించుట మాని, స్వధర్మముకాక లాభాలాభ జయాపజయములను, సుఖదుఃఖములను లెక్కించక చేయును. ఆ పైన మూడవ మెట్టున స్వధర్మరూపమగు కార్యములంటె ఎక్కుడగు త్యాగరూపమగు కార్యములం బ్రవర్తించు. తా నజ్ఞానదశయందు, ఇతరుల సుఖదుఃఖములను ఇంచుకైనను లెక్కించక యితరుల వలన పొందిన సుఖములను, లాభములను, తెలిసి తెలియక అనేక జన్మములయందు ఇతరజీవులకు పడియుండు వివిధములగు ఋణములను ఊహించి, స్మరణకు తెచ్చుకొని యిపుడు తన శక్తిసామర్థ్యములను ఇతరుల క్షేమముకొరకు వినియోగించుటయె ముఖ్య ఆదర్శముగ ఎంచును. ఇక్కార్యము చేయుట నాకు విధియా కాదా యను విచారము ఉండదు. పరహితమగు కార్యములు తనకు అవకాశము కలిగినంతవరకు, తన శక్తికి లోబడినంతవరకు అన్నియు తన ధర్మములుగ నేయెంచి, లోకహితము పొంటె సదా కార్యోన్ముఖుడై వర్తించు.

ఇక్కాలమున జీవుడు నివృత్తిమార్గమునం బ్రవేశించినవాడు. ఇంతవరకు ప్రవృత్తిమార్గమున నుండి స్వార్థపరుడుగ నుండి, ప్రకృతి బద్ధుడుగ నుండినవాడు. కొంతకాలమునకు నీచస్వభావమును అణచుకొనుటకు యత్నించుచు మధ్యస్థితిలోనుండి, చేతనైనంత ధర్మమును పాలించుటకు యత్నించు. అనగా ప్రవృత్తిమార్గమునుండి నివృత్తిమార్గమునకు తిరుగ యత్నించు కాలము. అనంతరము, మూడవమెట్టున త్యాగమే స్వభావముగ గలవాడై ఇతరులు తనకు నష్టము కలుగచేసినను, దానికి బదులు వారలకు మేలునే చేయువాడగు. "అపకారికి నుపకారము, నెపమెన్నక చేయువాడు నేర్పరి సుమతీ." అన్నట్లు తాను ఎల్లరకు మేలునే చేయుటకు పాటుపడుచుండును. అట్టివాని హృదయమున, శత్రువులు, మిత్రులు, ఉదాసీనులు, అను భేదముండదు. లోకదృష్ట్యా శత్రువులు మిత్రులుగ కానవచ్చువారలయెడ సైతము, సమబుద్ధి గలిగి అందరకు సమముగ ఉపకారమునే చేయును. అట్టి త్యాగమున ఆనందమునే అనుభవించును. త్యాగమునకు, లోకసేవకు అవకాశములను వెదకుచు, దొరికినపుడెల్ల ఆనందముతో లోకసేవ చేయుచు ఆనందభరితుడగును.

కట్టకడపట మెట్టున సర్వకర్మములను ఈశ్వరకైంకర్యముగ భావించుచు లోకమున ఈశ్వరకింకరునివలె వర్తించును. నేను అను భావమునే మరచి, సర్వభూతములను ఈశ్వ

రాలయములుగ నెంచి సకలభూతసేవ, ఈశ్వరార్చనముగ నెంచును. ఏ రూపమును అలక్ష్యముచేసినను, ఈశ్వరుని అవమానించినట్లు ఎంచి సదా జాగరూకుడై, భూతసేవయందు మైమరచును. ఈశ్వరుడు ప్రపంచభారమును వహించి స్థితికర్మ పూని యున్నట్లు, ఈశ్వరతాదాత్మ్యమును చెంది యభ్యసించుచు, నిర్వాహకుడైన పుత్రుడు తండ్రిమోయు కుటుంబ భారమును తాను వహించినట్లు, ఈశ్వర కింకరుడుగ తన శక్త్యనుసారము ప్రపంచభారమును వహించుటకు యత్నించును. అనగా తనశక్త్యవకాశములకు దగినట్లు భూతసేవ యీశ్వరార్పణముగ చేసి, యిట్టి సేవమూలముననే ఈశ్వర పూజ సలుపును.

ఇట్టి మహనీయులు లోకమున లోకమంగళముకొఱకు జీవింతురుగాని ఆత్మార్థము కాదు.

"శివాయ లోకస్య భవాయ భూతయే య ఉత్తమశ్లోక
పరాయణా జనాః । జీవంతి నాత్మార్థం . . . ॥"
(శ్రీమద్భాగవతము)

అట్టివారు లోకమున చేయు కార్యములన్నియు, లోకమంగళమును, లోకపురోవృద్ధి నుద్దేశించి చేయబడునవికాని స్వార్థ కారణములు కావు. ఏ కార్యమును పూనినను దాని ఫలము ఇహలోకమునగాని, పరలోకమునగాని, జన్మాంతరమున గాని, తమకు చెందవలెనని కోరికగాని, లేక ఇట్టి సత్కా-

ర్యము నేను చేయుచున్నానని అభిమానముగాని లేక లోక
ములోని సకల జనులు, సకలభూతములు సుఖమును పొంద
వలెను, అభివృద్ధి కావలెను, ఉత్తమపురుషార్థమును పొంద
వలెను, ఈశ్వరమహాసంకల్పము నెరవేరవలెను అను ఉద్దేశ
ముతో చేయబడును. ఇట్లు చేయు కర్మము శ్రీ జనకాదుల
వలె రాజ్యపరిపాలనముగాని, వసిష్ఠాదులవలె జ్ఞానబోధ
చేయుటగాని, సామాన్యముగ లోకదృష్ట్యా నీచకార్యములని
యెన్నబడు కార్యములే కాని, ఆ కార్యములం జేయుటలో
ఫలాపేక్ష, అభిమానము లేక ప్రజలందరు సుఖమున జీవిం
తురుగాక, లోకమంతయు సుఖమున అభివృద్ధిపొందుగాక
యని చేయబడినచో ఆ కర్మములే ఈశ్వరపూజలై ఉత్తమ
జ్ఞానసాధనములగును. ఇట్లు చేయు కర్మములకును ఉత్తమ
జ్ఞానమునకును భేదము లేదు. శ్రీ కృష్ణులు భగవద్గీతాశాస్త్ర
మున బోధించినది ఇట్టి కర్మయోగము. ఇట్టి కార్యమునే
"అకర్మ" యని నాల్గవ అధ్యాయమున పదునెనిమిదవ శ్లోక
మున వారు సెలవిచ్చినది.

"కర్మణ్యకర్మ యః పశ్యేదకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥"

కర్మయందు అకర్మను ఎవడు చూచునో, అకర్మయందు కర్మను
అట్లె ఎవడు చూడగలడో, వాడే మానవులలో బుద్ధిమంతుడు,
వాడే యోగి, వాడే కృతకృత్యుడు అని తాత్పర్యము.

అనగా, ఎవడు తాను చేయు కార్యములను, ఫలాపేక్షయు, అభిమానమును లేక లోకహితముకొరకే చేయుచు అట్టి కర్మమును అకర్మగా, కర్మకానిదిగ తెలిసికొనునో, అట్లే మాంద్యముచేతగాని అహంకారముచేతగాని చేయదగిన కార్యమును చేయక ఉపేక్షించి యూరకుండుటయందు, కర్తవ్యాకరణదోష ముండుటం బట్టి అట్టి అకర్మ కర్మతో సమానమని యెఱుంగునో, వాడు నిజమగు యోగి. వాడే కృతకృత్యుడు.

ఇవ్విషయమున ఇంకొక రహస్యము కలదు. గృహస్థధర్మమునం దుండువారలకు చుట్టుప్రక్కల మనస్సునకు విక్షేపమును గలుగజేయు విషయములు ఉండుటచేతను, జీవయాత్రయందు అనేక కష్టములు ప్రాప్తించుటచేతను పై సూచించిన ఉత్తమధర్మముల అనుష్ఠించుటలో ప్రమాదముల కవకాశము కలదు. కాన సన్యసించిగాని మోక్షమార్గము నవలంబించ సాధ్యముగాదని తలతురు. ప్రమాదకారణము లున్నకారణమున వానినుండి పరువెత్తిపోవుట భీరువు లక్షణము గాని ధీరుని వృత్తి కాదు. ఆదియందు ఇంద్రియనిగ్రహము మనోనిగ్రహము కొంచెముకూడ లేనివానికి వాని నభ్యసించుటకు బాహ్యసంన్యాసము అవశ్యమే కాని అదియే ఉత్తమోత్తమమనికాని, ఎల్లరకు అవశ్యమనికాని యెంచరాదు. పూర్వజన్మములలో, ఆ సంన్యాసమార్గమును అవలంబించి, కొంత

స్థైర్యమును గడించిన ధీరులకు, శత్రుమధ్యముననుండి, శత్రువులతో పోరాడి శత్రువులను జయించినట్లు ప్రమాదకారణములగు విషయముల మధ్యనుండి క్రమక్రమముగ అభ్యాసముచే విషయాకర్షణలను అతిక్రమించి, ధన్యులగుటయే ఉత్తమమార్గము. ఈ మార్గము ధీరమార్గము. ఈ మార్గము నవలంబింపజాలమని భయపడువారలకు సంన్యాసము, ఏకాంతము తగినమార్గము. వారలును రాబోవు జన్మములయందు ధీరులై, విషయముల మధ్యనుండియు, వాని యాకర్షణలకు లోపడక తామరాకులో నీటిబిందువువలె నిర్లేపులై యుండగల స్థితికి రాగలరు. పూర్వజన్మములయందే అట్టి స్థైర్యమును గడించిన ధీరులు కొందరు ఈ జన్మమున గృహస్థులుగ నుండియు, కర్తవ్య కార్యములను లోపములేక చేయుచు, అసంగులై లోకకైంకర్యము చేయుచు, లోకకుటుంబులై ఈశ్వరసంకల్పమును కొనసాగించుటయే ముఖ్య ఆదర్శముగ పనిచేయుచున్నారు. ఇది గొప్పలక్ష్యము. గొప్ప ఆదర్శము. విశేష ప్రయతితవ్యము. ముఖ్యముగ ఇక్కాలమున ఎల్లయెడల స్వార్థత్యాగులై నిస్సంగులై లోకహితముకొఱకు పాటుపడువారు పెక్కండ్రు కావలయును. అట్టి ధీరులు పెక్కండ్రు లోకసేవకై మహనీయుల కృపవలన వెలువడుదురు గాక.

# పదునొకండవ అధ్యాయము

## పారమార్థిక ధర్మము—పూర్వశేషము

### చిత్తశుద్ధి

"చిత్తశుద్ధిలేని శివపూజ లేలయా,
విశ్వదాభిరామ వినురవేమ."

మానవజన్మ ఉత్తమజన్మమనియు, అనేకకోటి యితర జన్మముల అనంతరము, పుణ్యపరిపాకమువలన మానవ జన్మము లభించుననియును పెద్దలు చెప్పుచున్నారు. శాస్త్రములయందు నట్లె చెప్పబడియున్నది. అట్టి జన్మము లభించినందుకు, దానిని సాఫల్యము చేయవలయుననిన, మనము చేయదగిన కర్తవ్యమేమియో ప్రతియొక్కరము పలుమారు చింతించి తెలిసికొనవలసిన విషయము.

మానవుడు చేయు ప్రయత్నమంతయు నాలుగువిధములైన ఫలములను గోరి చేయుచున్నాడు. అవి యెవ్వియన— ధర్మము, అర్థము, కామము, మోక్షము. ఇవియే చతుర్విధ పురుషార్థములని చెప్పఁబడుచున్నవి. అనగా కొందఱు ద్రవ్యము నార్జించుటయే ముఖ్య ఉద్దేశ్యముగా నెంచి ప్రయత్నము చేయుదురు. మఱికొందఱు సుఖము లనుభవించుటయే ముఖ్య

ప్రయోజనమని యెంచి, యీ సుఖములకు సాధనమగు ద్రవ్యము నార్జించుచు, అర్థకామములనే పురుషార్థములుగ భావించుచున్నారు. అయినను అర్థకామములు అవశ్యము లుగ నెంచబడినను, ధర్మమునకు విరుద్ధములుకాని మార్గము ననే అర్థము నార్జించి, ధర్మమునకు విరోధములేని భోగము లనే అనుభవించవలెనని, ధర్మమును మూలపురుషార్థముగను, ప్రథమపురుషార్థముగను భావించుచు దాని కనుకూలముగను, అవిరోధముగను అర్థకామములను ఆర్జించి యనుభవించువారు కొందఱు, ఈ మూడింటిని పురుషార్థములుగ నెంచి వానిలో ధర్మమును ప్రధానముగ నెంచువారు ఈ ముప్పురిలో శ్రేష్ఠులు. అయినను నాల్గవ పురుషార్థము గలదు గదా! అది పరమపురుషార్థమనియు, ముఖ్యపురుషార్థమనియు, మోక్షమనియు చెప్పఁబడుచున్నది. ప్రథమమగు మూలపురు షార్థమును మరువక, ద్వితీయ, తృతీయములను ఆర్జించి యనుభవించుట ద్వారా వాని యథార్థ ప్రయోజనమును గ్రహించినవార్లకు నాల్గవ పురుషార్థము సులభసాధ్యము.

ఈ పరమపురుషార్థమును సాధించుటకు చిత్తశుద్ధి యావశ్యకము. చిత్తశుద్ధి లేకయే చేయు కర్మములు, దాన ధర్మములు, ఉపాసనలును పరమపురుషార్థమును పొందింపఁ జాలవు. "చిత్తశుద్ధిలేని శివపూజలేలయా?" అను వేమన వాక్యమెల్లరకు తెలిసినదే. ఈ చిత్తశుద్ధి నెట్లు సాధించవల

యునో తెలిసికొని, ఆ మార్గము నవలంబించి సాధించుట ప్రతిమానవునకు అవశ్యకర్తవ్యము. ఇందుకు మొట్టమొదట మానవతత్త్వమును, అనగా జీవస్వరూపమును ఇంచుక తెలిసికొనవలయును.

### జీవస్వరూపము

మానవునకు తన స్వరూపమును తెలిసికొనుటకంటె నెక్కుడు జ్ఞానము లేదు. తక్కిన జ్ఞానమంతయు, ఈ స్వస్వరూపజ్ఞానమునకు సహకారియగుటచేతనే జ్ఞానమని వాడబడును. లేనియెడల నదియంతయు జ్ఞానమునకు వ్యతిరేకమే కనుక "నేను, నేను" అనుకొనువాఁడెవఁడు? సామాన్యముగ మనకన్నులకు కనబడు శరీరమే నేనని మనము తలచుచున్నాము. నాది శరీరముగాని నేను శరీరము కాదని తెలిసికొనినవాడు స్వస్వరూపమును కొంచెము తెలిసికొనినవాడు. నేను జీవుడను, శరీరము కాదు. శరీరములు అనిత్యములు, నశించునవి. పుట్టుట, పెరుగుట, కృశించుట, చచ్చుట మొదలగు వికారములకు లోనైనవి. కావున ఆద్యంతములు కలవి. జీవుడన్ననో నిత్యుడు. ఈ శరీరము పుట్టుటకు ముందుండినవాఁడు. ఈ శరీరము నశించిన తరువాతను, అనగా శరీరము మృతిపొందిన తరువాతను ఉండువాడు.

"అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తాశ్శరీరిణః ॥"

(భ. గీ. ౨-౧౮)

94/A4/59

"దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత ॥"
(భ. గీ. ౨-౩౦)

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥
(భ. గీ. ౨-౨౦)

భగవద్గీత రెండవ అధ్యాయములో మొదటిభాగమంతయు జీవుని నిత్యత్వమును, శరీరముల యనిత్యత్వమునే బోధించు చున్నది. ఇట్లు నిత్యుడైన జీవుని స్వరూపమేమి?

జీవుఁ డీశ్వరాంశము

జీవుఁడు ఈశ్వరుని అంశము. అనగా, ఈశ్వరునినుండి వెలువడినవాడని చెప్పదగు. దీని యర్థమును చక్కగ తెలిసి కొనుటకు కొన్ని ఉపమానములు సహాయములు. (1) గొప్ప మట్టివ్యక్తిమునకును, మట్టివిత్తనమునకును ఏలాటి సంబంధము గలదో, అట్టిసంబంధము ఈశ్వరునకును జీవునకును గలదు. అటులనే గొప్ప అగ్నిజ్వాలకు, దానినుండి వెలువడు నిప్పారవకును గల సంబంధము.

" యథా సుదీప్తాత్పావకాత్ విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే సరూపాః ॥

తథాఽక్షరాత్ వివిధాః సౌమ్యభావాః
ప్రజాయంతే తత్ర చైవాపియంతి ॥"
(ముండకోపనిషత్)

బాగుగ మండుచుండు గొప్ప జ్యోతినుండి వేలకొలది విస్ఫులింగములు (నిప్పురవలు), జ్యోతితో సమానస్వరూపము గలవి యెట్లు వెలువడుచున్నవో, అటులనే అక్షరస్వరూపుడైన బ్రహ్మమునుండి జీవులు (భావాః) వెలువడుచున్నారు అని తాత్పర్యము.

వెలువడుచున్నారన్నమాత్రమున ఒకచోటనుండి యింకొక స్థలమునకు వచ్చుచున్నా రనుకొనరాదు. ఈశ్వరుఁడంతట నిండియుండువాడు. ఆయనకు వెలుపల యనునది లేదు. ఆ తత్త్వమునుండి వేరు అయినదియును లేదు. కావున, వెలువడుటయన, ప్రకృతితోచేరి వ్యక్తమైనది అని గ్రహింపవలయును. అంశవలె నున్నవాడనియును, వెలువడినట్లు కానవచ్చువాడనియును గ్రంథములయందు సూచింపబడియున్నది. పై యుపమానములనుండి మనము తెలిసికొనవలసిన విషయమేమి? మఱ్ఱివిత్తనమునందు, అదృశ్యముగ, మఱ్ఱిమ్రానుయొక్క శక్తియంతయు ఇమిడియుండి, తగిన క్షేత్రమునందు పడి, మన్నుచే కప్పఁబడి, చెమ్మ తగిలి, వేడిమి పుట్టగా ఆ బీజమునుండి మోసుపుట్టి మొలకయయి చిన్న చెట్టయి కాలక్రమమున ఎండలో తపించి, గాలిచే కొట్టబడి, దృఢమై విస్త

రించి పూర్వపు వృక్షమువలె పరిపూర్ణముగ ఏలాగు వ్యక్తమగుచున్నదో, ఆలాగుననే ఈశ్వరాంశమగు జీవునియందు, బీజమునందు వృక్షమువలె, ఈశ్వరశక్తులన్నియు, అదృశ్యముగ ఇమిడియున్నవి. అయితే ఈశ్వరునియందు శక్తియంతయు పూర్ణముగ ప్రకాశించి వ్యక్తమగుచుండగా, జీవునియందు ఆ శక్తులన్నియు బీజరూపముగ నున్నయవి. సంసారమను క్షేత్రమునందు ప్రవేశించి సుఖదుఃఖములను శీతవాతాతపములచే కొట్టబడి వివిధానుభవములద్వారా జ్ఞానమును పొంది జీవుడును ఈశ్వరునంతవాడు కాదగియున్నవాడు.

పైన ఉదహరించిన ఉపనిషద్వాక్యమునందు 'భావాః' జీవులు 'సరూపాః' ఈశ్వరునితో సమానరూపులని సూచించియున్నది. అనగా ఈశ్వరుని శక్తులు, అల్పముగ బీజరూపముగ జీవునియందున్న యవి యని భావము. అనగా ఈశ్వరుఁడు జ్ఞానస్వరూపుఁడు, సర్వజ్ఞుఁడు. జీవుఁడు సైతము జ్ఞానస్వరూపుడేగాని "కించిజ్జ్ఞుఁడు" అల్పజ్ఞానముగలవాడు. సర్వజ్ఞుఁడు కావలెను. ఈశ్వరశక్తి అనంతము, అపారము. జీవుని శక్తి అల్పము పరమితము, అపారము అనంతము కావలెను. ఈ యుద్దేశము నెరవేఱుటకే, కృపానిధియగు జగదీశ్వరుఁడు మనలను (జీవులను) పాంచభౌతికమగు ప్రపంచమున ప్రవేశింపఁజేసెను. తండ్రి తనబిడ్డలను పాఠశాలకుఁ బంపి, విద్యావంతులను చేసి, తనంతటివారలను చేయునట్లు, జీవులను

ప్రపంచమున లేక బ్రహ్మాండమను పాఠశాలం బ్రవేశపెట్టి ప్రపంచానుభవముద్వారా జ్ఞాన మభివృద్ధికాగా తనంతటి పుత్రులను జూచి, యానందస్ఫూర్తి చెందుచున్నాడు.

జీవుని ఉపాధులు—జ్ఞానసాధనములు

బ్రహ్మాండమునం బ్రవేశించి యాయాలోకజ్ఞానమును సాధించుటకు జీవునకు ఆయాలోక సంబంధమైన శరీరములు కావలయును. భూలోకజ్ఞానము పొందుటకు భూలోక ప్రకృతితో నిర్మింపఁబడిన శరీరము కావలయును. అటులనే భువరాదిలోకముల జ్ఞానమును సాధించుటకు ఆయాలోక ప్రకృతితోఁ జేయబడిన శరీరములు కావలయును. ఆ శరీరములకే సామాన్యముగ సూక్ష్మశరీరములనియు, కారణశరీరములనియు కొన్ని గ్రంథములయందు పేరులు గలవు. ప్రస్తుతము జీవుని పరిణామము ముఖ్యముగ భూః, భువః, సువః అను మూడు లోకములలో జరుగుచున్నందున ఈ మూడులోకముల ఉపాధులను ముఖ్యముగ తెలిసికొనవలయును. భూలోకశరీరమే స్థూలశరీరమనబడును. ఈ శరీరముచే బాహ్యకర్మలు లౌకిక కార్యములు వైదికకర్మములును చేయుదుము. ఈ శరీరముననే శ్రోత్రము, చక్షువులు, స్పర్శేంద్రియము (చర్మము), జిహ్వా, ఘ్రాణము అను అవయములుండినను, ఈ వెలుపలి అవయవములకు మూలమగు ఇంద్రియములు భువర్లోక తత్త్వములతో చేయబడిన కామమయశరీరమను సూక్ష్మశరీరభాగ

ములో నుండును. స్థూలశరీరమున నుండునవి ఇంద్రియములకు బాహ్యాంగములగు గోళములు. యథార్థమగు ఇంద్రియ వ్యాపారములు, రాగద్వేషములు, ఆశాపాశములు, వివిధము లగు మనోవికారములును, సూక్ష్మశరీరమున నుండును. రాగ ద్వేషములతో కలియని మనోవృత్తులు, సంకల్పములు, సువ ర్లోక శరీరము అనగా మనోమయకోశమున నుత్పత్తియగును. ఈ శరీరముల వ్యాపారములను శుద్ధముగ చేయుటద్వారా జీవుని పరిపక్వమే చిత్తశుద్ధి యనబడును.

దైవాసురసంపద్విభాగము

జీవుడీశ్వరాంశమగుటచే, ఆత్మలక్షణములు బీజరూప ముగ జీవునియందున్నవి. శరీరములతో కలిసి పనిచేయుటచే, శరీరలక్షణములగు ప్రకృతిధర్మములు బలముగ నుండును. శరీర దృష్ట్యా, మృగ శరీరమునకును మానవ శరీరమునకును తారతమ్యము ఎక్కువగ లేదు. శరీర ధర్మములగు ఆకలి, దప్పి, నిద్ర, భయము, సంతానవృద్ధి కారణమగు ఇంద్రియ వ్యాపారము, పశువులకును నరులకును సామాన్యము. యుక్తా యుక్త జ్ఞానము, వివేక వైరాగ్యాదులు మాత్రము ఆత్మ గుణము లనదగును. మృగధర్మము లనదగినవన్నియు ప్రకృతి లేక శరీరధర్మములు. వీనినే శ్రీ కృష్ణభగవంతుడు శ్రీ భగ వద్గీత ౧౬ వ యధ్యాయమున ఆసురసంపద్గుణములని నిరూ పించి యున్నారు. ఆత్మగుణములని చెప్పదగిన గుణముల

గొన్నింటిని జేర్చొని, వాని దైవీసంపద్గుణములని చెప్పి యున్నారు. సామాన్యముగ ప్రతి మానవునియందు దైవీ సంపద్గుణములు కొంతమట్టుకును ఆసురసంపద్గుణములు కొన్ని యును కలిసి యుండును.

"అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవం ।
అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతిరపైశునం ।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలం ।
తేజః క్షమా ధృతిః శౌచం అద్రోహో నాతిమానితా॥"

భయములేక యుండుట, పరిశుద్ధస్వభావము, జ్ఞాన యోగమునందాసక్తి, దానము, ఇంద్రియ నిగ్రహము, దేవతాపూజనాదులు, శాస్త్రి అర్థవిచారము, తపస్సు, న్యాయప్రవర్తనము, అహింసా, సత్యము, క్రోధములేక యుండుట, త్యాగము, శాంతి, ఇతరులయందు దోషారోపణ చేయకుండుట, భూతదయ, విషయభోగములయం దాశలేకుం డుట, నెమ్మది, లజ్జ, చపలత లేకయుండుట, తేజస్సు, ఓర్పు, ధైర్యము, శౌచము, ద్రోహము లేకయుండుట, అహంకార ము లేకుండుట, ఇవి దైవీసంపద్గుణములు.

"దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ" అజ్ఞానము ఇవి, ఆసురసంపదగలవాని గుణములు. ఈ ఆసుర

సంపదగలవారి లక్షణముల నీ రీతిని వర్ణించియున్నారు. పట్టు విడుపులు తెలియక ప్రవర్తింతురు. శౌచము, ఆచారము, సత్యము వారియం దుండవు. జ్ఞానహీనులయి, లోకములకు అనగా భూతములకు కీడుచేయు నిచ్ఛగలవారై ఉగ్రకర్మము లను చేయుచుందురు—అంతములేని కామములు గలవారై దంభమదములతో గూడి, అన్యాయమైన మార్గముల కామ భోగముల ననుభవింపగోరుచు, నూర్లకొలది ఆశాపాశము లచే బద్ధులై, అన్యాయార్జితమైన ద్రవ్యముతో కామభోగ ములను అనుభవింతురు. అహంకారమూఢులై, "ఈ ధన మును సంపాదించితిని. ఇంకా ధనమును చేర్చెదను. ఈ శత్రు వును నాశము చేసెదను. ఇంకా శత్రువులను నాశము చేసె దను. నేనే ప్రభువును. నేనే భోగిని. నేనే సిద్ధుడను. బల వంతుడను. ఆఢ్యుడను. నాతో సమానమెవరు? నావంటి సుఖి యెవరు?" అని యీ విధమైన భ్రాంతితో అనేక కామభోగములలో చిక్కుకొని నరకము పాలగుదురు.

పైన సూచించిన వర్ణనలను గమనించి మనము మన స్వభావములను నిష్పక్షపాతముగ పరిశీలించిన యెడల మన యందు దైవీసంపత్తు ఎంతమాత్ర ముండునది ఆసురసంపద్గుణ ములు ఎంతమాత్ర ముండునది మనము తెలిసికొనగలము. ఒక్కొక్కరును తన స్వభావమును తామె నిష్పక్షపాత బుద్ధితో ఇతరుల గుణదోషములను పరీక్షించు రీతిని పరిశో

ధించి తనయందుండు ఆసురసంపద్గుణముల నొక్కటొక్కటిగ దొలగించుకొని దైవీసంపద్గుణములను ఒక్కొటొక్కటిగ బల బరుచుకొనుచు లేనివానిని ప్రారంభించి యభివృద్ధి చేసికొన వలెను. కాపువాడు పొలమునందలి ముండ్లచెట్లను పనికిమాలిన మొలకలను ఒకటొకటిగ తొలగించి పొలమునందు మంచి పుష్పఫలవృక్షముల నాటి పెంచు రీతిని మన అంతఃకరణ క్షేత్రమున బలిసియుండు ఆసురసంపద్గుణములను కంటకము లను క్రమక్రమముగ నిర్మూలముచేసి దైవీసంపద్గుణములను అభివృద్ధి చేసికొనవలెను. కాలక్రమమున దుర్గుణములన్నియు నిర్మూలము కాగా సుగుణములు అభివృద్ధి అయి మోక్షపద వికి మనము రాగలుగుదుము. ప్రత్యక్షముగ కృషిచేయక యుండినచో నెన్నియోకోట్ల జన్మముల నెత్తి కల్పకల్పాంతర ములలో పొందదగిన పరిపక్వము ప్రత్యేక కృషి చేయుట వలన శీఘ్రకాలములో పొందగలుగుదుము. అందుకు చేయ దగిన కృషి యెట్టిదో విచారింతము.

చిత్తశుద్ధిని సాధించుటకు మొట్టమొదట మనము, మన అంతఃకరణమును సావధానముగ నిష్పక్షపాతముగ పరి శోధించి మనకు స్వభావముగ నుండు గుణదోషములను తెలిసి కొనవలయునని నిరూపించితిమి గదా ! ఇది యిక్కాలమున ముఖ్యముగ గమనించవలసిన విషయము. ఇపుడు జనులు కాలమంతయును బాహ్యకార్యములయందే గడపుదురు.

తమ యంతఃకరణశోధన చేయుట అరుదు. అంతఃకరణమును అప్పుడప్పుడు శోధనచేయక పోయినచో మనయందలి దోషములు మనకు తెలియవు. మన దోషములు మనకు తెలియక పోయిన యెడల వానిని బోగొట్టుకొనుట యెట్లు? కావున ప్రతిదినమును కొంచెము కాలము ఏకాంతమున తన హృదయమును పరీక్షించి అందలి గుణదోషముల గుర్తించుట మొదటి పని. ఇక్కార్యము పలుమారు చేయవలయును. ఆదియందు అజ్ఞానమువలన మనయందలి దోషములు తెలియరాక యుండును. పలుమారు శోధించుటలో దినదినమునకును మనయందలి దోషములు విపులముగ మనసునకు దగులును. ఇట్లు చేయుచు, గుర్తించిన దోషములను దొలగించుకొనుటకు ప్రయత్నించుచు, సుగుణబీజములను దినదినమునకు అభివృద్ధి యగునట్లు చేసికొనవలయును. ఇది యెట్లు చేయవలయును?

### ధ్యానయోగము

దీని కుపాయము భగవద్గీతా శాస్త్రమునందు ఆరవ యధ్యాయమున బోధింపఁబడియుండు యోగమే. యోగమనునది అస్మదాదులకు సాధ్యముకాని యేదియో యొక కష్టమైన అభ్యాసమని తలచరాదు. హఠయోగు లభ్యసించు ఎనుబదినాలుగు ఆసనములు, అనేక ముద్రలు ఇచ్చట అవసరము లేదు. రాజయోగ మార్గమున ఇవి ముఖ్యములు కావు. యోగమనగా నేమి? శబ్దార్థము 'కూడిక.' మన

మనస్సును తన యిష్టానుసారము విషయభోగములను చింతించుచు పరుగిడక యుండునట్లు చేసి, యిష్టదేవతపై నిలువు టయే యోగాభ్యాసము. మనోధర్మములు కొన్నిటిని తెలిసికొని యా ధర్మముల మన మనస్సు పరిణామముకొరకు వినియోగించుటయే యోగము. వ్యవసాయము చేయు కాపువాడు, కృషిశాస్త్రమును తెలిసి ఆ శాస్త్రము ననుసరించి వ్యవసాయము చేసినచో ఫలము నిశ్చయము గదా? అట్లు లేక కృషిశాస్త్రమును తెలిసికొనక యిష్టానుసారము పని చేసిన చేసిన కృషి వృథాయగును. అటులనే, మన అంతఃకరణము (లోపలి యింద్రియము లేక మనస్సు) పరిశుద్ధమై పరిపాకము కావలెనన్న మనోధర్మములను తెలిసికొని వానిని మన మన్వయించుకొనవలయును. ఈ యర్థము గీత ఆరవ యధ్యాయమున విశేషముగ చెప్పఁబడి యున్నది.

"యోగీ యుంజీత సతతం . . . ।
ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగం ఆత్మవిశుద్ధయే ॥"

సతతము యోగము నభ్యసింపవలెను. ఆత్మశుద్ధికొరకు యోగము నభ్యసింపవలెను.

ఇవ్విషయమున ముఖ్యముగ కొన్ని మనోధర్మములు మిక్కిలి సహకారులు. అవి యెవ్వియన:

(1) "యద్భావం తద్భవతి" మనుష్యు డెయ్యేభావములను పలుమారు ధ్యానించునో ఆ రూపముగ మారును.

(2) ప్రతిదినమును ప్రాతఃకాలమున నిదుర లేవగనే యెద్దియైన నొక తలంపు, భావము, మనస్సున దృఢముగ నాటునట్లు చింతించినచో, ఆ భావము మనస్సున నిలిచి యుండి, మనస్సునకు వేరు పనిలేక తీరికగా నుండుకాలమున పునఃపునః జ్ఞాపకమునకు వచ్చుచుండును.

(3) ప్రతిదినము కాలనియమము నేర్పర్చుకొని ఆ కాలనియమము ప్రకారము పనులుచేయ నారంభించినచో అలవాటు బలముచేత ఆయా కాలమునకు తప్పక ఆయా కార్యములు జ్ఞాపకమునకు వచ్చును. మనస్సును శరీరమును ఆయా కార్యములయందు ప్రవర్తించుటకు తగిన స్థితియందుండును.

ఈ సూచించిన ధర్మముల నొక్కొక్కటిగ పరిశీలించి చూతము.

"యద్భావం తద్భవతి"

మనుజు డెయ్యేభావముల పలుమారు చింతించునో ఆయా రూపముగ మారును. పలుమారు చెడ్డతలంపుల తలచుచు, చెడ్డకార్యములను పన్నుచుండువాని మనస్సు ఆ చెడ్డతలంపులతో నిండి కొంతకాలమునకు ఆ చెడ్డతలంపులు ఆలోచనలు, వానికి స్వభావమై వాడు చెడిపోవును. దుర్మార్గుల సహవాసము చేసి అట్టివారలనే పలుమారు తలచుచున్నందున వారి స్వభావమే పట్టుబడును. అట్లుగాక ప్రతిదినమును, ఈశ్వరుని

గాని, ఈశ్వర సములైన మహాత్ములగు ఋషులను, కారణ గురువులను, పరమగురువులను చింతించుచు వచ్చినచో మన మును వారి శుభలక్షణములను గలవారమై వారివలె యగు దుము. కావున ప్రతిదినము కొంతకాలము భగవద్ధ్యానము చేయుదగు.

### ధ్యానము

ధ్యానమన చింతించుట. భగవంతుని నిలకడయైన మనస్సుతో చింతించుటయే ధ్యానము. అట్లు చింతించుచు, మనస్సును ఇతరవిషయముల దిక్కునకు పరుగెత్తక యుండునట్లు చేసి యీశ్వరునిపై నిలుపుటయే ధ్యానయోగము. దీనినే అభ్యాసమనియును, అభ్యాసయోగమనియును చెప్పుదురు. భగవంతుని చింతించుటయన నేమి? సామాన్యముగ నందరు చేయు నామస్మరణ, నామోచ్చారణము మాత్రము కాదు. మనస్సున భగవంతుని నిలుపవలెను. అది యెట్లనగా:

1. మొట్టమొదట ప్రతియొకరును ధ్యానము చేయుటకు, తన పూర్వకర్మానుసారమగు రుచివిశేషమున కనుగుణముగ, ఒక యిష్టదేవతను నిశ్చయించుకొనవలెను. అట్లనుటచే ఈశ్వరునికంటె భిన్నమగు దేవతా ఉపాసన కాదు. భగవంతుని లీలావిగ్రహములలో నొక్కరూపమును లక్ష్యముగ నుంచుకొని దినదినము మనస్సు నాలక్ష్యముపై నుంచి ధ్యానించవలెను. లక్ష్మీనారాయణ రూపము, సాంబమూర్తి

రూపము, శక్తిస్వరూపములలో నొకటి, శ్రీ రామకృష్ణాద్యవ తారములలో నొకరూపము, పరమగురువులగు ఋషుల రూపమును గాని, మతాంతరముల భక్తులు తమతమ ఆచార ప్రకారము భగవదవతారముల రూపములుగాని, మతస్థాపకులగు మహాత్ముల రూపమును గాని మనస్సున నిలిపి, యేకాగ్రచిత్తముతో నారూపమును ధ్యానించవలయును. మనస్సు ఏకాగ్రముగ నిలుచుటకు ఆధారముగ రూప మవసరము. ఆకారము లేకయే కేవల బ్రహ్మతత్త్వమును ధ్యానించుట సామాన్యులకు కష్టసాధ్యము.

"క్లేశోఽధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసాం ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥"
(భ. గీ. ౧౨-౫)

నిరాకారమైన అవ్యక్త అక్షర బ్రహ్మోపాసనము సామాన్యముగ దేహధారులగు దేహాభిమానులకు అతికష్టమని తాత్పర్యము.

ఇట్లు ఇష్టదేవత ఆకారమును మనస్సున నిలిపి ధ్యానించుట మొదటిమెట్టు. ఇట్టి ధ్యానమును గుఱించి శ్రీమద్భాగవతమున :

"విలిఖితమివ రూపం చిత్తభిత్తౌ మురారేః
సుమన ఇవ మనో మైరర్పితం తత్పదాబ్జే ।

ప్రతిపదముదయద్భిః సాత్త్వికై రంకితాంగాః
త ఇహ భవపయోధేః పార ముల్లంఘయంతి ॥"

మురారి (ఉపాస్యదైవము) యొక్క రూపమును, చిత్తమను గోడపై చిత్రించినట్లుగా నిలిపి, ఆ దైవరూపముయొక్క పాదములయందు, పుష్పములవలె మనస్సు నర్పించి, (భక్తి పారవశ్యమువలన) శరీరమున భక్తిచిహ్నములు (సాత్త్విక భావములు, పులకాంకితము మొదలగునవి) కనుపడునట్లు ధ్యానించువారు, ఈ జన్మముననే సంసారసముద్రమును దాటుదురు అని తాత్పర్యము.

ఈ యర్థమును ఇంచుక విచారించవలయును. మొదట ఉపాస్యుని రూపమును, చిత్రకారుడు గోడపై కొంచెము కొంచెముగా ప్రతిమను చిత్రించురీతిని, మనస్సున ఇష్టదేవత రూపమును కొంచెము కొంచెముగ భావించి నిలుపవలెను. పాదములయొద్ద ప్రారంభించి క్రమక్రమముగ శిరస్సువరకును సర్వాంగములను మనస్సున కల్పించుకొనవలెను. మన దేశమున బాహ్యపూజ చేయుటయందు సర్వాంగపూజ చేయుట కద్దు గదా! పాదౌ పూజయామి, జంఘౌ . . . ఉదరం . . . హృదయం . . . కంఠం . . . ముఖం . . . అని యొక్కొక్క అంగమును ఆపాదమస్తకమును పూజించుటలో కేవలము బాహ్యవిగ్రహమున పుష్పములుంచుట కాదు. ఆయా అంగ

మును తలచుచు బింబమును మనస్సున కల్పించుకొనుటయే యుద్దేశ్యము. కడపట సర్వాణ్యంగాని పూజయామి అను నప్పటికి పూర్ణబింబము చిత్తభిత్తియందు నిలుపఁబడవలయును.

సుమన ఇవ మనో మైరర్పితం తత్పదాబ్జే—పుష్పముల వలె మనస్సును పాదములయం దర్పించవలెను. పుష్పముల వలె అనుటలో కేవలము ఉపమానము కాదు. బాహ్యపూజ యందు ఉపాసకు డర్పించు పుష్పములు అంతఃకరణమున పుట్టు భక్తిభావములను సూచించు బాహ్యచిహ్నములు. యథార్థముగ ఏకాగ్రచిత్తముతో భగవంతునిగాని, పరమ గురువులను గాని ధ్యానించు భక్తుని హృదయమునుండియు, శిరస్సునుండియు, దివ్యసుందరములగు నీలోత్పలములు, కమలములు లోనగు పుష్పములవంటి రూపములు వెలువడుచుండు నట్లు యోగదృష్టితో జూచువారలకు స్పష్టముగ కనబడునని దివ్యజ్ఞానసమాజాధ్యక్షులు శ్రీమతి అనీబెసెంటు దేవిగారును, శ్రీయుత లెడ్బీటరుగారును వ్రాసియున్నారు. అట్లు పుష్ప రూపముగ వెలువడు భక్తిభావములు ఉపాస్యుని పాదముల యం దర్పించవలె నని యర్థము. ఇట్లు నిలకడతో ధ్యానము చేయుచురాగా ఉపాస్యదైవముయొక్క రూపము మనస్సున స్థిరమై కన్నులు మూయగనే, ఉపాస్యరూపము మనస్సునకు ప్రత్యక్షమగును. ఉపాస్యుని తేజస్సును మహిమయు ఆ రూపమున నిండి భగవంతుని యవతారములవలె యథార్థ

మగు రూపమగును. ఇట్టి రూపము, అష్టవిధ అర్చావతార ములలో నొకటి.

ఇంతవరకు వర్ణించినది స్వరూపధ్యానము. రూపమును మాత్రము ధ్యానించుట చాలదు. ఆ భగవంతుని గుణము లను ఎట్టివిగ ధ్యానింతుమో అట్టి గుణములు పట్టుపడును.

గుణానుసంధానము

కావున ఉపాస్యుని దివ్యకల్యాణగుణములను ఒక టొక్కటిగ ధ్యానించవలెను. రూపధ్యానమున మనస్సు నేకాగ్రము చేసిన పిదప, భగవంతుని అనంత కల్యాణగుణ ములను చింతించవలెను. దీని నుద్దేశించియే అర్చనలను విధిం చిరి. సహస్రనామార్చనము, అష్టోత్తరశతనామావళి అర్చ నము, ఉపాస్యునియొక్క అమానుషచర్యలను స్మరించి తద్ద్వారా వారి కల్యాణగుణములను ధ్యానించుటకు సహాయ ములుగ విధింపఁబడినవి. కావున ఉపాస్యుని దయాస్వరూ పునిగను, శాంతస్వరూపునిగను, కామదాహకునిగను, సత్య స్వరూపునిగను ధ్యానించినచో ఉపాసకుడును, దయాస్వరూ పుడు, శాంత సత్య స్వభావములు గలవాడును, కామమును జయించినవాడగును. అటులనే అల్ప మానవ గుణములగు క్రోధ ఆగ్రహ గుణములను ఉపాస్యునియందు దారోపించి అట్టి క్రోధమూర్తిగ ధ్యానించినచో, ఉపాసకుడు క్రోధాగ్రహ మూర్తియగును. శత్రునాశనము నుద్దేశించి చేయు ఉపాసన

లిట్టివే గదా! ఇట్టి యుపాసనవలన జీవునకు పురుషార్థభంగ మగును. భగవంతుడు చెప్పియున్నాడు గదా!

"క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥"

క్రోధమువలన మోహము (అజ్ఞానము), మోహమువలన మతిభ్రమ, మతిభ్రమవలన బుద్ధినాశము, దానివలన వినాశము అనగా పురుషార్థభంగము గలుగును.

భగవంతుని కల్యాణగుణములను, దైవీసంపత్తిగుణములను ఒకటొకటిగ దినదినము ధ్యానించుచురాగా, కొంత కాలమునకు ఆయాగుణములు భక్తునికి స్వభావమగును. అనేక గుణముల నొక్కతూరిగ ధ్యానించినచో అంతఫలముండదు.

గుణమును ధ్యానించుటయన నేమి? ఒక దృష్టాంతమును తీసికొనుదము. భగవంతుడు దయాస్వరూపుడు. దయ యన నేమి? దయను అభ్యసించున దెట్లు? దయగల మానవుడు లోకమున నెట్లు ప్రవర్తించును? దయాస్వరూపులగు మహనీయులు ముందు లోకమున నెట్లు చరించిరి! రంతి దేవుడు, శిబిచక్రవర్తి లోనగు మహాపురుషుల చరిత్రము లేమి బోధించుచున్నవి? ఎట్టి సందర్భములలో దయ నభ్యసించుటకు ఆటంకములు గలుగును? అట్టి ఆటంకములు సందర్శించినపు డెట్లు నడచుకొనవలెను? ఈ రీతిని బుద్ధిని విని

యోగించి వితర్కించి, దయాగుణము ననుష్ఠించు మార్గమును ప్రతిదినమును యోచించి నిశ్చయించుకొనుచురాగా, దిన దినమునకు క్రొత్తమార్గములు స్ఫురించి ప్రవర్తనమును చక్క చేయును. ముందుగ తీరిక యుండునపుడు శాంతమైన మనస్సుతో యోచించి నిశ్చయించుకొనక లౌకికవ్యవహారముల యందు ప్రవర్తించువారలకు పలుపలు సందర్భములు తటస్థించి నపుడు, నడుచుకొనుమార్గము తెలియక, తప్పుత్రోవలం బడుదురు. రాబోవు శత్రువును గుఱించి ముందు హెచ్చరిక గలిగి తగిన యోచన చేసికొని సిద్ధముగనుండు వానివలె అనను కూల సందర్భములు తటస్థించినపుడు పై చెప్పిన విధమున దినదినము ధ్యానించువా డెట్టిసందర్భములయందును, చక్కని మార్గమును స్పష్టముగ తెలిసికొని నటించును. అట్లు ఒక్కొక్క గుణము ప్రాతఃకాలమున ధ్యానించి దినచర్యయందు అనుష్ఠించుచురాగా క్రమక్రమమున ఆ గుణము స్వభావమున స్థిరపడును. కాలక్రమమున ఒకటివెంబడి యొకటి గుణములు స్థిరపడుచురాగా స్వభావము పరిశుద్ధమగును.

ఈ అభ్యాసము ఎంత కొంచెము కాలము చేసినను, చేసినమట్టుకు ప్రయోజనకారి. ముసలితనమున ప్రారంభించి కొంచెము కాల మభ్యసించినను, ఆ యభ్యాసము సైతము వృధా పోజాలదు.

"స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

ఆ స్వల్పము జీవుని విజ్ఞానమయకోశమున నిల్చి, పై జన్మమున తిరిగి అంకురించి యోగమార్గమున నడచుటకు సహకారియగును.

ఉత్తమమైన ఫలము నిచ్చుటకు ఈ ధ్యానాభ్యాసము నకు కొన్ని నిబంధనలు గలవు. ఆ నిబంధనల నెఱింగి వాని ప్రకారము నటించినచో శీఘ్రముగ ఫలము నిచ్చును. చేయు కృషి పూర్ణఫలము నిచ్చును.

### ధ్యానానుష్ఠానమునకు నియమములు

ధ్యానము పూర్ణముగ సఫలము కావలెననిన కొన్ని నియమము లావశ్యకములు. ముఖ్యముగ స్థలనియమము, కాలనియమము కేవలము ఆవశ్యకములు. శ్రీ భగవద్గీత ఆరవ అధ్యాయమున శ్రీ కృష్ణులు వీనిని కొంతవరకు వివరించి యున్నారు:

యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసి స్థితః ।

* * * *

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజనకుశోత్తరం ।
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ॥
ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగ మాత్మవిశుద్ధయే ॥
సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ॥
(భ. గీ. ౬—౧౦-౧౩)

వీని యర్థమును ఇంచుక విచారింతము. మొట్టమొదట

## స్థలనియమము

"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః" "శుచియైన స్థలమును స్థిరమైన ఆసనమును ఏర్పరచుకొని." శుచియైన ప్రదేశమన నేమి? శుభ్రముగ కడిగి, ఊడ్చి, నిర్మలమైన ప్రదేశము అనుకొనుదమా? అంతమాత్రము కాదు. నిర్మలమై పవిత్రమైన స్థలమని తెలిసికొనవలయును. పడకగది, కచ్చేరిచావడి, వంటయిల్లు, ఇతర ఐహికకార్యముల కుపయోగించు స్థలములు, గదులును, ఎంత కడిగినను ఎంత అలంకరించినను ఎంత నిర్మలముగ నుండినను ఆ స్థలములు పవిత్రములనఁబడవు. సామాన్య గ్రామములకును, పవిత్రక్షేత్ర తీర్థములకును గల తారతమ్య మేమి? సామాన్య గృహమునకును దేవాలయమునకును తారతమ్యమును గమనింతము. ఎచ్చట సదా భక్తులు చేరి భగవద్విషయముల చింతించుచుందురో భక్తులగోష్ఠి జరుగుచుండునో అట్టి ప్రదేశము పవిత్రమైనది. అది యొక దివ్యక్షేత్రముగాని, నదీతీరముగాని, దేవాలయముగాని. లేక స్వగృహమునందు భగవదారాధనమునకుమాత్ర ముపయోగించు గదిగాని, శుచియైన ప్రదేశము, పవిత్రమైనది కావున ప్రతియింటను భగవదారాధనమునకును, భగవద్ధ్యానమునకును గది యొకటి నిర్ధారణచేసి ఆ గదిని ఇతర ఐహిక విషయముల కుపయోగించక యుండవలయును. ఆ గది శుభ్రముగ నిర్మలముగ

నుండునట్లుంచదగు. ఆ గదియందు వలయుననిన భగవంతునియొక్కయు, భక్తులయొక్కయు, జ్ఞానులు పూజ్యులు లోనగు పెద్దలయొక్కయు, పటములు విగ్రహాములు నుండవచ్చును. ఆరాధనకు వలయు పుష్పాదులు ఉండవచ్చును. అచ్చటనుండు వస్తువులు ఒక్కొక్కటియు, భగవంతుని జ్ఞాపకము చేయునవిగ నుండవలెనుగాని యితరము లుండరాదు. అట్టి స్థలము భగవద్ధ్యానమునకు ఉచితమైన ప్రదేశము. ఇట్టి స్థలము భగవద్ధ్యానానుష్ఠానముతో బాహ్యాభ్యంతర శుచిగలిగినది. అట్టి స్థలముగాక ఐహికవిషయముల కుపయోగించు స్థలమున ధ్యానము నిలకడగా కుదురుట కష్టము. మనశ్చాంచల్యము నధికముచేయు కారణముగ నుండును.

## ఆసనము

ధ్యానమునకు కూర్చుండునపుడు సుఖమై స్థిరమైన యాసనముండవలయును. లేనిచో, ఆసనము కఠినముగ నుండినను, క్రిమికీటకములు, చీమలు మొదలగునవి పారాడుస్థలముగ నుండినను, చెమ్మనేలగ నుండినను శరీరమునకు బాధ గలుగుటచేత మనస్సు ఏకాగ్రముగ నుండుట కష్టము. కావున "స్థిరమాసన మాత్మనః, నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరం" అని నిరూపించి యున్నారు. ఆసనము స్థిరమై కదలకుండవలెను. మిక్కిలి ఎత్తుగ నుండరాదు. నిండా

తగ్గుగ నుండరాదు. మిక్కిలి ఎత్తైనచో కూర్చొనువారికి భయకారణము. మిక్కిలి తగ్గినచో క్రిమికీటకాదులవలని బాధ. అతి కఠినముగ నుండరాదు. కావున వస్త్రము (లేక చిత్రాసనము), దానిక్రింద కృష్ణాజినము, దానిక్రింద దర్భాసన ముండవలెనని నిరూపించినారు. ముఖ్యాభిప్రాయము ఆసనము సుఖముగ నుండవలెనని భావము. సుఖముగ నుండకపోయినచో మనస్సు నిలకడగా నుండజాలదు. అయితే సుఖమైన ఆసనముపై కూర్చొనినచో మనస్సు ఏకాగ్ర ధ్యానమునకు మాఱుగ నిద్రను చెందునో యను భయము గలదు గదా! అట్లు కాకయుండుటకు "సమం కాయశిరో గ్రీవం" అనగా శరీరము, కంఠము, శిరస్సు, చక్కగా నుండవలెనని బోధించియున్నారు. అట్లుగాక గోడప్రక్కన కూర్చుండి, ఆనుకొనుటకు సుఖమైన పీటను గోడకానించి ఆనుకొని కూర్చుండినచో తప్పక సుషుప్తియే ఫలము. "ఋజుకాయ స్సమభ్యసేత్" అని శ్రీమద్భాగవతము. అట్టి పవిత్రస్థలములో సుఖాసనాసీనుఁడును, జాగరూకుఁడునై ధ్యానము చేయవలెను. "తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేంద్రియ క్రియః" ధ్యానము చేయుటకు, మనస్సు ఏకాగ్రముగ భగవంతునిపై నుంచవలెను. అనగ ఇతర తలంపులు మనస్సులో చొరకుండ హెచ్చరికతో నుండవలెను. ఇంద్రియములు సైతము నిలిచియుండవలెను. అనగ చెవులు

కన్నులు ఘ్రాణము మొదలగు నింద్రియములు వాని వాని వ్యాపారములయందు ప్రవర్తించక యుండవలెను. ఇట్లు ఇంద్రియములతో చేరి విషయములను చింతించక, వానినుండి మరలించి మనస్సును నిలకడగ నుంచుటయే యోగశాస్త్రము నందు (1) ప్రత్యాహారమనియు, (2) ధారణమనియు చెప్పబడుచున్నవి. ఇట్లు అంగములు కుదుర్చుకొని, మనస్సును భగవంతునిపై నిలిపి, ధ్యానము నభ్యసించవలెను. అట్లు భక్తిశ్రద్ధలతో జేయుచురాగా కాలక్రమమున స్వభావము పరిశుద్ధమగును.

కాలనియమము

ధ్యానమునకు నియతకాల ముండవలయును. ముందు సూచించిన మనోధర్మములలో మూడవదానిని గమనింపవలయు. మన దినచర్యయందు కాలనియమ మేర్పాటుచేసికొని, కాలము తప్పక పనులు చేయుచుండినచో అభ్యాసబలమువలన ఆయాసమయము రాగా ఆయాకార్యము స్మరణకువచ్చి ఆ కార్యమునందు బుద్ధిపోవుచుండునని ముందు చెప్పితిమి గదా. ధ్యానమునకును, ఆ ప్రకారము కాలనియమ మేర్పాటు చేసికొనినచో, ఆ సమయమునకు మనస్సును, శరీరమును ధ్యానమున కున్ముఖములుగ నుండును. ఎన్ని యితర కార్యములు ఇతర అసందర్భములు ఉండినను ధ్యానమునందు బుద్ధిపోవుచుండును. అయితే యెట్టికాలము ఉత్తమమైన

కాలమో తెలిసికొని ఆ కాలము తప్పక ధ్యానమునకు కూర్చొనినచో ఉత్తమ ఫలముల నిచ్చును. ఆ కాల మెద్ది? సూర్యోదయమునకు ముందు కాలము శ్రేష్ఠమని అనుభవజ్ఞులు చెప్పుచున్నారు. నిదుర లేచిన వెంటనే శరీరసంబంధమైన కృత్యములం దీర్చుకొని స్నానాదుల నెరవేర్చి శుచియై వెంటనే ధ్యానముచేయుటకు యత్నించవలెను. సంసారసంబంధమైన వృత్తులయందు మనస్సును ప్రవేశపెట్టుటకుముందే భగవద్ధ్యానమును చేయవలెను. సూర్యోదయమునకు ముందు కాలము మిక్కిలి ప్రశస్తము. ఆ కాలమున ప్రపంచమంతయు నిశ్శబ్దముగ నుండుటచే ధ్యానమునకు మిగుల సహాయముగ నుండును. అంతియ కాదు. నిదురనుండి లేచినకాలమున, మనస్సును ఇంద్రియములును సామాన్యముగ నిశ్చలముగ నుండును. నిదురకాలములో ఇంద్రియము లన్నియు నిర్వ్యాపారములుగ నుండియుండెను గదా! మనస్సు సైతము చాల మట్టుకు నిశ్చలముగనే యుండియుండవచ్చును. కావున నిదుర మేల్కాంచిన వెంటనే మనస్సును ఇంద్రియములును స్వభావముగనే నిశ్చలముగ నుండుటచేత అట్టి సమయమున మనస్సునేకాగ్రముగ చేసి ధ్యానమునకు ప్రారంభించుట సులభము. అట్టి సమయమున మనస్సు పూర్ణ జాగ్రదవస్థయందుండు రీతిని ఐహిక విషయములయందు పరుగులెత్తక, నిద్రయందుండురీతిని పూర్ణ అజ్ఞానమునందుండక, మెలకువతో నిలు

కడగ నుండును. కావున అట్టి సంధికాలము నిజమైన సంధ్యా కాలము. అట్టి స్థితియందు చేయఁబడు చక్కని ధ్యానమే (సమ్యక్ ధ్యాయతే ఇతి సంధ్య) నిజమైన సంధ్యావందనము.

ప్రాతఃకాల ధ్యాన ఫలము

అట్లు కాలనియమము నేర్పరుచుకొని ధ్యానము చేయుటవలన ప్రతిదినమును అ సమయమునకు సరిగ నిదుర మెలకువ కలుగును. మనస్సు ధ్యానమునకు తగిన స్థితి యందుండును. ధ్యానము శీఘ్రముగ సఫలమగును.

ఇదిగాక ముందుదాహరించిన మనోధర్మములలో రెండవ ధర్మముయొక్క ప్రయోజనమును చూతము. ప్రాతః కాలమున ఎద్దియైన నొక భావమును మనస్సున నాటునట్లు స్థిరముగ ధ్యానించినచో ఆ భావము మనస్సున నిలిచి యుండును. వేరు ఆలోచనలు లేక తీరికగనుండు కాలమున ఉదయమున ధ్యానించిన భావము స్మరణమునకు వచ్చును. జ్ఞప్తికి రాగా మనము చేయు కార్యముల ఆభావమున కను గుణముగ నుండునుగదా! ప్రమాదముతో దుష్కార్యములం బ్రవర్తించు అవకాశములు తగ్గును. కావున ప్రాతఃకాలమున ప్రప్రథమముగ భగవద్ధ్యానమును చేయువారలకు దినమం తయు తీరికగనుండు కాలమున ఆ పవిత్రభావములు మనస్సున నుండిన మనస్సు పరిశుద్ధముగ నుండును. మనస్సు శుద్ధముగ నుండిన మనోభావములు కోరికలు సంకల్పములు పరిశుద్ధ

ముగ నుండును. అట్టివాఁడు చేయు బాహ్యకార్యములు పరిశుద్ధములుగ పాపరహితములుగ నుండుననుటకు సంశయము లేదు. ఇట్లు ప్రాతఃకాలమున భగవంతుని ధ్యానించి తద్గుణానుసంధానముచే మనస్సు శుద్ధమగుటద్వారా చేయు కార్యము లన్నియును శుద్ధములగును. అట్టివాని ప్రవర్తనము నడవడిక పవిత్రముగ నుండక తీరదు.

ఆత్మ పరిశోధనము

ఇట్లు ప్రాతఃకాలమున ఉత్తమ ధర్మములను భావములను ధ్యానించుచు వాని కనుగుణముగ దినచర్యను పరిశుద్ధముగ చేయుటకు మనము యత్నింతుము గదా? ఎంత యత్నించినను ఐహిక వృత్తులయందు ప్రవర్తించుచో పూర్వకర్మవాసనాబలముచేతను అజ్ఞానమువలనను పొరబాట్లు కలుగవచ్చును. తాత్కాలిక సందర్భములనుబట్టి కామక్రోధలోభములు పూర్తిగ జయింపబడక యుండుటబట్టియు మనము చేయు ప్రయత్నము భంగము కావచ్చును.

"ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి ॥"
(భ. గీ. ౨-౬౭)

"యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥"
(భ. గీ. ౨-౬౦)

కావున ప్రతియొకడును దినమున కొక్కతూరి తన దినచర్యను నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించి దానియందలి గుణదోషము లం దెలిసికొని దోషములుండినచో అట్టి దోషములం దొల గించుకొనుటకు నిశ్చయించుకొనవలెను. ముఖ్యముగ రాత్రి నిదురించుటకు పూర్వము తక్కిన కార్యములన్నియు ముగిసిన పిదప ఒకతూరి మనస్సు శాంతముగ చేసికొని యేకాంతమున గూర్చుండి తాను ప్రాతఃకాలమున ప్రారంభించినది మొదలు నిదురించుటకు బోవువరకు తానుచేసిన కార్యములను, తల చిన తలంపులను, కోరిన కోరికలను, వరుసగా తలపుకు తెచ్చు కొని నిష్పక్షపాతముగ విమర్శించి తప్పులుండినయెడల అట్టి తప్పులను మరల చేయకూడదని నిశ్చయించుకొని శాంతమైన మనస్సుతో కొంచెముకాలము భగవంతుని స్మరణచేసి నిద్రిం చవలయును. హిందువులలో ద్విజులుచేయు సంధ్యావందన మున ప్రతి ఉదయమున ముందటి రాత్రి చేసిన పాపములను జ్ఞాపకము చేసికొని పగలు చేసిన పాపములను సాయంకాల మున స్మరణకు తెచ్చుకొని ఈశ్వరధ్యానముతో వానిని తొలగించుకొనవలెనని పెద్దలు ఉపదేశించియున్నారు.

"పాపేభ్యో రక్షంతాం యద్రాత్ర్యా పాపమకార్షం
మనసా వాచా హస్తాభ్యాం . . . .
యదహ్నా పాపమకార్షం . . . . ॥"

మరల,

"యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ప్రతిముచ్యతే ।
యద్రాత్ర్యాత్కురుతేపాపం తద్రాత్ర్యాత్ప్రతిముచ్యతే ॥"

అను వాక్యములన్నియు రాత్రి చేసిన పాపములను ఉదయమునను, పగలు చేసిన పాపములను సాయంసమయముననుస్మరణకు తెచ్చుకొని అట్టి పాపములను మరల చేయకూడదని నిశ్చయించుకొనుటనే గదా ఉపదేశించుచున్నవి. అట్లు కొంచెమైనను నిలకడతో విచారము చేయక రోకటిపాటగా వాక్యములను పాడివేసినచో సంధ్యావందనము ఫలకారి కాదనుటకు సందేహము లేదు. ఇట్లు తాను అహోరాత్రములలో చేయు దోషములను పరిశీలించి పశ్చాత్తాపము ద్వారా మనస్సును నిర్మలము చేసికొనవలెను. అట్లు చేసిన తరువాత స్తిమితమైన మనస్సుతో దేవుని ధ్యానించి నిదుర పోవలయును.

రాత్రిసూక్తము

ఇవ్విధమున నిదురపోవుటకు ముందు భగవంతుని స్మరణతో భగవంతుని స్మరణయె కడపటి తలంపుగా మనస్సున నిలుపుకొని నిద్రించినచో నిద్రసమయమున శరీరము నిశ్చలముగ నిర్వ్యాపారముగ పడియుండగా జీవునకు ఈశ్వరుని స్మరణయే ముఖ్యభావముగ నుండును. నిద్రించుటకు ముందు ఏ భావము మనస్సున నుండునో ఆ భావమే "ఆలాపన" గ స్వప్నరూపముగ జీవుని అంటియుండుట అందరకు

అనుభవ వేద్యము. ఈశ్వరుని తలచుకొని ఆ తలపుతో నిద్రించినయెడల జీవునకు రాత్రియంతయు ఆ భావనయే గలిగియుండును. కావున ఉదయమున నిదుర లేచిన సమయమున మనస్సు దేవునియందే నిలిచియుండును. ఆ కారణమునుబట్టి వెంటనే భగవంతుని ధ్యానముచేయుటకు పూనినచో మనస్సు సులభముగ నిలిచి ఏకాగ్రధ్యానము సులభసాధ్యమవును. ధ్యానము ఉత్తమమైన ఫలము నిచ్చును. అట్లు ధ్యానము నిశ్చలము కానుకాను దినచర్యయు బరిశుద్ధమగుచు వచ్చును. ఇవ్విషయము పూర్వము సర్వజ్ఞులగు ఋషులు, స్మృతులయందును పురాణములయందును విధించియున్నారు.

శయ్యామధిష్ఠాయ రాత్రిసూక్తం జపిత్వా విష్ణుం నమస్కృత్య ఇష్టదేవతాస్మరణం కృత్వా సమాధిమాస్థాయ అన్యాన్ శైవవైదికాన్ మంత్రాన్ సావిత్రీం చ జపిత్వా స్వపేత్ ॥ (స్మృతివాక్యము)

పడకపైన కూర్చుండి రాత్రిసూక్తము అను- స్తోత్రమును జపించి విష్ణువును ఇష్టదేవతను ధ్యానించి నిశ్చలచిత్తముతో ఇతర శైవవైదిక మంత్రములను జపించి గాయత్రీ మంత్రమును సయితము జపించి నిద్రించవలెను.

ఈ యర్థమునే విష్ణుపురాణమునందు,

నమస్కృత్వావ్యయం విష్ణుం సమాధిస్థస్స్వపేన్నిశి ॥

అని విధింపఁబడియున్నది. అన్యత్ర

రామం స్కందం హనూమంతం వైనతేయం వృకోదరం ।
శయనే యః స్మరేన్నిత్యం దుస్స్వప్నం తస్య నశ్యతి ॥

భగవంతునిగాని భాగవతోత్తములంగాని స్మరించి నిద్రించిన దుస్స్వప్నము లుండవని యర్థము.

ప్రొద్దుననే ప్రప్రథమమున ధ్యానము చేయుచు, ధ్యానకాలమున చింతించిన ఉత్కృష్టములగు భావనల కనుగుణముగ దినచర్యను లౌకిక వ్యవహారములయందు పరిశుద్ధముగ చేసికొనుటకు దృఢప్రయత్నము చేయుచు, నిద్రించుటకు ముందు తన మనోవాక్కాయ కర్మములను త్రికరణశుద్ధితో పరిశీలించుకొనుచు, నిద్రించుటకు ముందు దేవుని ధ్యానించి సావిత్రీ మంత్రార్థమున కనుగుణముగ సమస్తభూతకోటుల యభివృద్ధి నుద్దేశించి దేవుని ధ్యానించుచు, జాగరూకుఁడై యత్నించు జీవుడు కాలక్రమమున అతిశీఘ్రకాలములోనే చిత్తమును శుద్ధిచేసికొనును. తన యంతఃకరణశుద్ధి దినదినమునకు తనకే స్పష్టమగుచుండును. ఈలాగున యత్నించుచు రాగా కల్యాణగుణములన్నియు ఒకటొకటిగ స్వాభావికములగుచు తద్విపరీతములగు ఆసురసంపద్గుణములు నిర్మూలమగును. అట్లు కామక్రోధములు అహంకార మమకారములు,

దంభ దర్ప పారుష్యములు లోనగు గుణములు క్రమక్రమ ముగ దహించినట్లు పోవును. హృదయగతములగు దుర్గుణ ములు దహించిపోగా హృదయము నిర్మలమై భగవంతునికి నివాసమగును. శ్రీ సదాశివుడు శ్మశానవాసియని గ్రంథము లందు చెప్పఁబడి యున్నది గదా! కామక్రోధాది నీచగుణ వివర్జితమైన హృదయాకాశమే ఆ మహాశ్మశానమని యెరుగ వలెను. అట్లు నిష్కామమై నిర్మలమైన హృదయమే మహా శ్మశానము. అదియే ఆనందవనము. ఈ నామములు వార ణాసికి అన్వయించుచున్నవి. ఈ నిర్మలహృదయమే కాశీ క్షేత్రము. అందు ప్రకాశించు జగదీశ్వరుఁడే విశ్వేశ్వరుడు.

"సదా వసంతం హృదయారవిందే ।
భవం భవానీ సహితం నమామి ॥"

హృదయమును పరిశుద్ధముగ చేసికొనినచో స్వార్థపరత్వము, అహంకార మమకారములు నశించగా అట్టి చిత్తశుద్ధిగల శిష్యుడు దొరకునాయని వెదకుచుండు లోకోద్ధారకులగు పరమగురువులు, మహాత్ములు వాని ననుగ్రహించి వాని హృదయాంధకారమును పోగొట్టి జ్ఞానదీపమును వెలిగించి వానిని తమ ముఖ్య శిష్యకోటిలో చేర్చుకొని వానిని కృతా ర్థునిం జేయుటయేగాక, వానిద్వారా లోకమునందు పార మార్థికబుద్ధిగలవారల కపారమగు ఉపకారము చేయుదురు.

అట్టి మహనీయులే సంసారమునందున్నట్లు నటించుచు, నిష్కాములై లోకహితముకై సంసారులవలె ప్రవర్తించుచుండువారు. వారు తమ చిత్తశుద్ధిచే జీవన్ముక్తులగు మహాత్ముల యనుగ్రహమునకు బాత్రులై లోకమున నిలిచియుండి తమ బోధచేతను ప్రవర్తనముచేతను శ్రద్ధాళువులగు అస్మదాదులకు మార్గమును చూపి జ్ఞానబోధ చేసి, యైహికాముష్మికముల రెంటిని సమకూర్చువారు. మనమందఱమును శ్రద్ధతో ప్రయత్నించి చిత్తశుద్ధి చేసికొనినచో అట్టి మహాత్ముల యనుగ్రహమునకు పాత్రుల మగుదుమనుటకు సందియము లేదు. ముమ్మాటికి సందియము లేదు.

అట్టి ముక్తులగు మహాత్ములు మనల ననుగ్రహించువారిప్పుడును కాచియున్నారు.

"శాంతా మహాంతో నివసంతి సంతః
వసంతవల్లోక హితం చరంతః ।
తీర్ణాః స్వయం భీమభవార్ణవం జానా
అహేతునాऽన్యానపి తారయంతః ॥"

అని శ్రీ శంకరాచార్యులవారు వివేకచూడామణియందు వ్రాసియున్నారు గదా! అట్టి మహాత్ములగు పరమగురువులు ఇపుడును ఉన్నారనియు, లోకహితముకొరకు సంచరించుచున్నారనియును, తాము సంసారసముద్రమును తరించియు

నిర్వ్యాజ కరుణతో నితరులను తరింపజేయ బూనుకొని కంక ణము కట్టుకొని కాచియున్నారని వ్రాసియున్నారు. వారు ఎచ్చటనో యున్నారను చింత అక్కరలేదు. వారి స్థూల శరీరము లెచ్చట నున్నను సరే! వారు మనహృదయకవాట ముల యొద్దనే వేచి యున్నారు. మనమా! ధనకాంక్ష, కీర్తి యందలి యాశ, దారాపుత్రాదులయందలి మోహము మొద లగు గొళ్ళెములు బంధములు భద్రముగ బిగించి వారిని హృదయమునఁ జొరనీయక యున్నవారము. ద్వారములు గవాక్షలును బిగించి లోపలకూర్చుండి సూర్యరశ్మి లేదే అంధ కారముగ నున్నదే యని విచారపడు అంధునివలె గాక, మనము హృదయకవాటములను తెఱచి స్వార్థపరత్వము అహంకార మమకార ధనాపేక్ష మొదలగు గొళ్ళెములను దూరముగ పారవేసినచో ఆ దయాస్వరూపులగు మహా త్ములు హృదయములం బ్రవేశించి జ్ఞానదీపమును వెలిగించి మనలను సైతము వారియంతటివారలను చేయుదురు. అట్లు వారి యనుగ్రహముచే మనము పరిపూర్ణులమై జ్ఞానులమై వారివలెనే లోకకైంకర్యమును చేయుటకు యోగ్యత గలిగి భూతసేవకంటె నెక్కుడు ఆనందము లేదని స్వానుభవముచే తెలిసికొని భగవత్కింకరులమై లోకమునకు అపారమగు మేలుచేయ గలుగుదుము. అట్టి భాగ్యము మనకందఱకును గలుగు గాక! ఆ మార్గమున ప్రవర్తించి అట్టియోగ్యత

సంపాదించుకొనుటకు వలయు పూనికయు స్థైర్యమును భగవంతుడును మహాత్ములును మన కెల్లరకు నొసంగుదురుగాక! వారి యనుగ్రహమువలన మనము లోకహితముకొరకే జీవించువారల కూటములో జేరగలుగుదుము గాక!

"శివాయ లోకస్య భవాయ భూతయే
య ఉత్తమశ్లోకపరాయణా జనాః।
జీవంతి నాత్మార్థం....॥"

మహానుభావులగువారలు లోకముయొక్క మంగళముకొరకును సకలభూతముల యభివృద్ధికొరకును జీవించుచున్నారు గాని ఆత్మార్థము గాదు.

# పంద్రెండవ అధ్యాయము

## అదృశ్యసహాయులు

భూలోకమున నుండువా రెట్లు కష్టపడునది, వారి కెవ్విధమున సహాయము జేయదగినది మనకందఱకు దెలిసిన విషయమే. దీనిని గుఱించి విశేషముగ వ్రాయ నక్కఱలేదు. స్వర్గలోకములోని జీవులకు కష్టమనునది లేనట్లు కఠోపనిషత్తు నందు జెప్పబడియున్నది.

"స్వర్గే లోకే న భయం కించ నాస్తి
న తత్ర త్వం న జరయా బిభేతి ।
ఉభే తీర్త్వాఽశనాయాపిపాసే
శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥"

స్వర్గలోకమున జేయబడు సహాయము జ్ఞానోపదేశరూపముగా నుండును. మరణానంతరము జీవులకష్టములు భువర్లోకముననే అనుభవనీయములు. కనుక భువర్లోకస్థితి నెక్కుడు విపులముగా దెలిసికొనదగు.

కామదేహము కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల కునికి పట్టని పైన చెప్పబడియె. ఇవిగాక అంతరింద్రియమనియు, ఆరవ యింద్రియమనియు చెప్పబడు మనస్సొకటి యున్నది

గదా ! జాగ్రదవస్థలో వీని యన్నిటిద్వారా మనము జ్ఞానము సంపాదించుటకు స్థూలదేహమునందు తగుస్థానము లున్నవి. వీనికి "గోళకము" లని పేరు. శబ్దమునకు శ్రోత్రము, స్పర్శమునకు త్వక్కును, రసమునకు జిహ్వయును, గంధమునకు నాసికయును, రూపమునకు కండ్లును ఏర్పడియున్నవి. ఈ విధమున మనస్సుకు గోళము "మెదడు." ఈ మెద డెంత సూక్ష్మగ్రాహిగానుండిన నంత శ్రేష్ఠము. ఎట్టి జ్ఞానికైనను మెదడు మంచిస్థితిలో లేనిచో అతని జ్ఞానము భూలోకవాసులకు ప్రయోజనకారి కాదు. పెద్ద జ్యోతిమీద కుండ మూసినట్లుండును. ఇదిగాక మెదడు తరచుగా స్థూలాణువులచే చేయబడినది గాన సూక్ష్మేంద్రియములను తేజస్సును పూర్ణముగ జూపుటకు శక్తిగలిగి యుండదు. గనుక సాధారణ మనుష్యుడు నిద్రకాలమునందు సూక్ష్మశరీరములో తాను జేసిన కార్యములను నిద్ర మేల్కొనిన తరువాత జ్ఞాపకమునకు తెచ్చుకొనజాలడు. స్వప్నమునందలి భువర్లోకానుభవములును అచ్చటి ఇచ్ఛాద్వేషములు మొదలగు కామవికారములును (Emotions) భూలోకానుభవములకంటె స్పష్టముగా నుండును.

జాగ్రదవస్థయందు మనము జూపు కామవికారము లన్నియు వాస్తవమున సూక్ష్మదేహమునం దుద్భవించునట్టివి. అవి స్థూలశరీరముగుండా ప్రతిఫలించునప్పుడు వాటియొక్క

వీర్యము తక్కువగా కనబడును. కనుక భువర్లోకమందుండగా కామాదివికారముల స్థితి భూలోకస్థితికంటె నెంత వాస్తవము గాను తీవ్రముగాను ఉండునది మనమూహించుట కసాధ్యము కాదు. వాస్తమున భువర్లోకమున "మాయ" తగ్గియుండును. సత్యలోకమునకు భూలోకమునకంటె భువర్లోకము చేరువై యుండును. భువర్లోకమున జీవులకు నాయాసము లేదు. నిదురయును అవశ్యము కాదు. భూలోకమున ఆయాసము తీర్చుకొనుటకు స్థూలదేహమునకు నిద్ర యత్యావశ్యకము. కాని కామదేహమున కాలాటివేమియు నక్కఱలేదు. నిద్ర కాలమున జీవులు భువర్లోకమున స్వేచ్ఛగా తిరుగుచుందురు. కామలోక జీవితాంతమున మాత్రము భూలోకమున ముసలి వానికి యున్నట్లు బలహీనము కానవచ్చును.

భువర్లోకమున జీవులకు భూలోకమునందు వలె మఱపు గలదు. ముందు దినములలో జేసిన కార్యములు గొన్ని జ్ఞప్తికి రాకపోవచ్చును. అచట అనేకపనుల తొందఱవలన మఱపు హెచ్చుగ నుండవచ్చును కాని విస్మృతిదోషముం డదు. జీవులకు భువర్లోకమున భూలోకమునకంటె తెలివి (సంవిత్) ఎక్కుడుగా నుండును. భువర్లోక స్థితి బెక్కుమందికి తెలియమివలన నచ్చట యెట్టి ఇడుముల పాలగుదుమో యెట్టి సంకటములు ప్రాప్తించునో అను భీతిచే బ్రతికియుండ గనె గుందుచు మృతినొందిన పిమ్మట వారి సంకల్పానుసారము

గనె భువర్లోకమున భయోత్పాతముచే గష్టపడుదురు. ఇట్టి భీతికి మన పురాణములలో నరకముల గుఱించి అతిక్రూరముగా వ్రాయబడిన కథలను చదవడము కారణము. నిక్కముగ నట్లు వెఱగందుట కెట్టి కారణములును లేవు. మఱియు నిచ్చటికన్న నచ్చట పురోవృద్ధి సౌకర్యము లెక్కుడుగ నుండు నని తెలిసి ధైర్యమవలంబించి పరోపకారమునకు నెక్కుడుగ బనిజేయ గలుగుదుమని సంతసించవలయును.

భువర్లోకమున విద్యార్థులు ఎక్కువ శ్రద్ధతో విద్యకు గాను బాటుపడుదురు. పరోపకారము జేయువారు పరహితార్థము కొఱకు పనిచేయుచుందురు. భూలోకములో బనిచేయక తామసగుణ ప్రధానులై కొందఱుందురు గదా! అటులనె భువర్లోకము నందును కొందరు విశేషముగ పరోపకారార్థము పనిచేయ నవకాశముండియు కాలము వృథాపుచ్చుచు సోమరులై యుందురు. మఱికొందరు ఇతరులవిషయమై హితము కాని మాటల జెప్పుచు వృథా ప్రసంగమున కాలము గడుపుచు, ఎక్కువ పాపకర్మ నమకూర్చుకొనెదరు. మనుష్యుడు మృతినొందిన వెనుక, అనగా స్థూలశరీరమును త్యజించిన పిదప జీవుడు చేరు పితృలోకము లీ భువర్లోక భాగములే. చనిపోయినవా రనేకులు తమ పూర్వనివాసముల జుట్టు తిరుగుచు చిరకాలము నచ్చటనే యుందురు. మఱికొందఱు తాము జీవితకాలములో నుండిన గృహమును ఆశ్రయించి

ప్రతిదినము తాము పూర్వము సేవించుచు వచ్చిన దేవాలయములకు బోయి వచ్చుచుందురు. కొందఱు తాము భూలోకములో నుండగా జూడగోరియు శక్యముగాని పుణ్యక్షేత్రముల నిప్పు డేలాటి కష్టముగాని ద్రవ్యఖర్చుగాని లేక దర్శింతురు. స్వార్థపరు లిట్లు ప్రవర్తించుచుందురు. భువర్లోకపు స్థితు లిట్లుండ నచ్చట జీవులు పడునట్టి కష్టము లెవ్వియన:

1. సామాన్య మనుజులకు "మరణ" శబ్దోచ్చారణము వలననె భయము గలుగును. దీనికి వాస్తవమైన కారణము "అజ్ఞానము" తప్ప మరేమియును కాదు. జీవులు భూర్భువ స్వర్లోకములలో స్థూల-కామ-మనో దేహములతో వ్యవహరించుచుందురు గదా! మరణ మన స్థూలదేహమును విడిచి కామ-మనో దేహములతో భువర్లోక సువర్లోకములలో దిరుగుటయే. ఇది తెలియక అజ్ఞానులు తమ బంధుమిత్రులను మరణమున మృత్యుదేవత బలాత్కారముగ తీసికొనిపోయి నరక బాధలపాలు జేయునను తలంపుతో మరణదేవతను (యముని) జూచి భయపడెదరు. అటులనే మృతినొందువారుకూడ తమ బంధు మిత్రవర్గమును విడిచి క్రొత్తచోటునకు బోయెదమనియు నచ్చట తామనేక బాధలబడుదుమను తలంపులతో భీతిల్లెదరు.

2. కొందరు భూలోకము వదలి భువర్లోకము ప్రవేశించినను అజ్ఞానమున తాము మృతిబొందిన సంగతికూడ

దెలియక, భూలోకములోనే తాామున్నట్లు భావించు చుందురు.

3. చనిపోయినవారిని శీఘ్రకాలములో ప్రేతలోకము నుంచి తప్పించి పితృలోకము జేర్చుటకై అపరక్రియల చేయుచు అజ్ఞానమున వారి బంధువులు విశేషముగ దుఃఖింతురు. వారి దుఃఖతలంపులు చనిపోయినవారి పురోవృద్ధికి సహాయపడుటకు బదులు వారి నధోలోకము (భూలోకము)న కీడ్చును. ఇటులనే మృతినొందినవారి స్నేహితబాంధవ వియోగదుఃఖము వారి ఊర్ధ్వలోక దృష్టిని దప్పించి అధోముఖులుగ జేయును. దీనివలన వారి పురోవృద్ధి భంగమగును.

4. కొందఱు భువర్లోకము ప్రవేశించగనే నచ్చటి స్థితిగతుల దెలియక భూలోకమున బల్లెటూరివారు గొప్ప పట్టణము ప్రవేశించి యేమియు తెలియక భ్రమజెందునట్లు నిర్విణ్ణులవుదురు. దిక్కుదోచక భయపడుచుందురు. మఱికొంద ఱాలోకములోనుండు కామదేవతాగణముల భయంకర రూపములజూచి భయపడుదురు.

5. భూలోకమున స్త్రీలోలురుగానుండినవారును, విశేషముగ మద్యపానము జేయుచుండిన వారును, భువర్లోకము జేరినపిదప, స్థూలదేహము లేనందున తమకామముల నీడేర్చుకొనుటకు వీలులేక వారు భూలోకములో నుండినపుడు తాము దిరుగుచుండిన స్థలముల కనిపెట్టుకొనియుండి యచ్చటికి

వచ్చువారి కామముల నుద్రేకపరచి వారి కామతృప్తి ద్వారా తాము కొంచెము తృప్తి జెందుదురు. ఇట్టివారలందఱికిని జ్ఞానోపదేశము జేయుచు, భువర్లోక స్థితిగతుల దెలుపుచును, భయపడినవారి భీతిని పోగొట్టుచు, అనేకమార్గముల వారి వారికి దగునట్టి సహాయముజేయు యోగిబృందము ఒకటి యున్నది. వీరికి అదృశ్యసహాయులని పేరు. అదృశ్యసహాయుల గుఱించియు, పరులకు వారెవ్విధమున సహాయము జేయు నదియు, దివ్యజ్ఞానసమాజపు యోగులు చెప్పిన సంగతులు కొన్నిటి నిచట వివరించెద.

మనుజులందరికి భువర్లోకమున నేకార్యమైనను భూలోకమునకన్న నతిసులభముగ జేయనగునని పైన వ్రాయ బడియె. అయినను సామాన్యముగ మనుష్యులు భువర్లోకమున నేపని జేయుట లేదు. వాస్తవమున తామచ్చట స్వేచ్ఛగా వ్యవహరించగలమను సంగతికూడా వారికి తెలియదు. అథవా తెలిసినను, తామచ్చట యే కార్యము జేసిన నేమి ప్రయోజనము లేదను భావములో నుపేక్షించుదురు. అనేకు లచ్చట వింతలు జూచుచు సుఖములైన మనోవికాసముల జెందుచు ఏ వ్యాయామము లేక తిరుగుచుందురు. అట్టివారికి పరోపకార తలంపులు సామాన్యముగ నుండవు. బలవత్తరమైన కారణముండిన కాని వారు సోమరితనము బోగొట్టుకొని పరోపకారము జేయ నుపక్రమించరు. అయితే దివ్యజ్ఞాన

సమాజములో జేరినవారు తత్సంబంధములైన గ్రంథములను కొంతవరకు చదివి, జ్ఞానమును గ్రహించి ఈశ్వరేచ్ఛను జరుపుటయు, ప్రపంచములో నుండువారందరు తన సహోదరులని తెలిసికొని వారలకు జ్ఞానబోధ జేసి తన్మూలముగ వారి కష్టముల గొంతవఱకు బోగొట్టి వారి పురోవృద్ధి నభివృద్ధి జేయుటయు, తమ ధర్మమని తెలిసికొని అందుకుగా బాటు పడవలయునను తీవ్రాభిప్రాయము వారికి బుట్టును.

అట్టి అభిప్రాయము గలిగిన తరువాత, మనుజుడు తన ధర్మము నెరవేర్చుటకై యేమిచేయవలెనో విచారింతము. పరోపకారము వారి ప్రథమధర్మము. దీని జేయుట యెంత యావశ్యకమైనను, మనుష్యులు తమ కామక్రోధములలో మునిగి అహంకార మమకారాదులచే బీడితులై, తమ ధర్మమును మఱచి స్వార్థపరులై యుందురు. అయితే కొందఱు మాత్రము, పైన చెప్పబడినట్లు కొంచెము జ్ఞానము గలిగిన వెనుక, ధృడసంకల్పులై స్వార్థపరతను విడిచి పరోపకారము చేయుటకు ప్రయత్నపడుదురు. క్రమేణ తాము భూలోకవాసులకు జేయు సహాయములలో దృప్తిజెందక, భువర్లోకవాసులకుకూడ నుపకారము జేయుటకు నుద్యుక్తులగుదురు. జాగ్రదవస్థయందు తరచుగ పరోపకారమునే యోచించుచు ఆ మార్గముననే ప్రవర్తించువారలకు నిద్రాకాలమున సైతము అట్టి సంకల్పములు సహజములుగ నుండు. కావున నిద్రపోవు

టకు ముందు మనస్సు నేకాగ్రముగ జేసికొని పరుల కుపకా
రము చేయు నిశ్చయముతో నిదురపోయినయెడల నిద్ర
యందు జీవుడు స్థూలశరీరమును వదలి సూక్ష్మశరీరములో
నుండు కాలమున సూక్ష్మలోకవాసులగు జీవులకు సహాయము
జేయగలుగును. అస్మదాదులకు నిద్రాకాలమున మాత్రము
భువర్లోకవాసులకు సహాయము జేయనగును. మనకు జాగ్ర
దవస్థయందు భువర్లోకమున ప్రజ్ఞ గలిగి యుండుట దుర్లభము.
ఏకకాలమున భూర్భువస్స్వర్లోకములలో వ్యవహరించగలిగిన
యోగులు సర్వకాలములయందును ముల్లోకములలో నుండు
వారికి దగు సహాయము జేయుచుందురు. భూలోకమునందు
వలె, వానివాని శక్తికొలది, స్వల్పముగనో నిండుగనో మను
ష్యులందఱు భువర్లోకమున పరోపకారము జేయ శక్తిగలిగి
యున్నారు. అయితే భూలోకమున నీటిలో నీదుట కవశ్య
మైన దేహమును శక్తియు ప్రతిమనిషియు పొందియున్నను,
వాడుకలేనివార లితరులవద్ద నేర్చుకొనక నీటిలో నీదలేనట్లు
మనుజులందఱికి నుపయోగకరమైన దేహమున్నను వాడుక
లేనందున వారి కామదేహములను స్వతంత్రముగ నుపయో
గించుట లేదు. ఇదిగాక సామాన్య మనుజులకు వేలకొలది
సంవత్సరములుగ వారి కామములన్నియు భూలోక విషయ
సంగములబట్టి స్థూలదేహముద్వారా కామదేహము జొచ్చు
చున్నందున వారి కామదేహములు స్వతంత్రముగ బాహ్య

విషయముల గ్రహించగలవనియు వానిని వారి ఇచ్ఛాను సారముగ ప్రవర్తింప జేయనగుననియు వారికి దోచదు. అట్టివారు భూలోకవిషయ సంగమును నిరీక్షించుచు భువర్లోక మున కాలము వృథాపుచ్చుచుందురు. పైన చెప్పబడిన దృఢ నిశ్చయులు మాత్రము భువర్లోకములోనివారి కుపకారము జేయుటకు మార్గముల నేర్చికొని యాప్రకారము సహాయము జేయుట కభ్యసింతురు.

భువర్లోకవాసులకు సహాయము చేయుట కనేకమార్గ ములున్నవి. ఒక స్నేహితుడుగాని బంధువుగాని చనిపోయె ననుకొందుము. అతనికి సహాయముజేయ దలచినచో నిద్ర పోవుటకు కొంచెము ముందుగా నతని కెట్టిసహాయము కావల సినను దానిని నెరవేర్చవలయునను దృఢోద్దేశముతో మనము నిద్రించిన జాలును. అత డెచ్చట నున్నాడు, ఎవ్విధమున సహాయము జేతుమను విచారము మన కక్కరలేదు. మనము నిద్రపోయిన తత్క్షణమే భూలోకములో మన స్నేహితుని ప్రక్కన నున్నటులనే, భువర్లోకములోను వానిప్రక్కన జేరు దుము. అయితే మృతినొందినవారి విషయమయి యేలాటి దుఃఖము నుంచుకోదగదు. నిర్విణ్ణతను బొందగూడదు. ఏల యన నవి వారికి బాధ గలుగజేయక మానవు. స్థూలదేహ ముచే బంధింపబడిన భూలోకవాసులకంటె నెక్కువ స్పష్ట ముగ మన దుఃఖాదులను మన కామదేహములద్వారా వారు

తెలిసికొనెదరు. చనిపోయినవారు మనలను జూతురు. అయితే వారు కామదేహమూలముగా మన కామవికారముల మాత్రము దెలిసికొనెదరు కాని, మన భూలోకస్థితి వివరముల తెలిసికొనజాలరు. మనము సుఖముగానుండునది లేక కష్టబడునది వారికి దెలియునుగాని మనము జదువునట్టి గ్రంథ విమర్శగాని మనమేమి యిచ్చట చేయునదిగాని వారికి దెలియదు. మృతిబొందినవారి విషయమయి మనము నిర్విణ్ణత జెందిన నది వారికధైర్యము గలుగచేయును. చనిపోయినవారి విషయములో మనము దుఃఖపడకుండుటయే కాక వారిని గురించి తత్తరపాటుగూడ జెందగూడదు. అదృశ్యసహాయులు శాంతమును వహించి యుండవలసినది అత్యావశ్యకము. పరోపకారము జేయవలయునను ఆతురతతో, స్థిమితముగా నెమ్మదిగ కార్యము నారంభించక, తత్తరపాటుబడితే భువర్లోకమునందు ఆ తత్తరపాటుయొక్క ఫల మేమనగా మనము భయంకర రూపము దాల్చుటయును ఆ ఘోరరూపములు (కామదేహములు) భయంకరమైన వర్ణములతో వెలుగుచుండుటయును భూలోకమును విడిచి భువర్లోకమును క్రొత్తగా ప్రవేశించువారు అచ్చటి స్థితిగతుల కలవాటు బడనందున పైన చెప్పబడిన ఘోరరూపముల జూచి పిరికితనమున నివి పురాణములలో జెప్పబడు భూతములు లేక కింకరులు అని తలచి కేకలు బెట్టుచు పరుగెత్తుదురు. కొన్ని సమయములలో

నా రూపములుకూడా భయపడువారిని తరుమును. కనుక అదృశ్యసహాయులు కామదేహములో వికారములను బుట్టించు నట్టి నిర్విణ్ణత, తత్తరపాటు మొదలగువానిని బొందగూడదు.

అదృశ్యసహాయులలో క్రొత్తవారు కూడ అంత్యావస్థలో నుండువారికి దగు సహాయము జేయదగి యుందురు. చెప్పిన సంగతుల తెలిసికోదగిన మంచి స్మృతిలో వారుండిన, వారి జేరి వారికి భువర్లోక స్థితుల బాగుగ దెలియజెప్పిన, మరణానంతరము వారికి నా జ్ఞానము చాల ఉపయోగకరమ వును. వాస్తవముగ మరణానంతర స్థితుల బాగుగ దెలిసి కుతూహలముతో జెప్పగలిగినవారు మరణ మయనించిన వారి దగ్గిఱ జేరినట్లైతే వారికి మరణభయము తగ్గి యత్యంత దుఃఖో పశమనముగ నుండును. అదృశ్యసహాయులు చనిపోవువారి దగ్గఱ నుండుటకు వీలు లేనియెడల నిద్రాకాలములో భువర్లోక మునుండి యెక్కువ సహాయము జేయదగును. దగ్గఱనుండి నను దూరము నుండినను సమాచారములు దెలియజేయుశక్తి యొక్కటిగనే యుండును. భువర్లోకములో కష్టపడు జీవులు శాంతధైర్యముల నవలంబించునట్లు చేయుటయు, చావు నైజముగాను సులభముగాను వచ్చునది యనియు, అది (చావు) ఘోరమైన పాతాళములో గాని నరకములోగాని పడుట కాదనియు, వారలకు స్పష్టముగా దెలియజేయుటయే అదృశ్యసహాయుల ముఖ్యోద్దేశ్యముగా నుండవలయును. భువ

ర్లోకస్థితియు, అచ్చటి జీవు లేవిధమున నడచిన వారికి సువ ర్లోకము సులభముగ ప్రాప్తించునదియు వారికి తెలుపవలయు. అయితే సహాయము జేయువారు కంపమునొందక ఎంత శాంత మును వహించుదురో నంత పూర్ణముగ నితరులకు సహాయము జేయ గలుగుదురు. వారు కంపము నొందిన, వారితరులకు సహాయము జేయుటకు బదులు కీడును గలుగ జేయుదురు.

మనుష్యు లంత్యావస్థలో నుండునప్పుడు సహాయము జేయుటయే కాక వారు మృతినొందిన పిదపకూడా సహాయము జేయుచు నుండవలెను. అయితే జీవులు మరణము చెందిన వెంబడె కొంతకాలము స్మృతి దప్పియుందురు. అది ఒక రెప్ప బాటు కాలము. మొదట కొన్ని నిముషముల వఱకు నుండును. కొన్ని సమయములలో నది కొన్ని ఘంటలు లేక కొన్ని దిన ములు, కదాచిత్తుగ కొన్ని వారములవఱకు కూడా వ్యాపిం చును. యోగులు మృతిబొందినవారి స్మృతి ఎంతకాలము దప్పిపోవునది తెలిసికొని వారికి తగువిధమున సహాయము జేయుదురు. ఇతరులు ప్రతిదినము నిద్రకాలమున భువర్లోక జీవులకు నెట్టి సహాయము కావలసినను దాని నెరవేర్చుటకు కాచియుందురు. ఇట్టి విషయముల ఖండితముగ జెప్ప నలవి కాదు. దినదినము నిద్రాకాలమున కష్టపడువారి కెవరికైనను సహాయము జేయవలెనను దృఢోద్దేశము ఎల్లరకు నుండవల యును. కష్టపడువారి కెట్టిసహాయము కావలసినను తెలిసిన

తత్క్షణము దానికి దగు ప్రయత్నము జేయవలెను. భువర్లోక జీవులు కొందఱు నిస్సారముగాను బలహీనులుగా నున్న, అదృశ్యసహాయులు తమ ఇచ్ఛాశక్తిచేత వారికి బలము గలుగునట్లు జేయవలెను. ఒకవేళ మృతినొందిన వా రేకారణముననైన జీకాకుపడుచున్నచో వారిజుట్టు నొక శాంతరూపమును కల్పనజేసి వారిని శాంతరూపములో ముంచిన వారి చీకాకుస్థితివదలి వారు శాంతమును వహింతురు.

భూలోకమున వైద్యులు రోగుల యిండ్లకు ప్రతిదినము పోయి వారిబాధల విచారించి తగుమైన యౌషధముల నిచ్చునట్లు, భువర్లోకవాసులకు సహాయము జేయ నిశ్చయించిన వారు కూడ తాము ఉపకరించువారి యిండ్లకు దినదినము పోయి వారికి గావలసిన సహాయము జేయుచుందురు. ఆ సహాయము లెట్టివన, భువర్లోకవాసులలో భయపడువారికి ధైర్యము గలుగజేయుట, దుఃఖోపశమనము, జ్ఞానోపదేశము, వాస్తవార్థములు దెలుపుట మొదలగునవి. భువర్లోకమున దీర్ఘకాలముగ బాధలు పడువా రనేకులుందురు. వారందఱికిని అదృశ్యసహాయులు ప్రతిదినము తగు సహాయము జేసి వారిని ధైర్యవంతులుగాను, జ్ఞానవంతులుగాను మార్చుదురు. ఇట్టి మేలును బొందినవారిలో కొందరు తమ కృతజ్ఞత జూపుటకై తమకు సహాయము జేసినవారి శిష్యబృందములో జేరి తాము పరోపకారము జేయుచుందురు. ఈ విధమున నదృశ్యసహా

యులు గొంద ఱొకటిగాజేరి యొక సంఘముగ నేర్పడి అందులో బాగుగ దెలిసినవా రాసంఘమున కధ్యక్షత వహించి పరోపకారము నెక్కుడుగ జేయుచుందురు.

బాలురు చీకటిలోకి పోవుటకు వెఱచునట్లు, మృతి బొందినవార నేకులు క్రొత్తలో భువర్లోకమును అక్కడి చేతనములను జూచి భయపడుదురు. అట్టివారి కనేక ధైర్యపు మాటలు జెప్పుటకంటె, వారి దగ్గఱజేరి వారితో కొంత కాలము సంచరించిన వారి భయము పోవును. విశేషముగా భయపడువారియొద్ద అదృశ్యసహాయులు కొన్ని సమయములలో నెక్కువకాలము గడుపవలసి వచ్చును కాని వారికి పరోపకారమునందు అనుభవజ్ఞానము విశేషముగా నుండ నక్కఱలేదు. కనుక భువర్లోకములో సహాయము జేయ దలచువారలందఱికిని (పురుషులుగాని, స్త్రీలుగాని, బాలురైనను సరె) వారివారికి దగినట్లు పనులుండును. కొన్ని సమయములలో ననుభవజ్ఞాన మావశ్యకమైనను గష్టపడువారియందు ప్రీతియు సహాయము జేయవలెనను తీవ్రేచ్ఛ నుండిన జాలు. ఈ విధము పరోపకారము జేయువారికి, మితిలేని ఈశ్వరానుగ్రహము గలుగును.

అదృశ్యసహాయులు మరణమునొంది, అనగా స్థూల దేహమును వదలి భువర్లోకమును బ్రవేశించుతఱి, వారి కచ్చటేమియును గ్రొత్తగాని, విచిత్రముగాని యుండదు. వారికి

కృతజ్ఞత జూపువా రనేకులు, తమకు దినములో మూడవ భాగము (నిద్రించువేళ మాత్రము) సహాయము జేయుటకు బదులుగ, తమ స్నేహితులు దినమంతయు భువర్లోకములో నుండి ఆందఱకు సహాయము జేయ గలిగియుందురని సంతోషముతో వారిని జుట్టుకొనుదురు. అదృశ్యసహాయులకు కూడ తాము దినదినము భువర్లోకపు పనిని వదలి భూలోకమునకు బోవు నవసరము నిలిచిపోయినందు కత్యంతానందము బొందుదురు.

భూలోకవాసులగు పరమగురువుల శిష్యులు భువర్లోక సువర్లోకములలోని వారికి సహాయము చేయదలచినప్పుడు స్థూలకామదేహములను వదలి మనోదేహముతో స్వర్లోకమున మాత్రము సంచరించుచుందురు. భువర్లోకమున బని చేయ నావశ్యకమైనపుడు తాత్కాలిక ఉపయోగమునకు నచ్చట యొక కామరూపమును నిర్మాణము జేసికొని పరోపకారము జేయుదురు. ఆ కార్యము పరిపూర్తి కాగానే యా రూపమును నశింపజేయుదురు.

మహాత్ములయొద్ద శిష్యత్వముబొందిన వారెవ్వరికిగాని, సాధారణముగ తమ మనోదేహములను స్వేచ్ఛగా నుపయోగపరచుటకు నలవికాదు. ఏలయన దానికి మననము, పూనికతో బనిజేయుటయం దభ్యాసము నత్యావశ్యకము. సామాన్య మనుష్యులు స్వర్లోకమున దమ సంకల్పరూపములచే జుట్టబడి యుందురు. వారాలోకములోని యావద్వస్తు

వుల నా సంకల్పరూపముల ద్వారానే జూడగలుగుదురు. దీనియందు వారి కేలాటిస్వేచ్ఛ లేదు. వారి సంకల్పములు శుద్ధమైనవి యయినయెడల తత్సంబంధమైన రూపములు ఆ జీవుల పురోవృద్ధికి సహాయకరములుగ నుండును. దుస్సంకల్పులైనవారికి యవి బాధకరములుగ నుండును. కనుక స్వర్గలోకమున తమ ఇష్టానుసారము తిరిగి అచ్చటి సంగతుల గమనించుటకు వారికి శక్తి జాలదు. భూలోకవాసులు తమ మనోదేహములతో బనిజేయునప్పుడు వారి స్థూలకామదేహములు నిద్రించునట్లుండును. అవి దుష్టభూతములపాలు పడకుండుటకై వాటిచుట్టు ఆవశ్యకమైనయెడల నొక యావరణము నిర్మించుదురు. లేక ఆ దేహములకే దుష్టభూతముల వలన గలుగు బాధల స్వయముగా నివారించుకొనగల శక్తి నిత్తురు. దీనికే మన కర్మకాండయందును, మంత్రశాస్త్రమందును "దిగ్బంధము, కవచము" అని పేర్లు ఇవ్వబడి యున్నవి. మనన ధ్యానాదులచే ప్రతిమనిషియు భువర్లోక సువర్లోకములలో వ్యవహరించు శక్తి సంపాదించ గలుగుదురు. అయితే యది ఎంతకాలమునకు వచ్చునది యెవ్వరును జెప్పజాలరు. ఆ శక్తి వారి పూర్వకర్మయును, ఇప్పుడు వారుజేయు పురుషప్రయత్నము ననుసరించి యుండును.

మృతినొందినవారు కొందఱు భువర్లోకమున ప్రయత్నపూర్వకముగా క్రొత్తవిద్యల నేర్చుకొనుదురు. వారికి మృతి

బొంది భువర్లోకములో నుండువా రెవరైనను గాని, లేక నాలోకములో స్వేచ్ఛగా తిరుగగలిగిన భూలోకవాసులు గాని, యీ విద్యల నేర్పవలయును. కాన విద్యయందు విశేష యభిరుచిగలవారలకు, గంధర్వగణములలో గొందఱు సంగీత మును నేర్పుదురు.

భూలోకమున నుండువా రొక్కొకరు నేదో ఒక కాల మున గష్టముల బడియే యుందురు. అట్టి సమయముల దమ కష్టముల నివారించుటకై ఇతరులు వచ్చి సహాయము జేయ వలయునని వారు గోరుదురనుటకు సంశయము లేదు. అట్టి సహాయము జేయువారియందు కొంచమైనను భ్రాతృభావ మున్నగాని, ఇతరులకు సహాయము జేయుటకు వారికి బుద్ధి బుట్టదు. కావున మనముకూడ, లోకములోనుండువా రందఱు త్రైలోక్యకుటింబిని యనబడు జగన్మాతయొక్క బిడ్డల మనియు, ఆ కారణమున మనమందఱము సహోదరుల మనియు స్పష్టముగ తెలిసికొని ఒకరికినొకరు సహాయము చేయుచుండవలెను.

మనుష్యులు మృతినొందిన పిదప వారు చేరు భువర్లోక సువర్లోకములయొక్క స్థితిగతులును, అచ్చట వారు వ్యవహ రించుటకు పొందియుండు ఉపాధులును, అజ్ఞానమున వారు భువర్లోకమున బడునట్టి బాధలును, అదృశ్యసహాయులు వివిధ మున నితరులకు సహాయము జేయుటయు, మొదలగు విషయ

94 | A4 | 59

ముల నన్నిటిని బాగుగ తెలిసికొనినవారు, మరణానంతరము సామాన్య జనులు బడునట్టి యిడుముల దప్పించుకొనుటయే కాక, తా మదృశ్యసహాయ సంఘమువారిలో జేరి ముల్లోక ములలో నుండువా రందఱికిని సహాయము జేయుటకు ఇప్పటి నుండియే ప్రయత్నించదగు. కనుక ఎల్లరును నీ విధమున నభ్యసించుదురని వేడెద.

## పదుమూడవ అధ్యాయము

## ఋషులు జీవన్ముక్తులు

### ఋషులన నెట్టివారు ?

ఋషులన పరిపూర్ణులగు మానవులు. వారికే జీవన్ముక్తులని మఱియొక పేరు. ప్రపంచమునందలి మతములన్నియు, అట్టి పరిపూర్ణులగు మహాత్ము లున్నవారని బోధించుచున్నయవి. మతస్థాపకు లందఱు అట్టి పరిపూర్ణులనియే సామాన్యముగ నెన్నబడుదురు. హిందూమతమున, అనగా, సనాతన ధర్మ గ్రంథములయందు అట్టి మహాత్ములను గుఱించి స్పష్టముగ నిరూపింపఁబడి యుండగా ఇక్కాలమున పెక్కండ్రు మహాత్ములన్నను, ఋషులన్నను అట్టివారును గలరా యని సందేహించుట మాత్రముగాక, పరిహాసము చేయుచున్నారు. అట్టి దురవస్థ మన దేశమునకు ప్రాప్తించినందున, ఋషులున్నారా ఉండినచో వారెట్టివారు అను విషయమును గుఱించి యుపన్యసించవలసి వచ్చినది. ఋషులున్నారనుటకు శాస్త్ర గ్రంథములయందు పెక్కు ప్రమాణములు గలవు. ఇక్కాలమునను అట్టి మహాత్ముల సందర్శనము చేసి వారి యనుగ్రహమునకు పాత్రులైనవారు అనేకులు గలరు. మఱియును అట్టి

మహానీయు లుండుట యుక్తి యుక్తముగను ఉన్నది. మొట్ట మొదట శాస్త్రములయందలి ప్రమాణములను చూచెదము. భగవాన్ శ్రీ శంకరాచార్యులు వివేకచూడామణియందు అట్టి వారిని గుఱించి వ్రాసియున్నారు :

శాంతా మహాంతో నివసంతి సంతో
వసంతవల్లోకహితం చరంతః ।
తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనాన్
అహేతునాఽన్యానపి తారయంతః ॥
అయం స్వభావస్స్వతఏవ యత్పరశ్ర
మాపనోదప్రవణం మహాత్మనాం ।
సుధాంశురేష స్స్వయమర్కకర్కశ
ప్రభాభితప్తామవతి క్షితిం కిల ॥

శాంతులును, మహాత్ములును, వసంతునివలె (అనగా, స్వప్రయోజన మపేక్షించకయే) లోకహితముకొఱకు ప్రవర్తించు వారును, భయంకరమైన సంసారసముద్రమును దాటియును హేతువు లేకయే ఇతరులను తరింపఁజేయువారు ఇప్పుడును జీవించియుండువారు కలరు. పరుల కష్టములను తొలగించుట వారి నైజగుణము. సూర్యకిరణములచే తపింపఁజేయఁబడిన భూమిని చంద్రుఁడు వచ్చి చల్లగాచేసి రక్షించుచుండ లేదా !

పై శ్లోకమున—"నివసంతి సంతః" ఇపుడును జీవించి యుండువారు, "లోకహితం చరంతః" లోకహితముకై

ప్రవర్తించువారు, "తీర్ణాస్స్వయం భీమభవార్ణవం" సంసార సముద్రమును తరించినవారు,—ఈ వాక్యములవలన ముక్తులైనవారు లోకసంగ్రహము నుద్దేశించి యెప్పుడును పనిచేయువారు ఇప్పుడుసైత మున్నారని స్పష్టము.

మఱియును 'యావదధికారం అధికారికాణాం' అను వ్యాససూత్రమునందును, పరిపూర్ణులై ముక్తులైన సిద్ధపురుషులు, అధికారికులై లోకసంరక్షణ కార్యమునం దున్నవారని నిరూపింపఁబడి యున్నది. పూర్వకల్పమున అపాంతరతముఁడను మహాత్ముఁడే యీవల కృష్ణద్వైపాయనవ్యాసులై అధికారికవర్గమున పనిచేయుచున్నారని భాష్యకారులు వ్రాసి యున్నారు.

ఇదిగాక—

"అశ్వత్థామా బలి ర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః ।
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥"

అను ప్రసిద్ధశ్లోకము ఎల్లరకు విదితమే గదా! శ్రీమద్భాగవతమున :

"దేవాపి శ్శంతనోర్భ్రాతా మరుశ్చేక్ష్వాకువంశజః ।
కలాపగ్రామ ఆసాతే మహాయోగబలాన్వితౌ ॥
తావుపేత్య కలేరంతే వాసుదేవానుశిక్షితౌ ।
వర్ణాశ్రమయుతం ధర్మం పూర్వవత్ప్రథయిష్యతః ॥"
(౧౨-3-3౭, 3౮)

శంతనమహారాజు సోదరుఁడగు దేవాపియును ఇక్ష్వాకువంశజుఁడగు మరువును మహాయోగబలముతో గూడి కలాపగ్రామమున నున్నవారు. వారిరువురు వాసుదేవుని యాజ్ఞ మేరకు కలియుగాంతమున వర్ణాశ్రమధర్మములను పూర్వమున్న విధమున పునః స్థాపింతురు.

ఈ మహానుభావులు కలియుగాంతమువరకు ఉండి, లోకమున పరిశుద్ధమగు సనాతనధర్మమును ఉద్ధరించుటకై పనిచేయుదురని స్పష్టముగ నున్నది. కఠోపనిషత్తునందు: "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్ నిబోధత." లెండు, మేల్కొనుడు, మహాత్ములైన గురువులను ఆశ్రయించి జ్ఞానమును ఆశ్రయించుడు.

ఇన్ని గ్రంథములయందు సూచించిన గురువులు సామాన్యశాస్త్రజ్ఞులు గారు సుమా! శ్రీ భగవద్గీతాశాస్త్రమున సూచించినట్లు

ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః ॥ (४-3४)

వారు జ్ఞానులు మాత్రమేగాక "తత్త్వదర్శులు" అనగా తత్త్వమును ప్రత్యక్షముగ అనుభవరూపముగ చూచినవారు.

ఇట్టి ఋషులు జీవన్ముక్తులు. ముక్తులై భూలోకమున స్థూలశరీరధారులై యుండువారు. కావుననే జీవన్ముక్తులనఁబడుదురు. స్థూలశరీరమును వదలిన ముక్తులు విదేహముక్తులనఁబడుదురు. ఋషులని పిలువబడువారు స్థూలశరీరధారులు

గాన, వీరు మనుష్యవర్గములోని వారని స్పష్టము. కావుననే గదా ఆర్యులచే చేయఁబడు నిత్యయజ్ఞములలో ఋషియజ్ఞము చేయునపుడు "నివీతీ భూత్వా" యజ్ఞోపవీతమును దండగా వేసికొని తర్పణము చేయు సంప్రదాయము. "నివీతిర్మనుష్యాణాం" అను శ్రుతి ననుసరించి, మనుష్యవర్గమునందలి వారి నుద్దేశించి చేయు కర్మములయందు జంద్యెము 'నివీతి' గా ధరించవలెను. ఋషియజ్ఞమున ఋషితర్పణముననను, నవ ఋషిహోమాదికర్మములందు జంద్యెము దండగా ధరింతురు. ఇందువలన ఋషులు స్థూలశరీరముతో నుండువారని నిస్సందేహము.

అయితే ఇక్కాలమున వారి దర్శనము మనకేల కాలేదని యడుగవచ్చును. వారిదర్శనము యథార్థముగా నపేక్షించి వారిదర్శనమువలన ప్రయోజనము పొందగలుగు యోగ్యతను సంపాదించుకొనిన వారలకు వారిదర్శనము సిద్ధము. దర్శనము కావలయునని కోరికమాత్రము గలిగి అట్టి పుణ్యమునకు వలయు చిత్తశుద్ధికై యత్నించక, యిష్టానుసారముగ వర్తించుచు స్వార్థపరులై ఇంద్రియనిగ్రహము లేక విషయలోలురై యుండువారలకు వారిదర్శనము గలుగవలెనన్న కలుగనేరదు. వారి మార్గము నవలంబించి, స్వార్థత్యాగులై, లోకసంగ్రహమే ముఖ్యోద్దేశ్యముగ జీవించుచు, తమ శక్తిసామర్థ్యములను, తమ కరణ భోగములను, అనగా

శరీరమును, ఇంద్రియమనోబుద్ధులను, తనకుగల ద్రవ్యాదులను పరోపకారమునకే యుపయోగించుచు 'పరోపకారార్థమిదం శరీరం' అను న్యాయమునకు దృష్టాంతములుగ నుండు వారలకు వారి దర్శనము సిద్ధము. అట్లు వారిదర్శన భాగ్యమును పొందిన పుణ్యాత్ములు ఇపుడును లోకమున ననేకులు గలరు. దివ్యజ్ఞానసమాజము స్థాపించిన శ్రీమతి బ్లవ్యాట్స్కి అమ్మగారును, ఇపుడా సమాజాధ్యక్షులు శ్రీమతి ఆనీబెసెంటు అమ్మగారును, శ్రీయుత యోగీ చార్లస్ లెడ్బీటరుగారును, సి. జినరాజదాసుగారును, మఱియు పెక్కండ్రు ఆ మహాత్ముల అనుగ్రహపాత్రులై వారిని సందర్శించి తమ అనుభవమును లోకమున బాహాటముగ చాటించుచున్నారు. వారి నోటిమాట మాత్రముకాక, వారిలోకమున సాధించిన కార్యములను యోచించి చూచినను, వారి జ్ఞానము, వారి శక్తి, సామాన్య మానవశక్తికంటె విశిష్టమైనదియు, మహాపురుష ప్రసాదసాధ్యమేగాని యితరముగాదని స్పష్టము. వారి వాక్యములు, మనబోటివార్లకు పరోక్షములగు ఆప్తవాక్యములైనను, వారలకు ప్రత్యక్షప్రమాణము. వారు చెప్పినమాత్రమున మేము నమ్మవలయునా! ప్రాతగ్రంథములయందు వ్రాసిన మాత్రమున మేము నమ్ముదుమా? అనువారలకు, అంత మాత్రమున నమ్మ నక్కఱలేదు. బుద్ధి నుపయోగించి యుక్తి యుక్తముగ నుండినచో నమ్మవచ్చునుగాని గ్రుడ్డివానివలె

నమ్మట అనుపయుక్తము. ఇట్టి విషయములు కొన్ని బుద్ధి గ్రాహ్యములు. వారలు స్థూలశరీరముతో నుండు స్థలములకు మనము పోగలిగినచో వారు మనకు దృష్టిగోచరులేగాని ఇచ్చటనుండి యెచ్చటనోయుండు ఋషులు దృష్టి గోచరులు కావలెననుట అసంభావితము. అయినను, పైనసూచించిన రీతిని వారి యనుగ్రహమును పొందినవారలకు వారలు ఎచ్చట దలచిన నచ్చట దృష్టిగోచరులు కాగలరు. వారి యోగబల ముచే ఏకకాలమున పెక్కుశరీరములను కల్పించుకొని శిష్య కోటికి ప్రత్యక్షమయ్యెడి శక్తి వారలకు కలదు. కావున అట్టి యోగ్యత సంపాదించుకొనువరకు వారిని బుద్ధియుక్తితో యోచింతము.

ఋషులు పరిపూర్ణులగు మానవులు, జీవన్ముక్తులు, అని పూర్వము చెప్పితిమి. అట్లన నేమి? వారికి మనబోట్లకును తారతమ్య మేమి? సామాన్యమానవుఁ డెట్టివాఁడు?

మానవుఁడన జీవుఁడు. శరీరము మాత్రము కాదు. శరీరమునందు పనిచేయు ఈశ్వరాంశము జీవుఁడు. ఈశ్వరాంశ మన నేమి? ఒకటి రెండు ఉపమానముల సహాయమున గ్రహించదగు.

"యథా సుదీప్తా త్పావకాద్విస్ఫులింగా
స్సహస్రశః ప్రభవంతే సరూపాః ।

తథాఽక్షరా ద్వివిధాస్సోమ్య భావాః
ప్రజాయంతే తత్ర చైవాపియంతి ॥"
(ముండకోపనిషత్)

చక్కగా మండుచుండు జ్యోతినుండి వేలకొలది అదేరూపము గల నిప్పురవలు పుట్టి యెట్లు బయటవచ్చుచున్నవో, అటులనే అక్షరుఁడగు బ్రహ్మమునుండి సరూపులగు జీవులు వెలువడుచున్నారు . . . . అనగా బాగుగ వెలుగుచుండు మంటవలె ఈశ్వరుని తలచినయెడల అందునుండి వెలువడు నిప్పురవలవంటివారు జీవులు. అనగా, నిప్పురవయందు గొప్ప మంటయందుండు వేడిమియు వెలుతురును అత్యల్పముగనుండి, సరియయిన అవకాశము గలిగినపుడు, రవయును గొప్ప జ్యోతి యెట్లగునో అట్లే ఈశ్వరశక్తియంతయు బీజరూపముగ జీవునియందుండి ప్రపంచమునం దనుభవించు వివిధానుభవములద్వారా బీజరూపమగు శక్తులు క్రమక్రమముగ వికసించి వ్యక్తము కాగా విస్ఫులింగము జ్యోతియగునట్లు జీవుఁడును ఈశ్వరునంతటివాఁడు కాగలఁడు. ఆదియందు జీవుఁడు కించిజ్జ్ఞుఁడుగ నుండి, బహుకాలానుభవము ద్వారా సర్వజ్ఞుఁడు కావలెను. మొట్టమొదట అల్పశక్తిగలవాడు పరిణామమున సర్వశక్తుఁడు కాదగు. అటులనే బీజరూపముగ నుండు ఆత్మశక్తులన్నియు పూర్ణముగ వికసించి ఈశ్వరునివలె సర్వజ్ఞత్వాది గుణములతో పరిపూర్ణుఁడు కాదగు. ఇట్లు పరిపూర్ణ

త్వము పొందుటయే పరమపురుషార్థము. అదియే, ముక్తి ఆదియందు ఆవరించియుండిన అజ్ఞానమును పూర్ణముగ పోగొట్టుకొనుటయే సంసారమును తరించుట. అట్లు తరించిన పరిపూర్ణులే మహాత్ములు, ఋషులు. ఇంకొక దృష్టాంతము. గొప్ప వృక్షమువంటివాఁడు భగవంతుఁడు. ఆ వృక్షము నుండి పుట్టు బీజమువంటివాఁడు జీవుఁడు. వృక్షమునందలి శక్తియంతయు బీజమునందు దాగియున్నది. వృక్షమునందలి శక్తియే ఆ తత్త్వమే బీజమునందు ఇమిడియున్నది. బీజము క్షేత్రములో పడి, భూమిలోపలి వేడిమి చెమ్మయు తగిలి, అంకురించి, భూసారమును క్రమక్రమముగ గ్రహించి మొదటి మ్రానువలె పరిపూర్ణమగును గదా. అట్లే జీవుఁడు, క్షేత్రజ్ఞుఁడు, శరీరములను క్షేత్రమునం బ్రవేశించి, ప్రపంచమున అన్నిలోకములయందు సుఖదుఃఖరూపములగు శీతవాతాతపములను అనుభవించి, వివిధానుభవములవలన పొందదగు జ్ఞానమును భూసారమును గ్రహించి జీర్ణించుకొని బహుకాలానంతరము పరిపూర్ణత్వమును పొందును. అట్లు పొందిన మహానుభావులే ఋషులు. వారు బహుకాలమునకు ముందు మనవలెనే అజ్ఞులుగ నుండి, మనవలెనే సంసారసముద్రమున ఈది సుఖదుఃఖముల ననుభవించి, జ్ఞానమును పొంది కట్టకడపట పూర్ణులై జ్ఞానస్వరూపులై, భగవత్సములైనవారు. వారెట్లు పూర్ణులైరో అట్లే వారు నడచిన త్రోవను నడచినచో

మనము సైతము ఇపుడెంత అజ్ఞానులుగ నుండినను, వారివలెనే పూర్ణులము కాగలుగుదుమని మనకు వారు త్రోవచూపు చున్నారు.

"తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనాః
అహేతునాఽన్యానపి తారయంతః ।"

వారలకీ బ్రహ్మాండమునందు ఇక పొందదగిన జ్ఞానముగాని అనుభవముగాని లేదు. వారు సర్వజ్ఞులు. మనము సైతము అట్లే సర్వజ్ఞులము కాగలము. అట్లు కావలెనను దృఢనిశ్చయము మనకు పుట్టినచో అట్టి తీవ్రమగు ఆశయము పుట్టినది మొదలు, ఆ మహాత్ముల సహాయము మనకు సిద్ధముగ నుండును. ఆకలికొన్న బిడ్డకు తల్లిసహాయమువలెను, ఆర్తి చెందిన కుమారునికి తండ్రిసాయము అడుగకయే కలుగునట్లును, ఆ మహాత్ములు ముముక్షువులకు తల్లియు, తండ్రియు, సఖుడును, విద్యయు, సర్వమును అగుదురు. వారలవలె మనము కావలెనినచో యెట్టిమార్గమును అనుసరించవలెను.

మొట్టమొదట దుర్మార్గప్రవర్తనమును వదలవలయును.

"నావిరతో దుశ్చరితాత్, నాశాంతో నాసమాహితః ॥"
(కఠోపనిషత్)

అనగా దుర్మార్గమునుండి విరమించుకొనవలెను. అసత్యము అన్యాయము పరధన పరదారగ్రహణము మొదలగు అక్రమ

ములను పూర్ణముగ విడువవలెను. మఱియును ఇంద్రియనిగ్ర హము మనోనిగ్రహమును అభ్యసించవలెను. న్యాయముగ నార్జించి ధనమును అనుభవించుటయందును ఇష్టానుసారముగ విషయలోలుడుగ నుండక, యుక్తాహార విహారుఁడై యుండ వలెను. తన స్వభావమున నుండు దుర్గుణములను, ఒకటొకటిగ పోగొట్టుకొని వానికి విరుద్ధములగు సుగుణములను క్రమక్రమ ముగ బలపరచుకొనవలెను. శ్రీ భగవద్గీతలో 16 వ అధ్యా యమున నిరూపించిన ఆసురప్రకృతి గుణములగు అహంకార-బల-దర్ప-కామ-క్రోధ-పారుష్యములను దంభము అభిమా నము మొదలగువానిని పోగొట్టుకొని దైవీసంపద్గుణములను సతతధ్యానాభ్యాసములవలన బలపఱచుకొనవలెను. (ఇవ్విష యముగ ౧౧ అధ్యాయమున విపులముగ వ్రాయబడి యున్నది.)

ఇట్లు దినదినము భగవద్ధ్యానము చేయుటవలనను, అతి జాగరూకతతో తనయొక్క దినచర్యను పరిశీలించి నడవడికను పరిశుద్ధము చేసికొనుటవల్లను చిత్తశుద్ధి సాధించదగు. అట్లు అభ్యసించుచు రానురాను, కామక్రోధములు తగ్గను తగ్గను, స్వార్థపరత్వము కొంచెకొంచెముగ తగ్గి స్వార్థత్యాగము బల పడును. ఆదియందు అన్ని కార్యములను స్వప్రయోజనమునకు స్వలాభమునకై చేయుచుండి, క్రమముగ లాభాలాభము లనే లెక్కించుటకు మారుగ స్వధర్మమునే యోచించుట

ప్రారంభించును. కర్తవ్యములగు కర్మము లన్నియును, ధర్మము లని జాగ్రతతో చేయును. ప్రపంచముయొక్క అభివృద్ధికై పాటుపడును. అపుడు నిష్కల్మషమగు మనస్సుతో పరోప కారము చేయుచు ఉదారస్వభావము గలవాఁడగు. సర్వ కార్యములను ఈశ్వరార్పణబుద్ధితో చేయును. సమస్త భూత ములు, ఈశ్వరుని బిడ్డలుగ నెంచి అట్టి జగత్కుటుంబము నందలి భూతముల సేవయే జగత్కుటుంబియగు భగవంతుని కైంకర్యముగ భావించి తన జ్ఞానము శక్తిసామర్థ్యములు సర్వమును లోకసేవయందు వినియోగించుచు లోకసంగ్రహ పరుఁడగు.

"యో హి మాం సర్వభూతేషు
సంతమాత్మానం ఈశ్వరం।
హిత్వాఽర్చాం భజతే మౌఢ్యాత్
భస్మన్యేవ జుహోతి సః॥"

(భాగవతము 3 వ స్కంధము)

"అనిశము సర్వభూతహృదయాంబుజవర్తియనందనర్చు నీ శు నను నవజ్ఞ సేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనాడంబన మున మూఢుఁడై యుచితభక్తిని నన్ను భజింపఁడేని న మ్మనుజుఁడుభస్మకుండమునమానక వ్రేల్చినయట్టివాడగున్."

(ఆంధ్రభాగవతము)

సర్వభూతముల హృదయములందు నివసించియుండు ఈశ్వరుని నన్ను అలక్ష్యముచేసి, ప్రతిమార్చనమున మునింగిన మూఢుఁడు చేయు అర్చనము బూడిదలో చేసిన హోమముతో సమము. అట్టి భగవత్కైంకర్యము అంత ఎక్కువ ఫలదాయకము కాదు. భూతసేవయే నిజమైన ఈశ్వరసేవ అని శ్రీ కపిలాచార్యుఁడు తల్లియగు దేవహూతికి బోధించియున్నాడు. అట్లు భూతసేవయే ముఖ్య ధర్మముగ లోకమున వర్తించును.

ఇట్టి యున్నత స్థితి యొక జన్మమున పొందుట సాధ్యము కాదుగదా! నానాదేశములయందు, నానామతములయందు, నానాజాతులయందు, స్త్రీ శరీరముతో, పురుషశరీరముతోను పుట్టి వివిధములగు అనుభవములను పొంది ఆయా అనుభవముల వలని జ్ఞానము జీర్ణించుకొని, అన్ని విధములగు అనుభవములు గలవాడగుటచే, అందఱి కష్టసుఖములను తెలిసికొనశక్తిగలిగి, అందఱితో తాదాత్మ్యము చెందగలవాడగు. అట్టివారికి జాతిమత వైషమ్యములు లేశమైన నుండవు. అందఱియందును సమబుద్ధి గలిగి, భగవద్భక్తి, భూతదయ, సత్యము, ఆర్జవము మొదలగు గుణములనే ఎక్కుడుగ సంభావించుచు సమస్త జీవులను సోదరులుగ భావించి భూతసేవ చేయును.

ఇట్టి పదవికి వచ్చిన జీవుఁడు, పైన సూచించిన మహాపురుషుల కటాక్షవీక్షణమును ఆకర్షించును. స్వప్రయోజన

మును స్వలాభమును మరచి భూతసేవ చేయుటకుఁ బూనుటయే అట్టి మహాపురుషుల అనుగ్రహమునకు పాత్రులగుటకు మొదటి మెట్టు. అట్టివారు మొదట ఋషుల కటాక్షవీక్షణమును కొంచెము ఆకర్షింతురు. అట్టి వీక్షణమునకు అల్పముగనైనను పాత్రులైనవారు ధన్యులు. ఆ భూతసేవయందు స్థిరులై, చిత్తశుద్ధికై యెక్కువగ పాటుపడుచురాగా, ఆ మహాత్ముల స్వంత శిష్యకోటిలో నంగీకరింపఁ బడుదురు.

“ధన్యాస్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః ॥”
(వివేకచూడామణి)

(1) ఆ మహాత్ముల ఈక్షణక్షణగతికి పాత్రులై (2) వారిచే శిష్యులుగ స్వీకరింపఁబడినవారు ధన్యులు సుమా.

మొదట వారి వీక్షణమునకు పాత్రుడైనవాడు దివ్యజ్ఞాన సమాజ గ్రంథములయందు “శిష్యకల్పుఁడు” (Probationer) అనియును, ఆపైన స్థిరుడుకాగా, పరమగురువుచే స్వీకరింపఁ బడినపుడు, “స్వీకృతశిష్యుడు” (Accepted Disciple or Chela) అనియును పేర్కొనఁబడుదురు.

ఇట్టివారికి సామాన్యముగ స్వప్నమునగాని ఏకాగ్ర చిత్తముతో ధ్యానము చేయు సమయమునగాని పరమగురువు దర్శనము కలుగును. సామాన్యముగ స్వప్నకాలమున వారి యొద్దచేరి, వారివలన జ్ఞానమును పొందుదురు.

ఇవ్విధమున మహాపురుషునిచే స్వీకరింపఁబడిన శిష్యునికి, వారిదర్శనభాగ్యము గలిగి ఆ "పరమగురుచరణసన్నిధిం" జేరి వారి వాక్యామృతమును గ్రోలుచు వారి సన్నిధిని కైంకర్యము చేయుచు బాహ్యప్రపంచమున మునుపటికంటె నెక్కువ శ్రద్ధతో భూతసేవ చేయుచురాగా, కాలానుసారముగ గురుశిష్యులయం దైక్యభావము మఱియు మఱియు హెచ్చి "గురుపుత్రుఁడు" అను పదవిం జెందును. పిదప పక్వకాలమున పరమగురువునొద్ద నిజమైన పరమోపదేశమగును. దీనికే శాస్త్రములందు 'యోగదీక్ష' అని సంకేతము. అదియే యథార్థమగు 'ఉపనయనము' పరమగురువు సమీపమునం జేరుట. ఇదియే క్రొత్తజన్మ. ప్రథమము మాతృగర్భమునుండి జననము ద్వితీయము గాయత్రీ ఉపదేశము. సామాన్యముగ లోకమున గురువునొద్దచేరి బ్రహ్మవిద్యా స్వీకారము చేసి చిత్తశుద్ధికై పాటుపడుట. తృతీయము యోగదీక్ష. సంపూర్ణముగ స్వార్థత్యాగియై పరమగురువుచే శిష్యుఁడుగ స్వీకరింపఁబడి యథార్థమగు గాయత్రీ విద్యను పొందుటయే యోగదీక్ష. ఈ పదవి దివ్యజ్ఞానసమాజ గ్రంథములలో "ఇనిసియేషన్" "రహస్యోపదేశము" అని నిరూపింపఁబడి యున్నది. ఈ భాగ్యము కలుగుటకు ముందు సాధనచతుష్టయసంపత్తి కొంతమట్టుకైనను సాధించి యుండవలెను. ఈ సాధనచతుష్టయము విషయము "పరమగురుచరణసన్నిధి"

యను గ్రంథమున విపులముగ శ్రీ శ్రీ పరమగురువులే స్వీయ శిష్యుని ముఖమున వెల్లడిచేసి యున్నారు. అందు చదువదగు. ఈ యోగదీక్ష (Initiation) ప్రారంభించినది మొదలు అయిదు మెట్లు ఎక్కవలయుననియు, ఒక్కొక్క మెట్టు ఒక్కొక్క క్రొత్త "ఇనిసియేషన్" తో ప్రారంభమగుననియు, అయిదవ "ఇనిసియేషన్" పొందుటయే యథార్థమగు 'జీవన్ముక్తి' యనియును అనుభవజ్ఞులు వ్రాసియున్నారు. ఈ అయిదు రహస్యోపదేశములు వేదాంతగ్రంథములయందు నిరూపింపఁబడియుండు అయిదు విధములగు సంన్యాసములు, (౧) కుటీచకుడు, (౨) బహూదకుడు, (౩) హంస, (౪) పరమహంస, (౫) అతివర్ణాశ్రమి, ఈ అయిదవమెట్టే జీవన్ముక్తపదవి. ఈ అయిదు సోపానములు అంతరంగధర్మములు గాని బాహ్యచిహ్నములు కావు. ౧. ప్రవృత్తిమార్గమును వదలి నివృత్తిమార్గమున కొంతమట్టుకు నడచి, స్వార్థత్యాగియై పారమార్థిక ధర్మమే స్వధర్మముగ ఆశ్రయించుట. ౨. పరమార్థతత్త్వమును కొంతమట్టుకు స్వానుభవముచే నెఱింగి, తనకు ప్రత్యక్షముగ తెలిసిన జ్ఞానము లోకుల ఉద్ధారణమునకై వినియోగించుచు లోకమున పామరుల కుపదేష్టయై, మార్గదర్శియై నావారు నాదేశము అను అభిమానమును పూర్ణముగ వదలుట. ౩, తాను ఈశ్వరాంశమను జ్ఞానము స్వానుభవముచే ప్రత్యక్షముగ తెలిసి, దేహము, ఇంద్రియములు, మనస్సు,

బుద్ధి, ఇవి యన్నియును అనాత్మస్వరూపములను జ్ఞానము స్ఫురించుట. (హంస అనగా – 'అహం – సః' నేను బ్రహ్మస్వరూపుఁడను) ఆ జ్ఞానమే పూర్ణముగ స్థిరమగుటయే నాల్గవ సోపానమగు పరమహంస పదవి. ఆ స్థితికి వచ్చినపిదప అయిదవ మెట్టు ఎక్కి అతివర్ణాశ్రమి, అవధూత, జీవన్ముక్తుఁడు అను నామముల బరగు ఋషి.

వీరలే గీతాశాస్త్రమునందు సూచింపఁబడిన స్థితప్రజ్ఞుఁడు, భగవద్భక్తుఁడు, గుణాతీతుఁడు. అట్టి మహనీయులు భగవత్సములై బ్రహ్మవిద్యానిధులై లోకమున పామరజనోద్ధారణమే ముఖ్యోద్దేశ్యముగ శరీరధారులై ఏకాంతస్థలముల యందుండియు లోకసంగ్రహమే స్వధర్మముగ నెంచి యోగ్యులగు శిష్యులద్వారా లోకమున పనిచేయుదురు.

వీరలు ఆదినుండి పరుల యుద్ధారణమునకే జీవించుచు, భిన్నభావమును పూర్ణముగ వదలి, లోకసుఖమే తమసుఖము, లోకదుఃఖమే తమదుఃఖముగ భావించుచు ఈ యున్నత పదవి చెందినపిదప, బ్రహ్మాండమున తాము పొందదగిన జ్ఞానమించుకయైనను లేకపోయినను, తామనుభవించని క్రొత్త యనుభవ మొక్కటియు లేకున్నను, తమ చిన్న సోదరులగు మనబోటి అజ్ఞులను విడిచిపో నిష్టములేక "పరశ్రమాపనోదనము" నందే యత్యంత బ్రహ్మానందము ననుభవించుచు లోకమును కాచియున్నవారు. ఇట్టి యున్నతస్థితియే యథార్థమగు

వైకుంఠము. ఇదియే కైలాసము. ఇదియే బ్రహ్మత్వము. ఇదియే "సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం" అని శ్రీ దక్షిణామూర్తి స్తవమునందు నిరూపింపఁబడిన పదవి. ఇట్టి పదవి నొందినవారికి వైకుంఠ కైలాసములు అరచేతియందున్నవి. అనగా వారెచ్చట నుండినను అదియే వైకుంఠము.

అట్టి మహనీయు నొకని వర్ణించుచో శ్రీమతి బ్లవ్యాట్స్కీగారు ఇట్లు వ్రాసియున్నారు:

"అందరికంటె ముందు గమ్యస్థానము ద్వారమును చేరియును ద్వారమును దాటుటలో కట్టకడపటివాఁడు."

అనగా తాను అందఱికంటె ముందు పరిపూర్ణుఁడైనను తాను ఆ నిర్వాణసుఖము ననుభవించుటను విడిచి, పామరులను తరింపచేయుటయే కార్యముగ ప్రపంచమును కనిపెట్టుకొని ఒకరొకరినిగ దాటించుచున్న వారని యర్థము.

శాస్త్రప్రమాణములవలనను, అనుభవజ్ఞులగు కొందఱి సాక్ష్యమువలనను, యుక్తిసాధనమువలనను అట్టి ఋషులు, మహాత్ములు, జీవన్ముక్తు లున్నవారని స్పష్టమగుచున్నది. అట్టి శుభవార్త ముముక్షువులమగు మనబోటివారల కెంత యుత్సాహదాయకమో యోచింపుడు. అట్టివారు మనబోటివారల సద్గతియు, జగత్తు అభివృద్ధియును సమకూర్చుచు సదా పాటు పడుచుండ, మనకు వారి సహాయము సిద్ధముగదా. ఆ ధైర్య

మును మన మవలంబింతము. వారి ధర్మములను, వారి లక్షణ ములను అనుభవజ్ఞులగువారు మన యుపయోగమునకై వ్రాసిన గ్రంథముల ద్వారా తెలిసికొనెదము. శ్రీ భగవద్గీతా శాస్త్రమునందు ౨, ౧౨, ౧౪ వ అధ్యాయములయందు నిరూపింపఁబడిన స్థితప్రజ్ఞ, భక్త, గుణాతీత లక్షణములను చక్కగా గమనింతము. ౧౬ వ అధ్యాయమున సూచింపఁ బడిన దైవీసంపద్గుణములను అభ్యసింతము. పరిపూర్ణులగు మహనీయులను, వారి లక్షణములను ధ్యానించుటవలన, వారి యనుగ్రహమును బొందుటయే గాక "యద్భావం తద్భవతి" అను న్యాయమును బట్టి వారి లక్షణములు నొకటొకటిగ మన స్వభావమునందు స్థిరపడును. మనమును కాలానుసారముగ, ఆ లక్షణములను గలవారమై, ముందు సూచించిన రీతిని, ఆ మహనీయుల కటాక్షవీక్షణమునకు పాత్రులమై శిష్యకల్పు లమై తరువాత స్వీకృతశిష్యులమై, వారలవలన "రహస్యోప దేశము" ల వరుసగ ఒకటి, రెండు, మూడు, నాలుగు, సోపానముల నెక్కి కట్టకడపట వారివలెనే మన వెనుక రా బోవు వారలకు పరిపూర్ణ సహాయము చేయగలవార మగు దుము గాక.

అట్టి మహోన్నత పదవిని పొందినపిదప చేయవల సిన కర్తవ్య మేమో ముందే స్పష్టముగ సూచింపఁబడి యున్నది. శ్రీమద్భాగవతమునందు :

"శివాయ లోకస్య భవాయ భూతయే
య ఉత్తమశ్లోకపరాయణా జనాః ॥
జీవంతి నాత్మార్థ మసౌపరాశ్రయం . . . కళేబరం ।"

అని చెప్పఁబడి యున్నది. ఉత్తమశ్లోకపరాయణులైన మహాత్ముల జీవనము లోకముయొక్క మంగళము, అభివృద్ధి విభూతికొఱకేగాని స్వార్థమునకు కాదు. వారల శరీరము పరులకాశ్రయము. రంతిదేవునివలె, సకల దేహధారుల దుఃఖమును తాము భరించి వారలనందరను దుఃఖరహితులనుగ చేయుటకు యత్నించుచుందురు. మహాపాపులగు అజ్ఞులయందు మఱి యెక్కువ కనికరముతో తాదాత్మ్యము చెంది వా పాపములను తమ పాపములుగ భావించి, వారల నా పా స్వభావమునుండి తప్పించుటకు వారికి వలయు తెలివి, స్థైర్యము, ధైర్యము, పూనిక వీని ననుగ్రహించి వారిని సైతము తమ భ్రాతృలుగ నెంచి కటాక్షించి రక్షింతురు. అట్టి మహాభాగ్యమునకై సర్వదా సర్వభావముల భావించుచు, సదా యత శీలులమై లోకసేవాసామర్థ్యమున పూర్ణులమగుదుము గాక



Printed by C. Subbarayudu at the Vasanta Press, Adyar, Madras
P. I. C. No. 25—18-2-47.